ఏప్రిల్ 1979

సంపుటి : 2 సంచిక : 3

# చతుర

## ఈనెల సమగ్ర నవల

"మంచి పనులు చేయటంతోనే మనిషికి అగ్ని పరీక్ష మొదలవుతుంది...అమ్మా, నాన్నా, అన్నయ్యా వీళ్ళెవరి సహకారం నీకుండదు. ఈ ఇంటితో సంబంధం తెగిపోతుంది. మీ కాళ్ళను నమ్ముకొని మీరు నిలబడాల్సి వుంటుంది...మీరప్పుడు ఏకాకులుగా ఒంటరి తనంతో, ధైర్యంగా తలలెత్తుకుని, కంటిలో ఏ మాత్రం కన్నీటిధార కనిపించకుండా బ్రతక గలగాలి.... ఈ ధైర్యం నీకుంటే అలాగే చెయ్యి..." అని చెల్లెలికి ధైర్యం చెప్పిన ఆ అన్న స్వయంగా తను చేసిందేమిటి? ఈ నాటి యువతరంలో అంతర్గతంగా రేగే ఆదర్శ వాదపు...

## యువజ్వాల

రెండు యువ జంటల జీవిత గమనాల్నెటు త్రిప్పి, ఏ కష్ట నష్టాలకు గురి చేసింది...? చివరి కేమయింది?

## శ్రీసుభా

సమర్థవంతంగా చిత్రించిన ఈ నెల 'చతుర' సమగ్ర నవల 'యువజ్వాల'.

# చతుర

ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ, హైదరాబాద్-500 004

## ముఖ పత్రం

ఈ కాలంలో 'టీ' రుచి చూడనివారు అరుదు. కాఫీ తోటలకు దక్షిణ భారతావని ప్రసిద్ధమైతే 'టీ' తోటలకు ముఖ్యంగా అస్సాం రాష్ట్రం సుప్రసిద్ధం. ఆ అస్సాం 'టీ' తోటలలో పనిచేసే జనపదురాలే ఈ నెల 'చతుర' ముఖపత్ర 'సుందరి'.

## రెండవ కవరు

లండన్ జూలో పుట్టి పెరుగుతూన్న ఈ చిన్న జిరాఫీ వైద్య శాస్త్రజ్ఞులకో పెద్ద సమస్యగా మారింది. ఈ చిన్ని జిరాఫీ వయస్సు 17 నెలలు. అయినా ఎత్తు పెరగటం లేదు. పక్కనే ఉన్న అదే వయసు గల జిరాఫీతో పోలిస్తే తేడా అర్థమవుతుంది.

## మూడవ కవరు

ఆస్ట్రేలియా దేశపు నిప్పు కోళ్ళు గుడ్లు పొదగనారంభించి నప్పట్నించి, పిల్లలు బయట పడేదాకా నిరాహారదీక్ష పడతాయి. అయిదంగుళాల పొడవున్న ఈ పిల్లలు తమ తల్లి అంత సైజుకు పెరిగేందుకు రెండేళ్ళు పడుతుంది.

Free !!! ఉచితం !!

# మతములోని రహస్యము, రహస్యముగా పాటించే మతము

మతములోని రహస్యమేమిటని ఒక భక్తుణ్ణి అడిగినప్పుడు, "మతములోని రహస్యం, రహస్యంగా పాటించే మతము"ని సెలవిచ్చాడు. చేసిన దాన ధర్మాలు నలుగురి దృష్టిలో పడాలని పత్రికలలో ఫోటోలతో ప్రకటించుకొనుట మనలో చాలా మందికి అలవాటు.

మనం ధర్మం చేయునప్పుడు రహస్యంగా ధర్మం చేయాలనీ, ఉపవాసము చేయునపుడు రహస్యంగా ఉపవాసము చేయాలని ప్రభువు సెలవిచ్చాడు. రహస్యమందు చూచుచున్న దేవుడు మీకు ప్రతిఫలమిచ్చునని ఆయన మనుష్యులను పదే పదే హెచ్చరించాడు.

మన పర లోకపు తండ్రి మనుష్యుల [illegible] నరుల పైవేషము చూసి తృప్తి చెందడు. మన దాన ధర్మాలు, ప్రార్థనలు దైవ దృష్టిలో నయాపైసకు కూడా విలువ చెయ్యవు. అందుచే ఒక భక్తుడన్నాడు, ఏమి తీసుకొని వచ్చి మహోన్నతుడైన దేవుని సన్నిధిలో నమస్కారము చేయను? దాన బలులను, ఏడాది దూడలను అర్పించి దర్శింతునా! నా అతిక్రమమునకైనా జ్యేష్ఠ పుత్రుని నేనిత్తునా!, మనుష్యుడా! ఏవి ఉత్తమమో అవి నీకు తెలియజేయబడినవి, న్యాయముగా నడచు కొనుటయు, దీన మనస్సు కలిగి నీ దేవుని ఎదుట ప్రవర్తించుటయు ఇంతే గదా దేవుడు నిన్ను అడుగుచున్నాడు! అసత్యం మన హృదయాలలో నివసించునంత కాలము దేవుని ఎప్పుడూ పొందలేము. నేనే సత్యమని పలికిన క్రీస్తు గూర్చి తెలుసుకున్నారా!

—చదలవాడ చంద్రమతీదేవి

| ఉచితం!!! | ఉచితం!!! |
|---|---|
| భగవత్స్వరూపుడైన ఏసు క్రీస్తు బోధలు ఆయన జీవితచరిత్ర, తెలిపే ఆకర్షణీయమైన పుస్తకంగాని, ఆకర్షణీయమైన డిప్లొమా పొందటానికి ఉచితంగా లభించే బైబిల్‌కోర్సుగాని మీకు కావాలనుకుంటే, మీ చిరునామా మాకు ఈరోజే తెల్పండి. పోస్టుఖర్చులుకూడా మేమేభరించిఉచితంగా మీకుపంపుతాము. | ఇదీ అడ్రస్<br>ఎస్. జాన్ డేవిడ్,<br>A M G.<br>పోస్టు బాక్సు — 12<br>చిలకలూరిపేట.<br>గుంటూరు జిల్లా.<br>A. M. G. |

Gospel Message Inserted By A. M. G.

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# భార్యలవేలం

పూర్వం ఒక తెగలో భర్తలే తమ భార్యల్ని నడి వీధిలో వేలం వేసి అమ్మేసే పద్ధతి చాలా ఆశ్చర్యకరమైనది. చదువుకున్న స్త్రీల సంఖ్య పెరిగి స్త్రీల హక్కులు, స్త్రీ స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మహిళను సంతలో గొడ్లల్లా అమ్మేయడం, స్త్రీని విలాస వస్తువుగా చూడ్డం చాలా వరకూ తగ్గింది. ఇంకా కొన్ని వెనుకబడిన దేశాల్లో భార్యలను అమ్మివేసే పద్ధతి ఇంకా కొనసాగుతూనే వుంది.

19 వ శతాబ్దంలో థామస్ హార్డీ తన 'మేయర్ ఆఫ్ కాస్టర్ బ్రిడ్జ్' నవలలో భార్యల అమ్మకాన్ని గురించీ ప్రస్తావించాడుట. "సంఘంలో వున్న వాటినే నా నవలల్లో వుపయోగించాను గానీ, నేనూహించి రాయలేదు. హోం మార్కెట్టులో ఓ రైతు తన భార్య మెళ్ళో తాడు కట్టి తీసుకొచ్చి అమ్మేయడమే నాకు ప్రేరణ" - అన్నాడు హార్డీ.

ఓసారి వేలంలో ఓ కోపిష్టి భర్త తన భార్య శీలం శంకించి ఈడ్చుకొచ్చి 20 రూపాయలకు అమ్మేస్తే ఆమె ప్రియుడే కొన్నాట్ట.

1970 లో ఒకావిడ భర్త ఇల్లు వదలి వెళ్ళిపోతే ఇరుగూ పొరుగూ దయదల్చి ఆమెకి డబ్బు సాయం చేస్తుండేవారు. ఓ శుభ ముహూర్తాన ఆమెను తీసుకొచ్చి బూస్టన్ మార్కెట్‌లో అమ్మేసి తమ డబ్బు వసూలు చేసుకున్నారు.

1978 జూలై 24 వ తేదీనాటి లండన్ నోటీస్‌లో "సరియైన సమాచారం అందని కారణంగా ఈవారం 'స్త్రీ ధర' చెప్పలేక పోతున్నాం" - అని వుందట.

1814 లో ఓ సైనికుడు తన భార్య శీలాన్ని గురించిన అపవాదులు భరించలేక ఆమెను స్విస్ మార్కెట్టులో 3 పెన్నీలకు అమ్మజూపగా ఒక ధనవంతుని కొడుకు ఇంకో మూడు పెన్నీలు ఎక్కువిచ్చి ఆమెను కొనుక్కున్నాడట.

1882 నాటి జోసఫ్ థాంసన్ అనే వ్యక్తి తన భార్యని వేలంలో 30 షిల్లింగులకు అమ్మేశాడు.

సత్య హరిశ్చంద్రుడు చంద్రమతిని విక్రయించిన కథ మనకు తెలిసిందే! ఆదివాసుల్లో ఈ పద్ధతి బాగా ప్రచారంలో వుంది. పెళ్ళికూతుళ్ళను అమ్మేయడం ఎక్కువగా కనిపిస్తుంది.

పంజాబ్‌లోని లూధియానాలో ఓ ధనవంతుని కుమారునికి పెద్ద పెద్ద కట్నాలిస్తామని ఆడపిల్లలు గల వారెందరో ఎగబడగా, చివరికా పెళ్ళికొడుకు తండ్రి వారందర్నీ కట్నం రేటు పేర్కొంటూ సీలు వేసిన టెండర్లు పంపమన్నారట. అందరూ అలా చేశాక టెండర్లు తెరచి ఎవరెక్కువ 'రేటు' పెట్టారో వారమ్మాయికి తన కొడుక్కు పెళ్ళి చేశాడట.



# చెత్తా చెదారం

ఇల్లు చూసి ఇల్లాలిని చూడమన్నారు. ఇళ్ళు శుభ్రంగా వుంచుకుని ఇంట్లో వున్న చెత్తనంతా వీధిలో పారేయడం సాధారణంగా అందరూ చేసే పనే. ప్రతి రోజూ ఈ చెత్తనంతా పోగేస్తే కేవలం ఒక్క కలకత్తాలోనే 22 వేల టన్నుల చెత్తగుట్ట పడుతుందట.

నగర పారిశుద్ధ్య సంస్థవారు చెత్తంతా పోగేసి వూరి చివర పేర్చడంతో వానా కాలంలో అదంతా కొట్టుకుపోయి నీటిలో కలిసి అటు నీటిని, ఇటు గాలిని కూడా కలుషితం చేసి రకరకాల జబ్బులు వ్యాపించడానికి దోహదం చేస్తోంది.

అందుకని ప్రపంచ బ్యాంకు సహాయంతో నగర పొలిమేరలో 20 చదరపు



కిలోమీటర్ల స్థలంలో ఈ చెత్త కోసం ఓ భూగృహాన్ని కట్టాలని పురపాలక సంస్థ తీర్మానించింది. ఈ స్థలం మీద ఇళ్ళుగానీ, ఫ్యాక్టరీలుగానీ కట్టే అవకాశంలేదట.

బెంగాల్ ఆగ్రో ఇండస్ట్రీస్ సంస్థ చెత్త నుండి కంపోస్ట్ ఎరువును తయారు చేయడానికి ఫ్యాక్టరీ పెట్టేందుకు పథకం వేస్తుంది. దానివల్ల 150 టన్నుల చెత్త నుండి 60 టన్నుల కంపోస్ట్ తయారు చేయవచ్చునట. ఫ్యాక్టరీ శంకుస్థాపన ఇంతవరకూ జరగనే లేదు. ఈ లోపల కలకత్తా వీధుల్లోని చెత్త వింధ్య పర్వతంలా పెరిగి పోవడం ఖాయం!

# పాములతో విందు

పాము పేరు చెబితేనే హడలి పోతాంగానీ పాము మాంసం చాలా రుచిగా వుంటుందనీ, కోడి మాంసం దీని ముందు బలాదూర్ అనీ అంటున్నారు శాస్త్రజ్ఞులు. పైగా దీనిలో పోషకాహార విలువలు ఎక్కువగా వున్నాయట. విషప్పాముల్ని కూడా వాటి తలలు, కోరలు, విష గ్రంధులు తీసేసి తినవచ్చుట.

అసలు పాకే జంతువులన్నీ తినదగ్గవేనని బొంబాయిలోని, కమేండో స్కూలు ఉపాధ్యాయు లంటున్నారు. ఇక్కడ పాముల్ని ఎలా పట్టుకోవాలో కూడా నేర్పిస్తారు.

పాము జీవితకాలం 25నుండి 30ఏళ్లు. ప్రపంచం మొత్తంలో 2,500 రకాల పాము లున్నాయి. పాము శబ్దం వినలేదు గాని, దానికి చాలా సూక్ష్మదృష్టి వుంది. చర్మానికి స్పర్శజ్ఞానం ఎక్కువ.

పాము పాలు త్రాగుతుంది గాని, పాలంటే దీనికి ఎంతో ఇష్టమన్న మాట పూర్తిగా నిజంకాదు. పాము శరీరం బంక

బంకగా వుండకుండా పొడిగా శుభ్రంగా వుంటుంది. పాము పగ బడుతుంది'–



'పాముకి శృంగార ప్రీతి ఎక్కువ'– అన్న మాటలు పూర్తిగా అబద్ధమనీ, కాక పోతే మగ పాముకి రెండు సెక్స్ అంగా లుంటాయనీ వీరు అంటున్నారు.

పాములేమిటి! అన్ని జంతువులూ తినదగ్గవే నంటున్నారు శాస్త్రజ్ఞులిప్పుడు– ధృవ ప్రాంతాల్లో వుండే ఎలుగు బంట్లు, ఉత్తరతీర ప్రాంతాల్లో వుండే 'సీలు' జంతువుల్ని తప్ప మిగతావాటిని హాయిగా భుజించ వచ్చునట.

పక్షుల్లో గ్రద్ద తప్ప అన్ని పక్షులు భోజనార్హాలేనట.

'తినదగు నెయ్యది దొరికిన' అను కుంటే...?

# రకరకాల నిద్ర

ప్రతి జీవికి నిద్ర అవసరం. అయితే అన్ని జీవులూ ఒకే సమయంలో ఒకే విధంగా నిద్రించవు.

మనిషి మేల్కొని వుండే పగటి పూట కొన్ని పక్షులు నిద్రలో గడిపేస్తాయి. కొన్ని జాతుల పాములు శీతాకాల మంతా నిద్రిస్తాయి.

కుంభకర్ణ అనే ఒక జాతి ఏనుగ నిద్రపోతుండగా దాని చెవుల్లో వెయ్యి భేరీలను మోగించినా అది మేల్కొనదట.

చేపలు నీటిలో నిద్రపోయేటప్పుడు కళ్ళు తెరిచే వుంటాయి. లేడి, జిరాఫీ ఒక కంటితో నిద్రపోతూ, రెండవ కంటితో గమనిస్తూ వుంటాయి. గుర్రం ఒక కాలు పైకెత్తివుంచి మూడు కాళ్ళ మీద నిద్రపోతుంది.

'కాస్ కాస్' అనే జీవి ఎప్పుడు మేల్కొంటుందో ఎవరికీ తెలీదు. ఏడా దిలో అది దాదాపు పన్నెండు నెలలూ



నిద్రలోనే గడిపేస్తుంది.

ఎకాసియా, మరికొన్ని నీటిమొక్కలు రాత్రి సమయంలో నిద్రపోతాయి. ఎన్నో జాతుల వృక్షాలు పగలు నిద్రిస్తాయి.

మనిషి తను జీవించే 50 ఏళ్ళలోనూ 20 ఏళ్ళు నిద్రకే ఉపయోగిస్తాడు. 60 ఏళ్ళకు పైగా జీవించినవారు పాతికేళ్ళ

కాలాన్ని నిద్రలోనే గడిపేస్తారు.

ఈ లెక్కల ప్రకారం చూస్తే మనిషి తన జీవిత కాలంలో సగానికి పైగా మేల్కొనే వుంటాడన్న మాట. అంటే ప్రతి పదేళ్ళలోనూ ఆరేళ్ళు మేల్కొని వుంటాడు.



## గ్రంథ చౌర్యం

అలెక్స్ హెయిలీ రాసిన 'రూట్స్' నవల విశ్వవిఖ్యాతి గాంచింది. అలెక్స్ నీగ్రో కావటంవల్ల తన నవలలో నీగ్రోల వంశ వృక్షాన్ని, వారి జీవనగతిని వివరించ గలిగాడు. లక్ష కాపీలకు పైగా అమ్ముడయిన ఆ నవల రాసినందుకు గాను హెయిలీ గౌరవప్రదమైన 'పులిజర్ అవార్డు'ను పొందాడు. అపరిమితమైన ఖ్యాతిని పొందిన ఆ నవలకు ఓ అపప్రద కూడా ఉందట.

ప్రఖ్యాత అమెరికన్ రచయిత హెరాల్డ్ కూర్లాండర్, హెయిలీ రాసిన పుస్తకంలోని కొన్ని భాగాలను ఎత్తి చూపుతూ అవి తన 'ఆఫ్రికన్' నవల నుంచి సంగ్రహించి రాసినట్లు కోర్టులో హెయిలీపై దావా వేశాడు. ఆఫ్రికన్ నవల కూడా లక్ష కాపీలు అమ్ముడయి మంచి ప్రచారాన్ని పొందటం గమనించ దగిన విషయమే!

కూర్లాండర్ వాదనలో అర్థం లేదని హెయిలీ మొదట్లో కొట్టిపారేశాడు. 'రూట్స్' నవల రాయటం ప్రారంభించిన రోజుల్లోనే 'ఆఫ్రికన్' నవలని చదివి నట్లు హెయిలీ తర్వాత అంగీకరించాడు.

కోర్టులో కేసు నడుస్తుండగానే హెయిలీ కూర్లాండర్ రాజీకి వచ్చారు. కూర్లాండర్‌కు పెద్ద మొత్తం చెల్లించేందుకు హెయిలీ ఒప్పుకున్నాడు. ఒకే విషయంపై వచ్చిన రెండు నవలలకు విపరీత ప్రచారం వచ్చి లక్ష కాపీలకు పైగా అమ్ముడు కావటం గొప్ప విశేషమే!

## ఎలుగుబంటి బర్త్‌డే

ధరలు ఆకాశాన్ని అంటుతున్న ఈ కాలంలో, మనుషులు పుట్టిన రోజులు చేసుకోవడం మాట అటుంచి అసలు ఎప్పుడు పుట్టిందీ కూడా మర్చిపోతున్న ఈ రోజుల్లో వాషింగ్‌టన్‌లో టెడ్డీ అనే ఓ బొమ్మ (నిజంగా బొమ్మే, అమ్మాయి కాదు) తన 75వ జన్మదినోత్సవం ఘనంగా వైభవంగా జరుపుకొంది.

నిజం ఎలుగుబంటేనేమో అన్న భ్రమ కలిగించేలా వుంటుంది ఈ టెడ్డీ బొమ్మ. ఓ షాపు యజమాని మారిస్ వార్తా పత్రికల్లో వచ్చే ఓ కార్టూన్ చూసి భార్యకు చెప్పాడు. ఆవిడ పనేసి వూరుకోకుండా ఇంట్లో మిగిలి పోయిన సలుపు రంగు

ముఖమల్ బట్టలతో టెడ్డీకి రూపకల్పన చేసింది.

ఇది చూసి పెద్ద పెద్ద బొమ్మల తయారీ సంస్థలు, మాట్లాడే బొమ్మను తయారు చేస్తే బావుంటుందని రంగంలోకి




దిగారు. అందుకు ప్రోత్సహించిన పెద్ద మనుషుల్లో అమెరికా ప్రెసిడెంట్ రూజ్వెల్ట్ కూడా ఒకరు.

మిసిస్సిప్పీలో ఒకసారి రూజ్వెల్ట్ ఎలుగు బంటి వేటకు వెళ్ళడానికి సన్నద్ధమౌతుడంగా ఓ చిన్న ఎలుగు బంటి పిల్ల అతని గుడారం లోపలికి వచ్చింది. దాన్ని చూసి ముచ్చటపడి, తల్లి ఎలుగును చంపడం ఇష్టం లేక వేట కార్యక్రమాన్ని విరమించుకున్నాడు. ప్రపంచ ప్రాచుర్యం పొందిన ఈ సంఘటన జ్ఞాపకార్థంగా అందరూ ప్రెసిడెంట్‌ను అభిమానంగా టెడ్డీ అంటూ వుండేవారు.

## పడకల ప్రమాదం

జపాన్ విమానశాఖవాళ్ళు తమబోయింగ్ విమానాల్లో దూరప్రయాణీకుల సౌకర్యార్థం. నిద్ర పోయేందుకు వీలుగా రైళ్ళల్లో బెర్తులు మాదిరిగా కొత్తగా కొన్ని పడకలు ఏర్పాటు చేశారు. వీటిని 'స్కై స్లీపర్ల'ని అంటున్నారు.

ప్రయాణీకులు తమ పడక చుట్టూ తెరలు దించుకుని బైటి వారికి కనబడకుండా హాయిగా నిద్రపోవచ్చు. ఈ పడక సౌఖ్యం కోసం అదనంగా 120 డాలర్లు చెల్లించుకోవాలి.

డబ్బుదేముంది గానీ ఈ పద్ధతి మాత్రం బావుందని కొందరు ఘనులు శుభ్రంగా తాగేసి ఆ తెరల లోపల విచ్చలవిడిగా ప్రవర్తించడం మొదలెట్టారు. మనకెందుకని ఎయిర్ హోస్టెస్‌లు చూసీ చూడకుండా పోతుంటే వూరుకోక వారిని కూడా అసభ్యశృంగారానికి ఆహ్వానిస్తున్నారట.

మరికొందరు ఘనులు ప్రయాణీకుల్లా



నిద్రపోతున్నట్లు నటించి, వున్నట్టుండి పిస్తోళ్ళు గట్రా బయటకు తీసి విమానాల్ని దారి మళ్ళిస్తున్నారట.

ఇంత జరుగుతున్నా జపాన్ ఎయిర్

లైన్స్ వాళ్ళు పడకల్ని తీసివేయకపోగా మిగతా సీట్లనన్నింటిని కూడా పడకలుగా మార్చాలనుకుంటున్నారు. అయితే ఆకాశయానంలోనూ స్వర్గసీమను చూడొచ్చన్నమాట!

# మనోవర్తి ముచ్చట్లు

ఆస్కార్ అవార్డు పొందిన ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు లీ మార్విన్ ఓ అమ్మాయితో కాపురం చేసి తర్వాత వదిలేశాడు. ఆవిడ కాలిఫోర్నియా సుప్రీం



కోర్టులో మనోవర్తికోసం దావా వేసింది. "నన్ను శాస్త్రోక్తంగా పెళ్ళాడకపోతే నేంగాక! నేనాయనతో కాపురం చేసినంత కాలం పెళ్ళాం చేసే సేవలన్నీ చేశానుకదా! మరి నాకు భార్యలాగే ఆస్తిలో వాటా అడిగే హక్కు ఎందుకులేదూ!" అతని కున్న ఆస్తిలో సగం ఇచ్చి తీరాల్సిందే అంటోందావిడ. ఆ సగం విలువ 10 లక్షల డాలర్లు మాత్రమే. పైగా లీ మార్విన్ మహాశయుడు ఆవిడతో సుఖంలో మునిగి తేలుతున్న రోజుల్లో జీవితాంతం ఆవిడను పోషిస్తానని హామీ ఇవ్వగా మురిసిపోయి తను నిక్షేపం లాంటి వుద్యోగం వదిలేసి అతన్నే నమ్ముకుని వుండిపోయానంటుందామె.

కోర్టువారు అంతావిని "శుభం! అంత డబ్బు అడిగే హక్కు నీకుందిటే!" అనేశారు, దాంతో ఇప్పుడు అమెరికాలో ఇలాంటి మనోవర్తి కేసులు ఎక్కువయ్యాయట. అక్కడ పెళ్ళి పెటాకులూ లేకుండా కలిసి కాపురం చేస్తున్న జంటల సంఖ్య కనీసం 10 లక్షలుండొచ్చని అంచనా. ఇహ వాళ్ళలో విడాకులిచ్చి విడిపోతుండే వాళ్ళ సంఖ్య మనకు తెలిసిందే గదా!

# సూట్లు సరఫరా

ఇంగ్లండులోని వివిధ సంస్థలు తమ వద్ద పనిచేసే బ్రిటిష్ అధికారులందరికి ఉచితంగా సూట్లు కుట్టించి ఇస్తున్నారట. తమ ఆఫీసుల్లో పనిచేసే వ్యక్తులు హుందాగా, గంభీరంగా కనిపించాలనేది వారి ఉద్దేశం. 'హీప్‌డిచ్ అండ్ కంపెనీ' అనే టైలరింగ్ సంస్థ ఈ అయిడియా ఇచ్చింది. వీరి దగ్గరికొచ్చే కస్టమర్లంతా అమెరికా, జర్మనీ, ఫ్రెంచ్, అరబ్ దేశాలకి చెందిన వాళ్ళు. వారితో పోలిస్తే బ్రిటిష్ వాళ్ళు సరియైన సూట్లు లేకుండా వుండడం ఎంతో అవమానంగా భావించి కొన్ని సంస్థలకు సలహా ఇవ్వగా వారూ సమ్మతించి ఈ ఏర్పాటు చేశారు. ప్రతి అధికారి 750

డాలర్ల ఖరీదు చేసే బట్టలు ఈ సంస్థ నుండి తీసుకోవచ్చు. ఈ డబ్బుకి ఒక మంచి సూటు, ఆరు షర్టులు వస్తాయట. వీటినే చిరిగే వరకు తొడుక్కోనక్కర లేకుండా రెండు సంవత్సరాల తరువాత సూటు, సంవత్సరం తర్వాత షర్టు వాపస్ ఇచ్చి కొత్తవి తీసుకోవచ్చు. పాత వాటిని వాలంటరీ సంస్థలకు ఇచ్చేస్తారు.

ఇంత గొడవ ఎందుకయ్యా? అంతంత జీతాలు పుచ్చుకుంటూ అధికారులు మంచి బట్టలేకుట్టించుకో లేరా అనేందుకు వీల్లేదు.

సంవత్సరానికి 20వేల డాలర్ల జీత గాళ్ళు 50 శాతం, 48 వేల డాలర్ల జీత గాళ్ళు 83 శాతం ఆదాయం పన్ను



చెల్లించాలట. మిగిలిన ఆదాయంతో పెళ్ళాం పిల్లల్నే పోషిస్తాడా! అతిథుల్నే ఆదరిస్తాడా! బట్టలే కొంటాడా!

# వింత మార్పు

జపాన్‌లోని ఒకాసా ప్రాంతంలో సంఘ విద్రోహుల ఆగడాలు పెరిగి పోవ డంతో స్థానిక పౌరులంతా కలసి ఒక



ప్రణాళికను ఆలోచించారు. దుండగుల దురాగతాలను వర్ణిస్తూ, ప్రజలు అప్రమత్తులై వుండాలని హెచ్చరిస్తూ కరపత్రాలు ముద్రించి అన్ని గోడల మీదా అంటించారు. అవి చూసి ప్రజల్లో చైతన్యం వచ్చింది. ఓ నగల వ్యాపారిని బెదిరించి వారి ముఠా నాయకుడు భద్రతా చట్టం క్రింద అరెస్టు అయ్యాడు. ప్రజల్లో వచ్చిన ఈ మార్పుకి గుండాలు కాస్త జంకారు.

కొద్ది రోజుల్లోనే ఈ పద్ధతి జపానంతా వ్యాపించి, ప్రజలు పోలీసులు, వార్తా సంస్థల మద్దత్తు తీసుకొని సంఘ విద్రోహుల పైన, దొంగల పైన బాగా వత్తిడి తీసుకురావడంతో దేశంలో దొంగతనాల సంఖ్య తగ్గింది.

గత ఏడాది జూలైలో ఒకాసా యువకులు కొందరు పేరుమోసిన ఓ నేరస్తుని ఇంటికి వూరేగింపుగా వెళ్ళి అతన్ని ఘెరావ్‌చేసి "నువ్వు నేరాలు మానేసి మంచి పౌరుడిగా వుండి పోతావా? లేక దేశం వదలి వెళ్ళిపోతావా?" అని నిలేశారు. అతగాడు దేశం వదలిపోలేదుగాని అటు తర్వాత నేరాలు మాత్రం చెయ్యలేదు.

సారధికి అన్నం పెడుతూ తల్లి లక్ష్మమ్మ గారు చెప్పింది.

"అన్నయ్య పెళ్ళిరా వచ్చే నెల్లో. ముహూర్తం వచ్చే నెల్లో బావుందని రఘుపతిగారు ఉత్తరం రాశారు".

"అయితే మనందరం ఢిల్లీ వెడతామన్నమాట" అన్నాడు.

"నాన్నగారు అంత దూరం ఎందుకు, వాళ్ళ స్వంత ఊరు ఉయ్యూరట, అక్కడ చేయండి, మీకూ మాకూ సులువుగా వుంటుంది' అని రాసామంటున్నారు"

"నాన్న వుద్దేశం మనకి ఖర్చులు మిగులాయని".

"వెధవ మాటలు. మనం మగపెళ్ళి వారం. హుందాగా మాట్లాడాలి".

"అయితే కట్నం తీసుకుంటున్నామా అమ్మా మనం"

"ఎందుకు తీసుకోమూ"

సారధి నవ్వేసి అన్నాడు "ఇక హుందా ఏమిటమ్మా! కట్నానికి కొడుకును అమ్ముకుంటున్న నిన్ను వదిన ఎందుకు గౌరవించాలిట"

"ఏడిసినట్టే వుందిలా...కట్నం తీసుకోకపోతే లోకువ. ఒట్టినే పిల్లను తెచ్చుకుందుకు మనం తేరగా ఉన్నామా? రేపు మాలతికి ఇవ్వద్దూ..."

"ఏమోనమ్మా! కాలేజీలో కట్నం తీసుకోవడం ఘోరం అని నేనివాళ మాట్లాడుతున్నాను. ఇంటివగ్గరే నాకు చుక్కెదురు. ఏం చెయ్యను"

ఇంతలో మాలతి వచ్చింది భోజనానికి.

"అన్నయ్యా! మనం పెళ్ళివారం అయ్యాం. అమ్మా! నాకు ఫారిన్ నైలెక్స్ చీర కొంటానన్నావు గుర్తుందా" అంది తల్లితో. ఆపైన పీట వాల్చుకుని కూర్చుంది.

"మాలతీ! ఇంతకి పెళ్ళి అన్నయ్యకా, నీకా?"

"నీకూ" అంది అక్కడే వున్న విసనకర్ర ఎత్తి.

"ఇలా విసనకర్రలెత్తే రకానివని తెలిసే మరో వెయ్యి ఎక్కువడుగుతాడు రాబోయే బావ. అమ్మా! మాలతిని మంచి హౌస్ వైఫ్‌గా తీర్చిదిద్దవే"

"మాలతికేంరా! బంగారు బొమ్మ. ఎదురిచ్చి కోడలుగా చేసుకుంటారెవరయినా"

"పాపం అరుంధతి వదిన్ని కూడా వాళ్ళ అమ్మగారుఇలానే దీవించి వుంటారు? వడ్డీతోసహా చెల్లిస్తున్నారు. దబ్బిచ్చి ఆ మహాతల్లి కష్టాలకు స్వాగతం పలుకుతోంది"

"నోర్మూసుకుని కాలేజీకి పోతావా? నాన్నగారిని కేక వేయమంటావా ??"

"వెడుతున్నాను" అంటూ సారధి పీట మీదనుంచి లేచి "మాలతీ! రేపు మేము రవీంద్రభారతిలో నాటక ప్రదర్శన ఇస్తున్నాం. అమ్మని తీసుకుని నువ్వు థియేటర్‌కి వచ్చెయ్యి" అన్నాడు.

అప్పుడే వంటింట్లోకి వస్తూ కాంతారావు "నాటకం ఏమిట్రా ?" అంటూ అడిగాడు.

"మేం 'పెళ్ళి ఖరీదు' అనే నాటకం వేస్తున్నాం అన్నయ్యా!" సారధి చెప్పాడు.

"మనం ఫైనలియర్ చదువుతున్నాం. మర్చిపోయావేమో! పరీక్ష చెట్టెక్కితే అప్పుడు ఏడుస్తావ్. వెధవ నాటకాలు" అంటూ కాంతారావు విసుగ్గా అన్నాడు.

సారధికి, నాటకాన్ని 'వెధవది' అని తిట్టడంతో అన్నగారిమీద మండిపోయింది.

అయినా తమాయించుకున్నాడు. తలుపు దగ్గరగా వేసి వీధిలో పడ్డాడు.

నిజమే! అన్నగారు తనకన్నా ఆరేడేళ్ల పెద్ద. ఏదో అన్నాడని సరిపెట్టుకోవచ్చు. కానీ ఎప్పుడూ ఎబ్యూజ్ చేస్తూనే వుంటాడు.

కాలేజీ రోజుల్లో తను తిరగలేదా. తిరిగాడు. తనకి జ్ఞాపకం. పబ్లిక్‌గార్డెన్‌లో మూల కూర్చుని సిగరెట్లు కాల్చేవాడు. ఎంతో మంది అమ్మాయిలతో షికార్లు చేసేవాడు. ఆఖరికి ఓ రోజు స్నేహితుల ఇంట్లో మందు పార్టీలో కూడా తన కంట పడ్డాడు. తన స్నేహితుడు ప్రసాద్‌తో చెప్పాడు.

"అలాంటివి పట్టించుకోకూడదురా! మనిషికి అంతర్యంలో మంచితనం అంటూ వుంటే ఇలాంటి తిరుగుళ్ళు తాత్కాలికమే అంటారు. బ్రాందీ బాటిల్‌తో మనిషి సంస్కారాన్ని కొలిస్తే మన దేశంలో అందరూ పశువుల లెఖ్ఖలోకి పోతారు తెలుసా?"

సారధి తన మిత్రుడికి అంతకన్నా చెప్పలేకపోయాడు. అసలు సారధికి అంతర్యంలో అన్నగారికి చిన్నప్పటినుంచి కూడా పెద్ద పీట వేయలేదు. కారణం ఇదీ అని విడమర్చి చెప్పలేడు. ఆలోచిస్తేచాలా కారణాలు సూక్ష్మంగా మనఃపలకంమీద ముద్ర వేసుకున్నవి కదులాయి...అవి చెద పట్టిన పాత ఫొటోల్లో మనుషుల రూపు రేఖల్లా మనసులో ముద్ర పడి ఉన్నాయి. అందులో సారధికి తరుచు గుర్తుకువచ్చే వ్యక్తులు తండ్రి సుబ్బ రామయ్య, అన్న కాంతారావు.

సారధి చిన్నతనం నుంచీ తల్లిదగ్గర చనువు. తల్లి అంటే ప్రేమ. ఎందుకో ఏ విషయానికీ తండ్రి దగ్గరకు వెళ్ళేవాడు కాదు.

బాగా చిన్నప్పుడు తండ్రి తనని ఎక్కడికో తీసుకువెళ్ళాడు. ఆ ఇంట్లో పడకగది వుంది. ఆ గది తను ఎప్పుడూ చూడలేదు. మంచి సెంటువాసన. తండ్రి పక్కన నిద్రపోయాడు. ఓ రాత్రివేళ అది కలో నిజమో తెలియదు. తండ్రితో ఎవరో మాట్లాడుతున్నారు. ఎవరో ఆడ మనిషి. కళ్ళు చిట్లించి చూసినా తల్లి అన్పించలేదు. ఆ మనిషి తండ్రితోకలిసి తన తల్లిని తిట్టింది. అదే గుర్తు. చాలా రోజుల తర్వాత వంటింట్లో తల్లి ఏడుస్తూ కన్పించింది.

'అమ్మ ఎందుకు ఏడుస్తోంది? అమ్మని ఎవరేమన్నారు? బహుశా అది అయ్యుం టుంది. సారధికి తల్లి ఏడుపుకీ, తండ్రి తీసుకువెళ్ళిన ఇంటికీ-అక్కడి ఆడ మని షికీ వున్న చుట్టరికం తెలియడానికి మరో పదేళ్ళు పట్టింది. సారధి అప్పుడే చూశాడు 'సుమతి' సినిమా చూసి వస్తూంటే మన సెందుకో మూలిగినట్టు వినబడింది.

కాలేజీ పాఠాల్లో "వన్ ప్లస్ వన్ ఈజ్ ఈక్వొల్ టు టూ"అనేఈక్వేషన్‌కి అర్థంతో పాటు ఇంటిలో బాధల వెనక, తల్లి కన్నీటి అడుగు కథ అర్థం కూడా తెలిసొచ్చింది.

ఓసారి తల్లిని అడిగాడు.

"నా చిన్నప్పుడు నువ్వు ఏడ్చేదానివి. ఎందుకే అమ్మ" అని. లక్ష్మమ్మగారు నవ్వేసి "ఎప్పుడ్రా" అని "వెధవ్వి ఇవన్నీ గుర్తుంటాయి. మార్కులు చూస్తే అత్తెసరు మార్కులే ఫో" అంది.

కానీ మరో రెండేళ్ళకి తల్లి, మామ గారి గురించీ, తండ్రి గురించీ వాళ్ళు

ఆస్తులు తగలేసిన విధానం గురించీ, ఉంచుకున్న భోగం వాళ్ళతో మరో కాపురం వెలిగించిన సంగతులూ ప్రేక్షకురాలిగా చెప్పడం సారథి వింతల్లో వింతగా వుండేది. సారథికి తల్లి అమాయకత్వం మీద జాలి కంటే కోపం వచ్చేది. తల్లి నటిస్తోంది. కడుపులో కడలిని దాచుకుని సంసారం చేయడంలో వ్యక్తిత్వాన్ని మర్చిపోయింది.

తల్లి అశక్తురాలు; కన్నవాళ్ళు పెళ్ళి చేసి అత్తవారింటికి అమ్మివేస్తే స్థల మార్పు చెందిన ఓ స్తబ్ద జీవి. ఈ భావనతో సారథికి ఆవేశం వచ్చేది. ఆ ఆవేశం పొరలుపొరలుగా వచ్చేది. వయస్సు ఒక్కొక్క కుబుసం విడిచిపెడుతూంటే చుట్టూతా వున్న మనుషుల్ని చూస్తూంటే వాళ్ళల్లో అపకారాలు కన్పిస్తే తట్టుకో లేకపోయేవాడు. కాలేజీలో చదివిన ఇబ్సెన్ 'డాల్స్ హౌస్' మనసులో అగ్రపీఠం అతనికి తెలియకుండానే సంపాదించింది. చలం కథలు నవలలు అతన్ని కుదిపి కుదిపి వదిలేవి!

సారథి ఆలోచనలు కాలేజీ గేటు చూసిన తర్వాత చెదరిపోయాయి. క్లాస్‌కి వెళ్ళాడు. పాఠాలు వినబుద్ధి కాలేదు. మనసంతా సాయంకాలం జరగబోయే డిబేట్ మీద వుంది. ఓ మూల బెంచీ మీద కూర్చుని తనకు నచ్చిన భావాల్ని కాగితం మీద నోట్ చేసుకున్నాడు.

సాయంకాలం అయింది. సారథి ముందు మాట్లాడవల్సి వచ్చింది. గంభీరంగా ఝంఝూమారుతంలా సాగింది ఉపన్యాసం. అందరూ చప్పట్లు కొట్టారు. తరువాత అమ్మాయిల వంతు.

సారథి అమ్మాయిల ప్రసంగం చెవి పెట్టి విన్నాడు. ప్రతివాళ్ళూ "కట్నం తీసుకోవడం అన్యాయం. మగవాళ్ళు మరీ దోపిడీ దొంగల్లా తయారయ్యారు. సమానత్వం కావాలి" అంటూ మాట్లాడారు. ఏ అమ్మాయీ "నేను కట్నం తీసుకునే మగ మహారాజుని తిరస్కరిస్తాను" అన లేదు. సారథికి అన్పించింది-వీళ్ళెవరూ సబ్జెక్ట్‌కు రియాక్ట్ కాలేదేమోనని. అతనికి నవ్వొచ్చింది, వీరేశలింగం గారొచ్చి "విడో రీమేరేజెస్" జరగాలని మగవాడయ్యిండి ఆయన రియాక్ట్ అయితే గాని విప్లవం రాలేదు.

ఏమో-బాధపడే వాళ్ళ కంటే, బాధపడే వాళ్ళని చూసే వాళ్ళకే ఎక్కువ తపనా, వేదనా రగుల్తుందేమో! లేక ఆడవాళ్ళు సంఘోద్ధరణ మగవాళ్ళ బాధ్యత అని ఊరుకుంటారో తెలియదు.

అధ్యక్షుడు లేచి తన తుది మాటలు చెప్పాడు. ఆఖర్ని ముచ్చటగా హాస్య ధోరణిలో హెచ్చరించాడు కూడా!

"మీలో ఎవరైనా కట్నం తీసుకోకుండా పెళ్ళిళ్ళు చేసుకుంటే చాలా మంచిదే! క్షేమం ముందుండి పెళ్ళిళ్ళు చేయిస్తాం. ఆ ఉద్దేశం ఉన్నవాళ్ళు తమ ఎడ్రస్ వ్రాసి ప్రిన్సిపాల్ గారికి ఇవ్వండి. ఈ తతంగం రహస్యంగా కాపాడే బాధ్యత కూడా మాదే. ఇక నేను చెప్పేది-మీరందరూ మైనర్స్, అంటే విచ్చుకునే పువ్వులన్న మాట. మీలో ఆవేశానికి ఆచర్యానికీ ఎన్నో అడ్డంకులు రావచ్చు. ఒకవేళ-కాని పరిస్థితుల్లో మీరు కట్నం తీసుకున్నా నామకహా తీసుకోండి. కానీ రేపు మీపిల్లల విషయంలో మీరు దృఢంగా నిలబడండి. ఎందుకంటే మీరు ఈ తరం మనుషులు. మీకు వ్యక్తి స్వేచ్ఛ

వుంటుంది. అది దాన్ని కాపాడి, పెంచు కుంటూరండి. మంచిపని చేయవానికి కాలా తీతం అనేమాట అడ్డురాకూడదు నమస్తే."

సారధికి ఆయన వాగ్ధోరణి నచ్చలేదు. ఈవేళకాని పని రేపు చేయమనడంలో ఔచిత్యం అర్ధం కాలేదు. లేచి బయటకు వెడుతూంటే వెనకే ఎవరో భుజంమీద చెయ్యి వేశారు.

సారధి వెనక్కి తిరిగి చూశాడు. అధ్యక్షుడు శ్రీనివాసరావుగారు.

"బాగా మాట్లాడావోయ్. ఎవర బ్బాయివి?" సారధి చెప్పాడు.

"అంతా బాగానేవుంది. అయితే సుబ్బ రామయ్య కొడుకువి అన్నమాట. మరి మీ నాన్న మీ అన్నయ్య పెళ్ళికి కట్నం తీసుకుంటున్నాడా?" సారధి తలపంచు కున్నాడు.

"మీనాన్న వదుల్తాడా. పోనీ నువ్వ యినా కట్నం తీసుకోకు."

"అలానే నండి."

అధ్యక్షుడు కారెక్కి వెళ్ళిపోయాడు. సారధి తల కొట్టేసినట్టయ్యింది.

ఇంటికి వెళ్ళి కాంతారావుని బాగా తిట్టాలని, ఎత్తి పొడవాలనీ నిర్ణయించు కున్నాడు.

పెళ్ళి కొడుకుగా అన్నగారినీ,పక్కన అరుంధతి అనే అమ్మాయినీ ఊహించుకో సాగాడు. ఇద్దరి మధ్యనా అడ్డుగా డబ్బు కొల్లలుగా పడివుంది. అన్నగారు డబ్బుని నొల్లు కుంటున్నాడు. జేబులు నిండినా ఇంకా నోట్లు పడివున్నాయి. కాంతారావు భార్యవైపు చూశాడు. భార్య ఏడుస్తోంది కన్నీరు ధారగా పడుతోంది. ఆ కన్నీ టితో నోట్లన్నీ ముద్ద అయ్యాయి. కాంతా రావు ఒక్కసారిగా ఆ ముద్దని కలిపి వుండచేసి మింగి భార్య చేతిని పట్టుకుని నడిపించుకుని పోతున్నాడు.

"ఛఛ" అనుకుని సారధి నుదురు తుడుచుకున్నాడు. అప్పుడు గుర్తొచ్చింది రిహార్సెల్స్‌కి వెళ్ళవల్సి వుందని. గబ గబా రిహార్సెల్స్ జరిగే స్కూల్ బిల్డిం గ్‌కి బయలు దేరాడు.

హాలంతా జనంతో నిండిపోయింది. అవును ఫైనల్ రిహార్సెల్స్. కాలేజీలో జరిగే పోటీ నాటకం. డైరెక్టర్ ఊళ్ళో పేరు పొందిన రామేశం గారిని రిహార్సె ల్స్‌కి ఆహ్వానించాడు.

సారధి అప్పటికి రామేశంగారి పేరు విన్నాడు. ఆయన డైరెక్ట్ చేసిన నాట కాలు చూశాడు. నటులందరూ క్రమ శిక్షణ పొందిన సిపాయిల్లా ఏక్ట్ చేయడం వింతగా వుంటుంది. పాత్ర ఉచ్చారణ, కదలిక, వేగం అన్నీ పందెపు గుర్రాల్లా పరిగెడతాయి. తెలుగు నాటక రంగానికి రామేశంగారు కొత్త ఊపిరి పోశాడని పిస్తుంది.

సారధి నాటకం రిహార్సెల్స్ అయిన తరువాత రామేశం గారిని కలుసుకుని నమస్కారం చేశాడు.

"బాగానే చేస్తున్నావ్"

"మాకు తెలిసింది చాలా తక్కు వండి"

"ఆ విషయం నటుడు గుర్తు పెట్టు కుంటే చాలు. నటన దాని దారిన అది వంటబట్టి పనిచేస్తుంది. కప్పులకోసం, పేపర్లో ఫొటోలకోసం నాటకాలు వేయ కండి. అదే నా సలహా నటన సెంకడ్రీగా అనుకున్నంత కాలం మన స్టేజ్ పెర గదు. ఇది కూడా విద్య. చదవాలి నేర్వాలి"

"అలాగేనండీ"

"స్టానిస్లావిస్కీ పుస్తకం చదువు" అంటూ ఆఖర్ని రామేశంగారు సలహా ఇచ్చాడు.

సారథి రిహార్సెల్స్ పూర్తిచేసి ఇంటి మొహం పడ్తూంటే ప్రసాద్ పరుగున వచ్చాడు.

"సారీ బ్రదర్. అర్జంటు పనిమీద రిహార్సెల్స్‌కి రాలేకపోయాను" అన్నాడు.

"నీకు ఫస్ట్ మార్కుల ధ్యాసని. నాకు తెలుసు. చదువు పూర్తి చేసి వచ్చావు కదూ?"

"అవునురా బ్రదర్ ఊరినుంచి మా నాన్న వచ్చాడురా నాటకం వేస్తున్నానని తెలిస్తే చంపేస్తాడు అందుకని.." ప్రసాద్ గొణిగాడు.

"సరే పద"

దారిలో సారథి ప్రసాద్‌తో అన్నాడు

"వచ్చేనెల్లో అన్నయ్య పెళ్ళి. నువ్వు రావాలి మాతో"

"సరే! కట్నం ఎంత?" ప్రసాద్ ఆతృతతో అడిగాడు.

"పాడు బుద్ధీ నువ్వూ, కట్నం ఎంతని ఎందుకడుగుతావ్? 'మీ అన్నయ్య కట్నం తీసుకుంటాడా' అని ఎగతాళి చేయరా బ్రదర్" అన్నాడు ఆవేశంగా.

"నీకేమయిందిరా ఈ పూనకం ఏమిట్రా" అన్నాడు నవ్వుతూ ప్రసాద్.

"అవునులే! నీకు నవ్వులాటలుగానే వుంటుంది! నాకుతెలుసు నువ్వు అన్నయ్య జాతే."

"ఛ ఛ నే తీసుకోనురా"

"అబ్బో మీలో కట్నాలు మరీ ఎక్కువ. మా నాన్న అయితే ఏదో సణుక్కుంటాడు గానీ మీ ఫాదరయితే నిన్ను చంపి తను చస్తాడు, నాకు తెలుసు."

"ఎవరు చావనీ మనం చస్తే కట్నం తీసుకోం. ఆదర్శ వాదులంతా బ్రదర్" ప్రసాద్ ఛాతీ బాదుకున్నాడు.

సారథి కాలేజీలో డిబేట్ విషయం చెప్పడం మొదలుపెట్టాడు కథలా. ప్రసాద్ శ్రోతలా వింటున్నాడు. అంతా చెప్పి,

"రేపు తెలుస్తుంది అసలు సంగతి" అన్నాడు సారథి.

"నీది పెద్ద ఆవేశం బ్రదర్! సముద్ర తీరాన పుట్టిన వాళ్ళంతా ఇంతే! ఉప్పెన వస్తే ఒకటే హోరు. లేకపోతే పిల్ల కాలవ నయం"

"చూద్దాం కదా" సారథి సవాల్‌గా అన్నాడు.

నారాయణగూడాలో ఇద్దరూ విడిపోయారు. సారథి వీధి తలుపు తట్టకుండా పిల్లిలా పక్కగా వెళ్ళి మాలతిని పిలిచి తలుపు తెరిపించుకుని తన గదిలోకి వెళ్ళి మంచం మీద పడుకున్నాడు. చాలా సేపు నిద్రపట్టలేదు. నాటకంలో సంభాషణలు గుర్తుకువస్తున్నాయి. నిద్ర పట్టే ముందు పక్కగదిలోంచి తల్లితండ్రితో మాట్లాడ్డం విన్పించింది.

"మనం పెళ్ళికి నలుగుర్నీ పిలవాలి. మరీ దగ్గర ముహూర్తం అయిపోయింది"

తండ్రి అంటున్నాడు "కానిద్దూ వీడి పెళ్ళి ఎంత త్వరగా అయితే అంత మంచిది. వీడి తిరుగుళ్ళు జులాయి తనం సంగతి తెలిసిందంటే వాళ్ళు వెనక్కి వెళ్ళినా వెళ్తారు."

తల్లి జవాబు చెప్పలేదు.

"ఇప్పుడైనా కొంచెం తిరుగుళ్ళు తగ్గించమను. రేపు ఆ అమ్మాయి వచ్చిన

తర్వాత కూడా ఇలానే వుంటే బావుం డదు."

"నా మాట మీరు విన్నారు కనుకా" తల్లి నెమ్మదిగా అంటోంది.

సారధికి ఆ సంభాషణ వినబుద్ధి కాలేదు.దుప్పటి నిండుగా కప్పుకున్నాడు.

శోభనం రాత్రి కాంతారావు భార్యని కొట్టి, తలుపులు తెరుచుకుని బయటకు వెళ్ళినట్టు, వదిన ఏడుస్తోన్నట్టు కల వచ్చింది-సారధికి ఆ రాత్రి.




కాంతారావు పెళ్ళి ఘనంగా జరిగింది.

రెండు రోజులు మగపెళ్ళి వారికి ఊపిరి సలపలేదు- అన్ని తంతులూ సక్రమంగా సరదాగా రఘుపతిగారు దగ్గరుండి జరిపించాడు... ముఖ్యంగా వియ్యంకుణ్ణి ఆయన వి.ఐ.పీ.లా ట్రీట్ చేశాడు... లక్ష్మమ్మ గారయితే మంచంమీదనుంచి దిగలేదు. సారధి పెళ్ళితంతు అంతా గమనిస్తూనే ఉన్నాడు...ఎంతమంది చుట్టాలు...ఎంత డబ్బు... మరెంత ఆర్భాటం... ఓ ఆడ పిల్ల పెళ్ళిలో కనబడే హిపోక్రసీ మరెక్కడా కనబడదేమో !

ఏవేవో తంతులు తల్లి చెప్తోంది... అన్నీ జరిపిస్తున్నారు... అప్పగింతలు సీను సారధికి మరీ వింతగా అన్పించింది.. కన్నవాళ్ళు కన్నీళ్ళు దాచుకుని ఆ తవారింట్లో వాళ్ళకి పేరుపేరునా కూతుర్ని అప్పగిస్తున్నారు! పైగా బట్టలు లంచం పెట్టి.

'మా అమ్మాయిని క్షేమంగా కాపాడండి' అని పైకి అనకుంటూ, అన్నా పైకి వినబడకుండా పక్కన సన్నాయి మేళం

కోడల్ని కూతురులా చూసుకుంటానంది తల్లి. వదినగార్ని అక్కలా చూసుకుంటానంది చెల్లెలు... కోడల్ని బిడ్డలా కాపాడతానని తండ్రి వాగ్దానం చేశాడు

సారధికి అప్పగించారు

"నేనేమని ప్రామిస్ చెయ్యాను చెప్పండి! మా ఇంటికి వస్తోన్న వదిన ఇక మా మనిషి..." అనేశాడు.

వదిన కూడా ఎవరో చుట్టాలువచ్చారు, నాల్గురోజులుండి వెళ్ళిపోయారు.

వారం, పది హేనురోజులు నెలలు దొర్లి పోతున్నాయి. ఏవోయ్ అని పిల్చే వదిన సారధీ అని పిలవడం అలవాటు చేసుకుంది... సారధి కూడా 'ఏమండీ అని పిలవడం మానేసి వదినమ్మా' అనేవాడు. 'అంత గౌరవం వద్దులే. వదినా అను చాలు' అనేది అరుంధతి

సారధికి అరుంధతి ఆప్యాయం కొత్తగా వుండేది, హాయిగా వుండేది తను కాలేజీలో చదవడం, తన స్నేహితులూ లెక్చరర్లూ వాళ్ళు పాఠాలు చెప్పే తీరూ అన్నీ చెప్పేది. ఓ విధంగా సారధికి అరుంధతి గురువుగా కూడా అక్కరకు వచ్చేది

మాలతికి సరేసరి మంచి స్నేహితురాలుగా మారింది.

సారధి బి. ఏ. 'పాసయిన రోజు అరుంధతి చాలా సంబరపడింది

"మొత్తానికి నీ దయవల్ల గట్టెక్కాను వదినా" అన్నాడు సారధి




"ఉద్యోగం దొరికి ఆపైన పెళ్ళి అయితే చాలు ... మరీ సంతోషం..."

"మొదటిది అత్యవసరంగా కావాలి... రెండోది ఎంత ఆలస్యం అయినా ఫరవా లేదు..."

"ఏం పెళ్ళి చేసుకోవా?"

"ఊహు..."

ఆ రాత్రి సారథి ఇంట్లో వాళ్ళందర్నీ సినిమాకి తీసుకువెళ్ళాడు... కాంతారావు ఆఫీసులో పనుందని రాలేదు

సినిమా అయిన తర్వాత అందరూ కలిసి నడిచి ఇంటికి బయలుదేరారు. దార్లో రిక్షా ఒకటి బోర్లా పడివుంది. అందరూ ఆశ్చర్యంగా అటే చూశారు... కాంతారావు– పక్కన మరో అమ్మాయి. ఎవరికీ నోట మాటరాలేదు...

"మా ఆఫీసులో అమ్మాయి– ఏక్సిడెంట్ అయ్యింది. నే వెనక వస్తాను మీరు వెళ్ళండి" అన్నాడు కాంతారావు.

సారథి చీకట్లో అరుంధతివైపు చూశాడు. అరుంధతి తలవంచుకుని వుంది.

సారథికి అప్పుడే అరుంధతి సంసార జీవితం ఎలా సాగుతోందన్న ఊహ తలెత్తింది. వాళ్ళ జీవితంలోకి తొంగిచూసే ధైర్యం, హక్కు తనకుందా అన్న ప్రశ్న కూడా తలెత్తింది

ఆ అనుమానం అంతకుముందు కలిగినా వదిన తన నేర్పుతో భర్తని మార్చి వుంటుందని అనుకునేవాడు.

నాలుగురోజుల తర్వాత వదిన అడిగిన నవలతెచ్చి ఇవ్వడానికి సారథి అరుంధతి గదిలోకి వెళ్ళాడు

అరుంధతి మంచం కోడుకు ఆనుకుని ఎక్కడో చూస్తూ ఆలోచిస్తోంది.

"ఏమిటి వదినా! మీవాళ్ళుగుర్తొచ్చారా?"

"అవును" అంది అరుంధతి.

"పుట్టింటివాళ్ళు ఊరికెనే గుర్తురారు... కారణం ఏదో వుండి వుంటాలి..."

"ఈ సైకో ఎనాలిసెస్ కూడా నీకు తెల్సునన్నమాట" అరుంధతి నవ్వింది.



సారధికి ఎలా అడగాలో, ఏం అడగాలో తెలియలేదు. తను అనవసరంగా అనుమానం పెంచుకుంటున్నాడేమో! కాంతారావు అరుంధతి పరిచయంతో మంచి వైపుగా ప్రయాణం చేస్తున్నాడేమో! సారధికి అన్నగారి గురించి నిజం తెలుసుకుందుకు చాలా రోజులు పట్టలేదు. వారం పదిరోజులు కాంతారావు మీద నిఘావేసి ఉంచాడు. అంతే, కాంతారావు దొరికిపోయాడు. కాంతారావుకి ఆఫీసులో పని చేసే సుజాత స్నేహితురాలు-

సుజాత ఒంటరిది. ఉమెన్స్ హాస్టల్లో వుంటుంది. సారధి ఈ విషయం తల్లితో అన్నాడు చెప్పి "అమ్మా! అన్నయ్య బుద్ధి ఏం మారలేదు...ఈ సంగతి నీకు చెప్తున్నాను. ఎందుకంటే వాడికి నువ్వే నచ్చజెప్పాలి, లేకపోతే వదినకు తెలుస్తుంది... ఆమె బాధపడ్డం మనకు మంచిది కాదు..."

"ఏమిట్రా నీ గొడవ" అంది తల్లి

సారధి మళ్ళీ జరిగిందంతా చెప్పి "వదిన ఎలా ఉంటుంది ఇంట్లో...సంతోషంగా ఉంటోందా. బాధదాచుకునిమాట్లాడుతుందా"

"దానికేం లేదురా మధ్యలో నీకు వచ్చింది అయినా నీ గొడవలు నువ్వు చూసుకో ఏమీలేని దానికి ఇంట్లో గొడవలు రేపకు" సారధి ఈ విషయం మాలతికి చెప్పాడు. మాలతి నెమ్మదిగా అంది "ఏమోరా ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుంటుంది. అప్పుడప్పుడు అన్నయ్యా విసుక్కోవడం నేను విన్నాను" అంది.

"మరి నాకు చెప్పలేదేం"

"అమ్మ చెప్పొద్దు అంది"

"అలానా!" అన్నాడు సారధి ఆశ్చర్యంగా




సారధికి ఉద్యోగం దొరికింది. అదీ ప్రసాద్ సహకారంతో

"నువ్వు చాలా సహాయం చేశావురా" అన్నాడు సారధి కృతజ్ఞతగా.

"మనం స్నేహితులం. నీ కోసం నేనేమయినా చేస్తాను. సరే నువ్వు నాగురించి ఏ త్యాగం చేస్తావో చూడాల్సి వుంది మరి" అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

"నీ విగ్రహం చేయించి రోజూ పూజ చేస్తాను."

"దేవుడి మీద నమ్మకంలేని నువ్వా మాట అంటే నాకు భయంగా వుంది."

"నాకు మనుషుల మీద నమ్మకంరా. చుట్టూ ఉన్న మనుషుల్ని వంచించీ, దగా చేసీ, అందుకు ప్రతిగా కనబడని దేవుడి పంచన చేరడం వంచన అంటాను."

"నాటకం డైలాగులు"

"నాటకం అంటే గుర్తొచ్చింది. నువ్వు ఊళ్ళో లేవు కొత్త నాటకం ప్రాక్టీస్ చేశాం. పైగా హీరోయిన్ కొత్త అమ్మాయి. బెజవాడ నుంచి వచ్చింది. ఎంత చక్కగా చేస్తుందనుకున్నావ్."

"అలానా"

"రిహార్సెల్స్‌కు రా. శాంతిని పరిచయం చేస్తాను."

"పరిచయం చేసేటంత స్నేహం అయిందా!"

"వ్యంగ్యం ఆపవోయ్."

సారధి రిహార్సెల్స్‌కి వెళ్ళాడు. నటులందరూ గుండ్రంగా కూర్చునిరీడింగ్ రిహార్సెల్స్ చేస్తున్నారు.

"హీరోగారు రారు. హీరోయిన్ చూసి చూసి విసుగు చెంది పాట ఎత్తుకుంటుంది"

"నేవచ్చేశాను పాట ఆపచ్చు"

ఆ రాత్రి రిహార్సెల్స్ అయిన తర్వాత రామేశంగారు మర్నాడు జరగబోయే ప్రదర్శన ఏర్పాట్ల గురించి సారధితో చాలా సేపు చర్చించాడు.

"చాలా రాత్రయ్యింది. మీరు వెళ్ళి నిద్రపొండి అవన్నీ నే చూసుకుంటాను."

రామేశంగారు అందరూ వెళ్ళడంచూసి "సారధీ ఈ అమ్మాయి శాంతి. ప్రస్తుతం ఒంటరిగా ఈ ఊళ్ళో బ్రతకడం కోసం వచ్చింది. ఆమె గురించి నాస్నేహితుడు పెద్ద ఉత్తరం రాసి పంపాడు" అంటూ శాంతి గురించి చెప్పి,

"ఒంటరి ఆడపిల్ల. అదీ కొత్త ప్రదేశం. మీరెవరో ఒకరు కొంచెం సాయం చేయాలి. నేను బాగా ఆలోచించాను. ఈపని

అందరూ చెయ్యలేరు. చేసినా డ్యూటీగా భావించరు. కొంతకాలం శాంతి బాధ్యతలు నీకు అప్పగిస్తున్నాను. ఏమంటావ్ ?" అని అడిగాడు.

"ఇందులో నే ప్రత్యేకించి కష్ట పడాల్సిందేం వుందండీ. అన్నం తినిపించి స్కూలుకు పంపేటంత చిన్నది కాదుగా. గైడ్‌గా వుండడానికి నాకేం అభ్యంతరం లేదు".

"మీవాళ్ళు ఏమీ అనకుండా వుండాలి"

"ఫరవాలేదండీ"

సారధికి ఆనాటినుంచి శాంతి దగ్గర అయింది. రిహార్సెల్స్‌కి వచ్చి, పోర్షన్ చదివి, రంగస్థలం ఎక్కి నటించి, ఆ తరువాత మొహానికి వేసుకున్న రంగు కడిగేసుకోవడంతో పోకుండా ఈ స్నేహం మొగ్గలు తొడుగుతోంది.

తను వేసిన నాటకాల గురించి శాంతి చెప్పేది. ప్రదర్శనలో తను మింగేసిన పోర్షన్‌తో ఎదుటి నటుడుపడ్డ పాట్లు నవ్వుతూ చెప్పేది.

ఇంకా చిన్నపిల్లగా మారి తల్లి దండ్రు లతో ఆడుకోవడం, ఆ తరువాత అనాధగా మారి పినతల్లి పంచనజేరడం.

"నీ వయసులో మా ఇళ్ళల్లో ఆడపిల్ల అయితే దమ్మిడీకి మారేది కాదు. సరాసరి వెళ్ళి గోదారిలో దూకేది"

"నా బాధలు ఎవరెందుకు అనుభ వించాలి. వద్దు. నేను మీ ఇళ్ళల్లో పుట్టి వుంటే ఎంత బాగుండేదోనని కలలు కంటూ వుంటాను ఇప్పటికీ"

"వద్దు శాంతీ! అంతస్తు పెరిగినకొద్దీ మనిషి ఇరుకయిపోతాడు. అలానే పెద్ద కులాల్లో కనిపించని బాధలు అనుభ వించాలి ఆడపిల్ల. మా సంసారాలన్నీ చెరువులో నీరులాంటివి. పైకి స్వచ్ఛంగా కన్పిస్తాయి. ఒక్క రాయి విసిరితే చాలు బురద పొంగి కన్పిస్తుంది"

ఏడాది గడిచింది. సారధి,శాంతి కలిసి రామేశంగారి ఆధ్వర్యంలో పరిషత్ పోటీల్లో నాటకాలు వేశారు.

సారధి - శాంతికి చెల్లెలు మాలతినీ, స్నేహితుడు ప్రసాద్‌నీ పరిచయం చేశాడు. అప్పటికే మాలతి ఉద్యోగంలో జేరింది.

సారధి మాలతి ఉద్యోగ విషయంలో తల్లితో, తండ్రితో, అన్నగారితో ఘర్షణ పడ్డాడు.

"పెళ్ళి చేసుకుని నీ పెళ్ళాం చేత ఉద్యోగం చేయించుకో. దీనికి పెళ్ళి కావల్సి వుంది" అన్నాడు కోపంగా కాంతారావు.

"భార్యల్ని గుమ్మం దాటి బయటకు రానివ్వని వంశం మనది. కనీసం చెల్లెళ్ళు ఉద్యోగం చేయడం చూడగలిగితే చాలు. అదే అదృష్టం"

"వెధవ కబుర్లు"

"అది ఇంట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటే లాభం ఏమిటి? అసలు వదిన పొరబాటు చేసింది. ఉద్యోగంలో జేరితే మూడేళ్ళ సర్వీసు పుటప్ చేసేది"

"దానికి ఉద్యోగం ఒకటే తక్కువ"

"ఏం వదినా నీ అన్ని కోరికలూ తీరి నట్టేనా?"

"ఊరుకో సారధీ" అంది అరుంధతి.

"ఏం లక్ష్మణుడివి బయలుదేరావా ? వదినగారి గురించి బంగారు లేడిని తేవ డానికి"

"నువ్వు మాత్రం శ్రీరాముడివి కాకు" సారధి నవ్వేశాడు.

కాంతారావు మొహం నల్లబడింది. అతని ఆలోచనలు ఎటో పోతున్నాయి.

* * *

ప్రసాద్ ఫోన్ చేసి "నీతో అర్జంటుగా మాట్లాడాలి సాయంత్రం కలువు" అంటే సారథికి ఏం అర్థం కాలేదు.

"ఏమిటోయ్ హడావిడి ఆఫీసులో మెమో ఏవన్నా దొరికిందా"

"మెమో కాదు, సరేనా" అన్నాడు ప్రసాద్.

"అంటే చార్జి షీటా"

"అంతకన్నా గొప్పది."

సారథి ఆఫీసునుంచి సరాసరి ప్రసాద్ రూమ్‌కి వెళ్ళాడు. ప్రసాద్ అప్పటికే కూర్చీలో కూర్చుని పుస్తకం తిరగేస్తు న్నాడు.

"ఏమిటి చెప్పు"

"మీ అన్నయ్య మా ఆఫీసుకు వచ్చాడు.."

"ఇదా వార్త"

"అదికాదు" అంటూ ప్రసాద్ కాంతారావు వచ్చి మాలతికి పెళ్ళి సంబంధం గురించి హెడ్‌క్లర్కుతో మాట్లాడ్డం అంతా చెప్పి అన్నాడు 'ఇదిరా విషయం' అని.

"బావుంది. మా మాలతికి మేం పెళ్ళి సంబంధాలు వెదక్కపోతే నువ్వు వెదుకుతావా ? ఈ రోజుకో మంచిపని చేశాడు. చేయనీ. ఏం ఆ సంబంధం నీకు తెలుసా? వాళ్ళు ఎలాంటి వాళ్ళు వివరంగా చెప్పు."

"పెళ్ళికొడుకు జూదరి.ఆంధ్రాక్లబ్‌లో తాగి ఇరవై నాలుగు గంటలూ పేకాట ఆడతాడు. పేకాటలో డబ్బు పోతే గుర్రప్పందాలకు వెడతాడు. అక్కడా పోతే ఇంటికి వెళ్ళి తల్లి మెడ మీద పడతాడు. బహు ప్రయోజకుడు ఇక పెళ్ళికొడుకు తండ్రి తాగడంలో అందె వేసిన చెయ్యి చెల్లెలు"

"అపలా భాయ్. చెల్లెలి వర్ణన చెప్పే ముందు నిన్ను అనుమానించాలి. ఇవన్నీ నిమిషాలమీద ఎలా కూపీ లాగావురా."

"మా ఊరే వాళ్ళది."

"స రే లే. మా నాన్నగారితోనే చెప్తాను" ప్రసాద్ నెమ్మదిగాఅన్నాడు.

"ఒరేయ్ నన్ను క్షమిస్తానంటే ఓ విషయం చెప్తాను." అని.

"ఏమిటి ?"

"మన కులం వేరు. ఆ విషయం నాకు తెలుసు. మీ పద్ధతులు నాకు తెలుసు. నా కుటుంబ పరిస్థితి నీకూ తెలుసు. నే నెటువంటి వాడినని నీ అభిప్రాయం"

"ఫరవాలేదు. నమ్మితే ద్రోహం చెయ్యవు" ప్రసాద్ నెమ్మదిగా అన్నాడు "ఒరేయ్ సారథీ...నేను మీ చెల్లాయి మాలతిని ప్రేమిస్తున్నానురా" అన్నాడు చటుక్కున.

"మా చెల్లాయినా?"

"అవునురా. మాలతి నాకు ఏడాదిగా తెలుసు. ఈ మధ్య పరిచయం అయింది. మావాళ్ళు కాదననీ, నాకు ఆస్తిలో వాటా యివ్వక పోనీ, ఏం పర్వా లేదు. నువ్వు సహాయం చేస్తే చాలు."

"నన్ను ఆలోచించు కోనియ్. అయినా మాలతి..."

"మాలతి ఒప్పుకుంటుంది."

"అంటే..."

"అంతే సంగతులు."

ప్రసాద్ నవ్వేశాడు. సారథి నిముషం ఆలోచించి ప్రసాద్ భుజం మీద ఒక్కటి చరచి "మీరిద్దరూ దొంగలా

చూస్తాను ఈ పెళ్ళి ఎలా జరుగుతుందో" అంటూ నవ్వేశాడు.

"సారథీ: నువ్వే రథ సారధివి కావాలిరా."

సారధి ఇంటికి బయలుదేరాడు. మాలతి ఎంతలో ఎదిగింది. తన చేత దెబ్బలు తింటూ ఏడుస్తూ స్కూలుకి వచ్చేది. తన మీద ఫిర్యాదులు చెప్ప కూడదంటే కిమనకుండా తల ఊపేది. తల్లి ఇచ్చే డబ్బుల్లో తనకి భయపడి వాటా ఇచ్చేది. ఇవన్నీ ఎప్పటి సంగతులో అనుకో బుద్ధి వేయదు. కాలేజీలో రోమియోలు వెంటబడితే అమాయకంగా తనతోచెప్పేది తల్లి "ఎదుగుతున్నావ్, జాగ్రత్తగా కాలేజీకి వెళ్ళిరా" అంటే నవ్వుతూ తనవైపు చూసేది. మాలతి ఇంతలో మారిందా? వయసులో తనకన్న చిన్నదయినా జీవిత భాగస్వామిని ఎన్నుకునే విషయంలో ఇంత చొరవ ఎలా తీసుకోగలిగింది! నాలుగు తరాలు ఇంట్లో ఎవరూ చేయని పని, కులంకాని వాణ్ణి ప్రేమించి అత గాడికి హృదయాన్ని అర్పించి కూడా మూడో కంటికి తెలియకుండా ఆ ప్రేమని హృదయంలో ఎలా పదిలపర్చుకోగల్గి వుంటుంది.

అదే తనయితే ఈ పాటికి ఆవేశంతో తల్లితో, తండ్రితో చెప్పి ఇంటిని రణ రంగం చేసేవాడేమో !!

ఏ సంఘటనయినా, ఏ సన్నివేశాన్నయినా కాలం చూసి మృదుమధురంగా తన పాలిట వరంగా మార్చుకోగల నేర్పు, సున్నితత్వం ఆడపిల్లకు వెన్నతో పెట్టిన విద్య ఏమో!!

సారధి ఇంట్లోకి వెళ్ళి మాలతి కోసం చూశాడు. మాలతి తన గదిలో కూర్చుని ఎంబ్రాయిడరీ చేస్తోంది. సారథి మెల్లగా వెళ్ళి తలుపు మెల్లగా వేసి అక్కడ వున్న కుర్చీలో కూర్చుని, "నంగనాచీ, పిశాచీ" అంటూ ఒక్క కేక పెట్టాడు.

"నువ్వా! హడలిపోయాను, ఏమిటిది లోపలికి వచ్చి ఈ కేకలేమిటి. నాటకాలు ఇంట్లో మొదలుపెట్టావా!"

"మాలతీ! చెప్పు. నువ్వు నాటకం ఆడుతున్నావా లేదా?"

"అన్నయ్యా రిహార్సెల్స్‌లో మందు గానీ పుచ్చుకున్నావా?" అంది చలో క్తిగా

"వేళాకోళానికిది సమయం కాదు."

"అమ్మనీ, వదిన్నీ పిలవమంటావా; బయటకు పోతావా ?"

"పిలిసే నీకే నష్టం నీ నాటకం ముగింపు నీ చేతుల్తోనే రాసుకున్న దాని వవుతావు."

"నేనేం రాసుకోను"

"పోనీ నన్ను రాయమంటావా ?"

"నీతో తలనెప్పి"

"ప్రసాద్‌తో అయితే?"

మాలతి ఆశ్చర్యంగా చూసింది. మాట్లాడలేదు.

"ఏం మాట్లాడవేం?"

"ప్రసాద్ ఏమిటి?" అంది సాగదీస్తూ.

"సుభద్రా నీ కథ అంతా బజారు కెక్కింది. పురప్రజలు, పురప్రముఖులు నీ గురించే మాట్లాడుకుంటున్నారు"

"అన్నయ్యా..." అంది జాలిగా.

"అయితే జరిగింది చెప్పు"

"నువ్వు సహాయం చేస్తానని మాటివ్వు అమ్మతో, నాన్నగారితో చెప్పద్దు. నామీద ఒట్టే."

సారధి వెంటనే అన్నాడు. "దోషివి,

ముందుగా నీ నేరాన్ని ఒప్పుకుంటే బాగుండేది. నీ నేరం బయటపడిన తర్వాత కాళ్ళ బేరానికి వస్తున్నావ్ ఇది వంచన."

"అన్నయ్యా! నే చెబుదామనుకున్నాను. కానీ ప్రసాద్ నన్ను ఏం మాట్లాడద్దు అన్నాడు అతనే నీతో..."

"అతనెవరో అతని చరిత్ర ఏమిటో"

"దుర్మార్గుడు కాదు. మంచివాడు ప్రేమించిన నన్ను కాదని కట్నం గురించి మరో అమ్మాయి మెడ కోయడు. ఈ విషయంలో మాత్రం నాకు నమ్మకం వుంది."

"ఛా అదికాదే ఎలాఎలా ఈ ప్రోబ్లమ్ సాల్వ్ అవుతుందనుకున్నావ్?"

"అన్నయ్యా నిన్ను చూసుకునేరా నేనీ ధైర్యం చేసింది. నిజం! నీ మీద ఒట్టు"

సారధి నవ్వేశాడు.

"నాకు అతగాడు నచ్చాడు. అందుకే అతని కులం నేపట్టించుకోలా! ఏం తప్పు చేశానంటావా?"

"మంచి పన్లు చేయడంతోనే మనిషికి అగ్ని పరీక్ష మొదలవుతుంది. అందరిలా నువ్వు ఆర్భాటంగా, ఆనందంగా గృహిణివి కాలేవేమో? బాగా ఆలోచించు. అమ్మా, నాన్నా, అన్నయ్యా వీళ్ళెవరి సహకారం నీకుండదు. ఈ ఇంటితో సంబంధం కూడా పోతుంది. మీ కాళ్ళనీ, మీ పొట్టనీ మీరు నమ్ముకుని బ్రతకాల్సి వుంటుంది. ప్రసాద్ వాళ్ళ పెద్దవాళ్ళు కూడా మిమ్మల్ని దగ్గరకు రానివ్వరు. అంటే మీరు ఏకాకులు. అలాంటప్పుడు ధైర్యంతో ఒంటరితనంతో తలెత్తుకుని, కంటిలో ఏ మాత్రం కన్నీటి ధారని కన్పించకుండా బ్రతకగల్గాలి. నలువైపుల నుంచి కష్టాలు వచ్చినా పిగిపోయి 'నే చేసిన పని మంచిది కాదు. నే తీసుకున్న నిర్ణయం వల్ల నష్టపోయాను' అని భీరువులా జీవితం నుంచి తిరోగమనం చేయకూడదు. అతని బ్రతుకుని నరకం చేయకుండా నీ సంసారాన్ని ఒంటరిగా నడుపుకు రాగల్గాలి. వర్ణాంతర వివాహాలు విజయవంతం అవుతాయని మీరిద్దరూ రుజువు చేయగల్గాలి. ఈ ధైర్యం నీకుంటే చెప్పు. ఆలోచించుకుని చెప్పు సరేనా" అంటూ సారధి తలుపులు తెరుచుకుని బయటకు వెళ్ళిపోయాడు. మాలతి సారధి మిగిల్చి వెళ్ళిన వెలుతురుని చూస్తూ వుండిపోయింది.




శుభ లేఖ చదివి టేబిల్ మీద పడవేసింది. అరుంధతి. అది ఆ రోజే వచ్చింది తపాలో. పసుపు పచ్చని కాగితం మీద తెలుగులో సాంప్రదాయ బద్ధంగా వేశారు.

పైన 'జానక్యాం కమలాంజలి.....' పద్యంతో మొదలయింది. మంగళం మహత్ తో ఆఖరయ్యింది.

శ్రీరాముడి పెళ్ళి సీతతో జరగడం నుంచి ఈ నాటికి ఎన్ని కోట్ల పెళ్ళిళ్ళు జరిగివుంటాయో ఈ దేశంలో;

అరుంధతికి నవ్వొచ్చింది. అగ్ని సాక్షిగా జరుగుతున్న, జరిగిన, జరగబోయే ప్రతీ పెళ్ళి తంతు ఇంతే: ప్రతి

పెళ్ళి కూతురూ తనెంత సుఖపడుతుందో, బతుకులో ఏం మూట గట్టుకుంటుందో పెళ్ళికి ముందు ఆలోచిస్తుంది. నిజానికి తనూ ఆలోచించింది. కానీ వాస్తవంలో మిగిలేదేమిటో తెల్సిన తర్వాత ఏం ఉండదు. ఓ గూడు వదిలి మరో గూటికి జేరిన పక్షి కథ. అంతే!

కష్టాల్నీ, కన్నీళ్ళనీ, అవమానాల్నీ మర్చి పోగల్గితే పతివ్రతల జాబితాలోకీ, కాకపోతే హీనుల లెఖ్ఖలోకి వెళ్ళడం... అత్తవారింటికి బయలుదేరే ముందు తల్లి అంది.

"ఓర్పు కావాలి ఆడ పిల్లకి" అని. ఓర్పు అంటే అత్తగారూ, మామగారూ, భర్తా బంధువులతో కలసి పోవడం.

అరుంధతికి తన ఓర్పు వయసు నాలుగేళ్ళని గుర్తుకొచ్చింది. భర్త కాంతా రావుతో తను సాగిస్తున్న సంసారం కూడా గుర్తుకు వచ్చి మనసు కలుక్కు మంది.

భర్తతో అణుకువ కల్గిన భార్యగా తనింకా రాజీ పడలేదు. నిజమే! తల్లి చెప్పినా, అప్పుడప్పుడు సముదాయించి వెళ్ళినా మనసు ఎదురు తిరుగుతూనే వుంది.

కొత్తపెళ్ళి కూతురుగా, అనుభవ శాలిగా భర్తని తనెన్నో పరీక్షలకు గురి పెట్టి చూసింది. చాలాసార్లు భర్త వేసిన తప్పటడుగులే కన్పించాయి.

"మీ కోసం రాత్రంతా ఎదురు చూశాను."

"ఆఫీసులో ఉండి పోవల్సి వచ్చింది."

"నాకన్నా మీకు ఆఫీసు ఎక్కువ కాకూడదు కదండీ?" నవ్వుతూ అనేది.

"నాపట్ల నీ ప్రేమకి ధన్యవాదాలు అందుకో. కానీ నీతోకన్నా ఆఫీసుతో నాకు ఎక్కువ అవసరం వుంటుంది. మర్చిపోకు..."

"భార్యతో ఏకాంతంగా ఉండొద్దనీ, భార్యని కాకుండా చేసుకోమనీ ఏ ఆఫీసూ చెప్పదు. బాధ్యత ఉద్యోగానికి, మగతనానికే కాదు భార్య పట్ల ప్రేమకి కూడా వర్తించాలి... మనం ఏ ఊటీకో వెడదాం చక్కగా..."

"ఆఫీసుకు శలవు పడేసి మనం బయట పడ్డం బావుండదు. అమ్మా నాన్నా ఏమనుకుంటారు. వాళ్ళని వదిలేసి..." కాంతారావు అనేవాడు.

"అలా వెడుతున్న వాళ్ళ మాటేమిటి? వాళ్ళకి మీలా ఈ లంపటాలు లేవా చెప్పండి!"

"ఎవరి జీవితం వాళ్ళది."

"మనం కూడా జీవితాన్ని పంచుకోవాలి కదా?"

"నీకు అతితెలివిఎక్కువవుతోంది..."

అరుంధతికి కోపం ఆగేది కాదు. "మీకు నేనంటే ఇష్టం లేదు. ఆ మాట ధైర్యంగా చెప్పవచ్చుగా."

"చెబితే ఏం చేస్తావ్?"

"ఇలా కల్లో పొదుగుతూ కూర్చోను."

"అంతేకదా! పుట్టింటికి పోతానంటావేమో అనుకున్నాను."

వెకిలిగా నవ్వేసి కాంతారావు బయటకు వెళ్ళిపోయాడు. భర్త తనని వెళ్ళిపొమ్మంటున్నాడో లేక 'నువ్వు నేనేం చేసినా ఇక్కడ వుండవల్సిన దానివే' నని బెదిరిస్తున్నాడో అర్థం కాలేదు. మొదటిసారి భర్తలో కనీ కనపడని క్రౌర్యం, అయిష్టతని ఎనలైజ్ చేస్తూ వుంది

పోయింది.

అలా ఆర్నెల్లు గడిచిపోయాయి. అరుంధతికి తను భర్త దయాధర్మాల మీద బ్రతికే మనిషినని చాలాసార్లు తెలిసొచ్చింది.

అరుంధతి పరాకుగా వుండడం చూసి అత్తగారు లక్ష్మమ్మగారు అంది ఓ రోజు. "అలా వున్నావేం? మీ వాళ్లు గుర్తుకు వచ్చారా" అని,

అరుంధతి మాట్లాడలేదు. ఓ కన్న



తల్లి ముందు కొడుకు మీద ఫిర్యాదు చేయడానికి మనసు ఒప్పుకోలేదు.

"ఒట్టినే..."

సాయంత్రం ఆడపడుచు మాలతి అడిగింది–

"వదినా, నువ్వు ఈ మధ్య అదోలా ఉంటున్నావ్ ఏం?"

"అదోలా ఏమిటి మాలతీ"

"అదోలా అంటే అదోలానే..."

అరుంధతికి నవ్వొచ్చింది...మాలతి పెళ్ళికాని పిల్ల...అంతకు మించి చొర వగా అడగలేదు, మరి.

"ఏం లేదు" అనేసింది.

"ఏం నాతో చెప్పకూడదా?"

"ఓ రెండేళ్ళు ఆగు, ఆ తర్వాత చెప్తాను..."

అన్నయ్యకి నీకూ పోట్లాట అయ్యిందా...?"

"పోట్లాట కాదులే...కోల్డ్ వార్..."

"అంటే...?"

"ప్రచ్ఛన్న యుద్ధం కాదు..."

"పోనీ అమ్మతో చెప్పు పెద్దన్నయ్యని కూకలేస్తుంది..."

"అలానే" అంది అరుంధతి. మరో ఆర్నెల్లు దొర్లిపోయాయి.

ఆ రోజు—

అరుంధతి టాయ్‌లెట్ బాక్స్ తెరిచి శుభ్రం చేస్తూంటే వెల్వెట్ గుడ్డకింద కాగితం కన్పడింది...తీసీ చూస్తే ఉత్తరం!

అది భర్త కాంతారావుకు ఎవరో సుజాత అనే అమ్మాయి రాసిన ఉత్తరం.

సుజాత కాంతారావు పనిచేసే ఆఫీసులోనే పని చేస్తోంది. చాలా కాలం నుంచి ఇద్దరికీ పరిచయం ఉండి వుండాలి... చాలా చనువుగా, కాంతారావు చెవిలో రహస్యం చెబుతోన్నట్టుగా వ్రాసింది ఉత్తరం. అరుంధతికి కాంతారావు ప్రవర్తన ఆ రోజునుంచీ అర్థమవసాగింది. వైవాహిక జీవితంలో తను సుఖ సంతోషాలకు ఎంత వెనకబడిందో – ఆ వెనకపడ్డం వెనక ఎంత కథవుందో తెలిసింది.

ఓ రోజు కాంతారావు చాలా రాత్రి అయిన తర్వాత భుజం మీద చెయ్యి వేసి దగ్గరకు తీసుకుంటూంటే నెమ్మదిగా అంది.

"నా దగ్గర నుంచి ఇంత సుఖాన్ని కోరుతూ కూడా నిజం ఎందుకు దాస్తున్నారు ?"

"నిజం ఏమిటి ?"

"నన్ను పెళ్ళి చేసుకున్నారు. మీరు నా భర్త... కానీ నేను మీకు భార్యని మాత్రమే... ప్రేయసిని కానుగా..."

"ఇదేమిటి ?"

"మీరు ఇంతకాలం దాచిపెట్టిన ఓ కథకి ముందు మాట..."

"సరేలే... మగవాడన్న తర్వాత ఏదో జరుగుతూ వుంటుంది. నీకు అన్యాయం చేయడం లేదుగా, బాధ పడ్డానికి ?"

"ఏదో రాత్రి నిద్రమత్తులో పెళ్ళాన్ని దగ్గరకు తీసుకోవడమే సుఖ పెట్టడం అవుతుందా ? ఈ ఒక్క సుఖం కోసం ఎవరూ పెళ్ళి చేసుకోరుగా మన దేశంలో...?"

"ఎందుకు చేసుకుంటార్ట ! మొగుడు గాడిమీద అధార్టీకోసమా ?" వెటకారంగా అన్నాడు.

"సుజాత మీకు రాసిన ఉత్తరం చూశాను." కాంతారావు ఏం తెలియనట్టు "సుజాత ఎవరూ ?" అన్నాడు.

"బావుంది... మీరు చెబితే విన్దామనుకుంటున్నాను, నేను..."

"ఓ అదా! అది మా ఆఫీసులో కథలు రాసే రామారావుగారి కథలో ఓ పేజీ. చంపేశావ్..." కాంతారావు అరుంధతి తనని నమ్మిందా లేదా అని ఆలోచించ

లేదు... అదే అరుంధతికి అవమానం అయ్యింది... ఎంత చక్కని అబద్ధం... పెళ్ళానికీ, కసాయివాణ్ణి నమ్మి కూడా వెళ్ళే గొర్రెకీ తేడా లేదనిపించింది.

చిన్న అబద్ధం ఆడి తనని బాధ పెట్టే కన్నా నిజం చెబితే ఎంత బావుండేది! నిజం చెప్పే ధైర్యం లేని వాళ్ళు మోసం కాదు, ఏ ఘోరామన్నా చేయగలరు!

అత్తగారితో చెప్పింది. లక్ష్మమ్మగారు అంతా విని,

"బావుందే సోద్యం... వాడటువంటి వాడు కాదు..."

"ఆయన్ని నేనేమీ అనడం లేదు. జరిగింది మీతో చెప్తున్నా."

"మా ఇంటావంటాలేవు, ఇటువంటి పన్లు."

"నా తాపత్రయం ఎవరి గురించో కాదు, ఆయన గురించి."

"నీ మొహంలా వుంది. మరెవరితోనూ అనక. మగవాడి గొడవల్లోకి ఆడది వెళ్ళకూడదు"

"ఈవేళ నుంచి కాదు, పెళ్ళి అయిన ఈ మూడేళ్ళనుంచీ చూస్తున్నాను..."

" నా కొడుక్కి వంక పెడ్తున్నావ్, నువ్వు అణుకువగా వుంటే అన్నీ చక్కబడతాయి. నీ చదువూ తెలివితేటలూ వాడి మీద ప్రయోగించకు..."

అరుంధతికి కళ్ళ నీళ్ళు తిరిగాయి. గదిలోకి వెళ్ళిపోయింది. గది బయట నుంచి "వదినా" అన్న సారధి పిలుపు వినబడింది. అరుంధతి పమిటతో కళ్ళు వత్తుకుని, "రా సారధీ" అనిపిల్చింది.

సారధి లోపలికి వచ్చాడు. అక్కడే వున్న కుర్చీలో కూర్చున్నాడు.



అరుంధతి సారధిని చూసింది. తన పెళ్ళినాటికి చదువుకునే వాడు, ఇరవై ఏళ్ళ కుర్రాడు. ఎప్పుడూ తెలుగూ, ఇంగ్లీషు సాహిత్యం చదువుతూ వుండే వాడు. అలాంటిది చదువు పూర్తయి ఉద్యోగస్తుడయ్యాడు.

"ఏం వదినా అలా ఉన్నావ్!"

"కొంచెం చిరాగ్గా వుంది..."

"ఎవరి మీద...నామీద కాదు కదా"

"నామీదే"

"చిరాగ్గా వుంటే విసుక్కోవేం ?"

"నాకు చిరాగ్గా వుంటే మౌనం పాటిస్తాను"

"మంచి పద్ధతే కానీ, పార్లమెంటరీ కాదు. మనబాధ నలుగురికీ తెలియాలంటే అరవాలి"

"బాధ వ్యక్తిగత విషయంగానూ, సంతోషం మంది పరంగానూ ఉండాలిట"

సారధి నవ్వేశాడు. "లాభం లేదు వదినా...తప్పే అను...అమ్మకీ నీకూ జరిగిన వాదన నే విన్నాను".

"సరే..."

"సరే కాదు,నేను నీకేమన్నా సహాయం చెయ్యగలనా ?"

"ఏం సహాయం చేస్తావ్!"

సారధి మాట్లాడలేదు.

"నాకూ, అన్నయ్యకూ మధ్య సంజయ రాయబారం నడుపుతావా..." అరుంధతి ఆగి అంది, "మాలతి కూడా నా బాధలో పాలు పంచుకుంటా నంటుంది. మీరెవరూ బాధపడొద్దు, తెలిసిందా ?"

"అయితే నువ్వేం చేస్తావ్."

"చూస్తూ ఊరుకుంటాను. ఆ ఓపికా పోతే అప్పుడు చూద్దాం..."

"ఇది అన్యాయం వదినా! అన్నయ్య సంగతి నాకు బాగా తెలుసు. వాడి ధైర్యం

అమ్మనీ, నాన్ననీ చూసుకుని..."

"ఆయనకు ఇప్పుడు ధైర్యం లేదు. భయం వుంది. అందుకే అబద్ధాలు చెపుతున్నారు..."

"అన్నయ్యా నీ మంచితనాన్ని ఆసరాగా తీసుకుంటున్నాడు. నేను నాన్నతో చెప్తాను. నువ్వు బాధ పడుతున్నావని"

అరుంధతి నెమ్మదిగా అంది, "నేను బాధ పడుతున్నాను. కానీ ఆయనిలా చేస్తున్నందుకు కాదు. వంచన చేస్తున్నందుకు! ఇష్టంలేని మనిషితో సంసారం చెయ్యడం



ఎలా అలవాటయ్యిందా అని"

"ఒకవేళ..."

"ఒకవేళ?"

"అన్నయ్యా నిన్ను వదిలిపెడతాడేమో...ఆలోచించావా?"

"ఆ ధైర్యం కూడా ఆయనకు లేదు. ఒకవేళ వదిలిపెట్టినా నేనేం చెయ్యగలనంటావ్! ఇష్టంలేని సంసారానికి ఆయన్ని కట్టిపడవేయడం మంచిది కాదు..."

"అవును వదినా నిజమే! పది వేలు కట్నం తీసుకుని పెళ్ళిచేసుకున్నాడు. ఇంకా మీవాళ్ళు అడిగినంత ఇస్తారు కూడా! పైగా పెళ్ళాన్ని వదిలేస్తానంటే అమ్మా నాన్నా ఒప్పుకోరు.సాంప్రదాయం దాటి ముందుకు వెళ్ళనివ్వరు..అన్నయ్య వెనక్కి చూస్తూ నడిచి గోతిలో పడ్డా సహిస్తారు..."

"ఇంతకీ నన్ను ఓ దా ర్చ డా ని కి వచ్చావా?"

"అవును వదినా...మనిల్లు ... పద్ధతులూ నాకెందుకో నచ్చడంలేదు. అంతా కృత్రిమం ... ఆలోచనలకూ ఆచరణకీ సంబంధంలేదు. ప్రవర్తనకీ పలుకుకీ ఆమడ దూరం ... నాకెందుకో చీకటి కొట్టులో వున్నట్టుగా వుంది-ఇంట్లో ... మళ్ళీ మాలతికి కూడా అన్నయ్యలాంటి మనిషే మొగుడుగా వస్తే ... భరించలేం. నీకు తెలియదు. నాన్న మాలతికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు. కానీ ఆ పెళ్ళి నేను జరగనివ్వను. వీళ్ళు మారనంత కాలం నేను వీళ్ళకి ఎదురు తిరుగుతూనే వుంటాను. నువ్వు సుఖ పడాలి. అది ఏ పద్ధతిలో వచ్చే సుఖమైనా సరే! మాలతి సుఖ పడాలి అప్పుడు"

"అమ్మోయ్ నీదంతా ఆవేశం. మనిల్లు ఒకటే కాదు, ఈ దేశంలో అందరిళ్ళల్లోనూ ఇదే భాగోతం నడుస్తోంది. ఏం చెయ్యగలం చెప్పు?"

సారథి నవ్వేశాడు. "వ్యాధి ముదిరితే మందు కాదు, శస్త్ర చికిత్సచేయాలి. వదినా నా ఉద్దేశం చెప్పనా?"

"నీ ఉద్దేశం పక్కన పెట్టి నీ పెళ్ళిమాట చెప్పు. మీ అన్నయ్య అడగమన్నారు..." అరుంధతి నవ్వుతూ అడిగింది.

"ఇదేమిటి వదినా! ఇంత తేలిగ్గా మామూలు మనిషివయ్యావ్?

"జీవితాన్ని లైటర్ వెయిన్‌లో తీసుకోవాలి...సమాధానం చెప్పు?"

"నేను పెళ్ళి చేసుకోను"

"అదేమిటి?"

"పెళ్ళి మీద నాకు నమ్మకం లేదు"

"ఎందుకట..."

"అతి పవిత్రంగా మంత్రోత్సాహాలతో జరిగే పెళ్ళిళ్ళలో నాకు ఎక్కడా పవిత్రత అనేది కనబడలేదు. ప్రతి పెళ్ళి వెనకా బోల్డు విషాదం, బోల్డంత ట్రాజడీ కన్పిస్తోంది. ఏడడుగులు కలిసి నడిచిన భార్య భర్తనీ, భర్త భార్యనీ ఏవగించుకుంటున్నారు. రోజుకూ కొన్ని లక్షల పెళ్ళిళ్ళు జరుగుతూంటే అందులో వేల దంపతులు అయిష్టంగా భార్యాభర్తలవుతున్నారు. మగవాడు ఆడదాన్ని విలాస వస్తువుగానూ, ఆడది మగవాణ్ణి ఆసరాగానూ తప్ప మరే ఇ త ర ఉద్దేశంతో చూడటం లేదు.

మనిల్లు చూడు.మానాన్న శ్రోత్రీయుడు. నిష్ఠాపరుడు. పరువూ ప్రతిష్ఠా ఇవే ఆయనకు ఊపిరి. మా తాతయ్యా అంతే! అన్నయ్య సంగతి సరేసరి. మగవాళ్ళు ఇలా వుంటే ఆడవాళ్ళ సంగతి— మా నాయనమ్మా, అమ్మా శుద్ధ అమాయకులు. వాళ్ళకి అస్తిత్వం లేదు. యాంత్రికంగా బ్రతకడం వాళ్ళ జన్మహక్కుగా తలుస్తారు. భర్తకి ఎంత అణుకువగా ఉంటే అంత గొప్పని వాళ్ళు అనుకుంటారు. నీకు తెలియదేమో... మా తాతయ్య అంత తిరుగుపోతూ మా వంశంలో లేట్ట. కానీ ఆయన్ని మా

నాయనమ్మ ఏమీ మార్చలేకపోయింది... నాన్న కూడా పదేళ్ళ క్రితం వరకూ పరాయి ఆడవాళ్ళతో తిరిగిన బాపతే! ఇలాంటి ఇంటిలోకి నువ్వు వచ్చావ్! నీ లాంటి ధాన్ని చూస్తే వాళ్ళకి కొత్త కన్నా ఈర్ష్య ఎక్కువగా కల్గుతుంది..."

"అది సరే నువ్వు పెళ్ళి మానేస్తే మా బ్రతుకులు దారికొస్తాయంటావా?"

"భరోసా యివ్వలేను గానీ - నా ఉద్దేశం సమయం వచ్చినప్పుడు చెబుతాను..."

ఇంతలో బయట నుంచి 'వదినా' అంటూ మాలతి లోపలికి వచ్చింది.

"చెల్లాయికి సుస్వాగతం" సారథి చప్పట్లు కొట్టాడు.

"చూడు వదినా అన్నయ్య..."

"వదినకి నీ సంగతి చెప్పలేదు... వింటే నాలా స్వాగతం పలకదు... చీపురుకట్ట తిరగవేస్తుంది..."

"వదిన నన్నేం అనదు..." మాలతి ధీమాగా అంది.

"ముద్దు పెట్టుకుంటుకిది..."

"నువ్వూరుకో సా ర ధీ, ఏమిటి మాలతీ"

"నాన్న దీ ని కి పెళ్ళి సంబంధాలు చూస్తుంటే, ఇదేమో..."

"నా గురించి నువ్వేం చెప్పనక్ఖర లేదు."

"నా అవసరం వుందనుకుంటే కబురు చెయ్యండి...వస్తాను..."

సారథి బయటకు వెళ్ళిపోయాడు.

మాలతి పందిర పట్టె మంచం మీద అరుంధతి పక్కన కూర్చుంది. మోకాళ్ళు ముడుచుకుంది.

"ఇదేమిటి మాలతీ! "ఏం జరిగింద."

"ఉదయం అన్నం తింటూంటే నాన్న అ మ్మ తో చెప్తున్నాడు. కంకిపాడు సంబంధం నాన్నకి నచ్చిందిట..."

"పెళ్ళివారి సంగతా?"

"అవును..."

"రానీ, పోయిందేమిటి... పెళ్ళి చూపు లేగా."

"నాకీ పెళ్ళి సంబంధం ఇష్టంలేదు వదినా"

"బావుంది...మీ అందరికీ ఏమన్నా మతిపోయిందా? అతనూ ఇదే ధోరణి"

"నీకు తెలియదు వదినా..."

"నాకు తెలియదు మరదలా చెప్పు.."

మాలతి ఊపిరి తీసుకుని గెడ్డం క్రింద చెయ్యి పెట్టుకుని కళ్ళలో గతం గుర్తుకు చేసుకుంటూ, ముద్దుగా ముగ్ధగా మారి చెప్పడం మొదలు పెట్టింది.

అరుంధతి ఆశ్చర్యంగా మాలతి చెప్తూన్న కథ గుండెలమీద చెయ్యి వేసుకుని వింటూ కళ్ళు పెద్దవి చేసుకుని మాలతిని చూడ్డం మొదలుపెట్టింది.




సుబ్బరామయ్యగారు మొదట నమ్మలేదు... భార్య ఏడుస్తూ మాలతి తను ఆఫీసులో ఎవర్నో ప్రేమించానని అతన్ని తప్ప పెళ్ళాడ కూడదనే నిర్ణయాని కొచ్చిందిటనీ చెప్పే సరికి. ఆయనకు ఇదంతా పెద్ద కుట్రలా తోచింది. కళ్ళ




ముందు తిరిగే కూతురు అంతలోనే ఎదిగి, పెళ్ళి విషయంలో కన్నవాళ్ళనే సవాల్ చేయడం అవమానంగా అన్పించింది. అయిష్టంగానే మాలతిని ఆయన చదివించాడు. మాలతి చూస్తూండగానే బి.ఏ పాసయింది. ఉద్యోగం చేస్తానని మెత్తగా చెప్పి తండ్రి కాదంటే ఇంటికి తను తోడు అవుతాననీ, అందులో తప్పేమిటనీ ప్రాధేయ పడింది. ఆడపిల్ల. అందులో ఎదిగిన పిల్ల ఉద్యోగం చేయడం ఆయనకు మొదట్లో గిట్టలేదు. భార్య ఒక పెడా, కాంతారావు మరో పెడా నచ్చజెపితే ఒప్పుకున్నాడు.

సుబ్బరామయ్య గారికి ఏడాదిగా జరిగిన సంగతులు గుర్తొచ్చాయి. యధాలాపంగా సరేనన్నందుకు ఆయన ఆక్షణంలో ఉక్రోష పడ్డం మొదలు పెట్టాడు. మాలతి ఎవర్నో ప్రేమించడం, పైగా ఆ ప్రేమించిన వాడు మరో కులంవాడు కావడం. ఊహించడానికే ఆయన ఇష్ట పడడు... కానీ జరిగింది... మాలతి వదినగారికి చెప్పడం. వదినగారు అత్తగారి దగ్గరకు రాయబారం వెళ్ళడం.

ఇంట్లో ఎవరికి వాళ్ళు స్వయం నిర్ణయాలు తీసుకుంటున్నారనీ, విడివిడిగా గూడు పుఠాణీలు చేస్తున్నారనీ అన్పించింది.

అందుకే, "అదేం కుదరదు. ఇలాంటి వాటికి నేను ఒప్పుకోను. ఆ కంకిపాడు సంబంధం చేసుకోవల్సిందే." అన్నాడు.

"లక్ష్మమ్మగారు భర్త వైపు చూసింది.

"గట్టిగా చెప్పు. నేను ఒప్పుకోనని దానితో"

ఆవిడ భర్త గదిలోంచి వెళ్ళిపోయింది.

అయినా సుబ్బరామయ్య గారికి మన

శ్శాంతిగా లేదు. వెళ్ళే భార్యని పిల్చి "ఆ కాంతిగాణ్ణి ఇటు రమ్మను" అన్నాడు.

ఐదు నిమిషాల్లో కాంతారావు లోప లికి వచ్చాడు. కాంతారావు తండ్రి వైపు చూసి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చు న్నాడు.

"మీఆవిడ నీతో ఏమన్నా చెప్పిందా?"

కాంతారావుకి ఏం అర్థం కాలేదు. తండ్రి వేసే ప్రశ్న ఎవర్ని ఉద్దేశించిందా అని అతను ఆలోచిస్తున్నాడు.

"ఏ విషయం?"

"అయితే ఇంత వరకూ నీకూ తెలియ దన్నమాట?" కాంతారావు మాట్లాడలేదు.

సుబ్బరామయ్యగారు కొడుకు మొహం లోకి చూసి,

"మాలతి నీ పెళ్ళాంతో ఏదో వాగిం దిట. అదే...దాని పెళ్ళి విషయం..." అంటూ భార్య ద్వారా విన్నది చెప్పి,

"నాకేం నచ్చలా ఈ పన్లు. అదేదో అంటే దానికి నీ పెళ్ళాంబుద్ధి చెప్పాల్సింది పోయి మీ అమ్మతో చెప్పడం..."

కాంతారావు మళ్ళీమౌనం పాటించాడు.

"మాలతి మీద ఓ కన్ను వేసి ఉంచు. వాళ్ళ ఆఫీసులో ఎవరో ప్రసాద్‌ట. పెళ్ళి చేసుకుంటానని అందిట. మతిలేని మాటలు. దాన్నోసారి మందలించు."

కాంతారావు చటుక్కున అనేశాడు "బహుశా ఇది సారధిగాడి భరోసాతో మాట్లాడివుంటుంది. వెధవపుస్తకాలు వాడు చదివింది చాలక దానిచేత చదివిస్తాడు. ఒకటి రెండు సార్లు మాలతినీ, సారధినీ కాకుండా వీళ్ళతో మూడో మనిషిని చూశాను. అతనే అయ్యుంటాడు..."

"అందుకే చెప్తూంటా. దాన్ని ఉద్యో గం మానిపించేద్దాం. మర్యాద పోయిన తర్వాత బతికేం లాభం..."

"వాడ్ని నేను అడుగుతాను. మీరూ కూకలెయ్యండి. నాటకాలనీ, సాహిత్య సభలనీ ఊళ్ళు తిరగడం మానితేగాని వాడు బాగుపడ్డు. వాడి మూలంగానే మాలతీ పాడుపుతోంది"

"మీ ఆవిడతో కూడా చెప్పు"

"అలానే"

సుబ్బరామయ్యగారు నాలుగైదు నిమి షాలు మాట్లాడకపోవడం చూసి కాంతా రావు లేచి "నేనుంటాను" అనేసి గది బయటకు వచ్చేశాడు. కాంతారావు గది బయటకువచ్చి తేలిగ్గాఊపిరితీసుకున్నాడు. మాలతి గదివైపు చూశాడు. తలుపు దగ్గరగా వేసి వుంది. ఉన్న జాగాలోంచే టేబిల్ ముందు కూర్చుని చదువు కుంటూన్న మాలతి కన్పిస్తోంది. మాలతి గదిలోకి వెళ్ళి మాట్లాడాలనుకుని అంత లోనే మనసు మార్చుకుని తనగది వైపు వెళ్ళాడు.

అప్పుడే గదిలోంచి బయటకువస్తూన్న సారధిని చూశాడు.

"ఏం కావాలి" అన్నాడు.

"వదిన 'మైదానం' పుస్తకం కావా లంటే ఇచ్చాను. వేరే పనేంలేదు" అనేసి తన గదివైపు వెళ్ళిపోయాడు సారధి.

కాంతారావు లోపలికి వెళ్ళాడు. అరుంధతి మంచం కోడుకు ఆనుకుని కూర్చుని పుస్తకం చదువుతోంది.

"చదువుల సరస్వతి నిద్రపోలేదా?"

అరుంధతి భర్తవైపు చూసి చిన్నగా నవ్వి "బ్రహ్మగారు సృష్టి ఆపేసి నిద్రకు ప్రక్రమిస్తే నేను వీణ వాయిస్తూ మిమ్మల్ని జో కొడతాను..."

"గొప్ప పని చేస్తావులే..."

"ఇది గొప్ప పనికాదు. గొప్ప పనులు వేరే ఉంటాయి"

"ఓహో, అవునులే! తెలిసీ తెలియని వాళ్ళు వాగితే తందానతాన అనడం గొప్ప పని..."

"దానికెంత ప్రావీణ్యం ఉండా లంటారు".

"నీ శక్తి నాకు తెలియకనా"

"నా శక్తిమాట ఏమోకాని,అశక్తతత మీకు బాగా తెలుసు".

కాంతారావు ఛీత్కారంగా అనేశాడు. "అతి తెలివి ఆపుచేసి పడుకో. నిన్ను చూస్తూంటే మండిపోతోంది".

అరుంధతి భర్త అంత అసహ్యంగా ఈసడించుకుంటాడనుకో లేదు. అయినా ఓర్చుకుని,

"మీకు సెన్సాఫ్ హ్యూమర్ ఉంది. ఇంతలో అలా మారిపోయారేం ఈవేళ".

"అసలు నీకు బుద్ధుందా"

"మధ్యలో అదెందుకు?"

"గడ్డి పెడదామని"

అరుంధతి నవ్వేసింది. అతనికి సమా ధానం చెప్పడం ఇష్టంలేక.

"మాలతి ఏదో అంటే దాని మాట పట్టుకుని అమ్మదగ్గరకు రాయబారం వెడతావా ఆ మాత్రం నీకు తోచలేదా?"

అరుంధతికి అర్థమయింది.

"తప్పని దానితో చెబితే పోలా"

"అదేమిటండీ. మీ చెల్లాయి బాధ పడుతోంది, అమ్మా నాన్నల దగ్గరకు వెళ్ళి ఏమని చెబుతుంది. చనువు కాబట్టి నాతో చెప్పింది. ఇందులో తప్పేముంది"

"తప్పా తప్పున్నరా"

"తన భవిష్యత్తు గురించి ఆ అమ్మాయి ఓ నిర్ణయానికి వచ్చింది. నా సలహా అడిగింది. అయినా ఇందులో దాచుకోవల సిందేముంది ? మనమోదారి చూపించాలి గానీ..." ఆగిపోయింది అరుంధతి.

"వాడెవరో నీకు తెలుసా"

"చెప్పింది..."

"అది బుద్ధి తక్కువ పని చేస్తూంటే మనం గడ్డిపెట్టాలి. అలుసు ఇవ్వకూడదు"

అరుంధతి మాట్లాడలేదు.

"కులంకాని వాడిని అది ప్రేమించడం, మనం దానికి వంతపాడటం. గొప్ప మనిషిలా నీ సలహా ఒకటి మధ్యలో"

"నేనేం సలహా ఇవ్వలేదు. ఇచ్చిందల్లా మీ అమ్మగారితో చెప్పాను"

"అంటే వాణ్ని అది పెళ్ళాడ్డం నీకు ఇష్టమనేగా అర్థం"

"బావుంది మీ వాదన..."

"అయితే చెప్తున్నాను విను. ఎప్పుడూ ఇటువంటి విషయాల్లో కలగజేసుకోకు... మేం ఇంకా అంత బరితెగించలా... దారిన పోయేవాడికి అది నచ్చిందన్నంత మాత్రాన పెళ్ళి చేయడానికి..."

అరుంధతి మాట్లాడలేదు... ఆమెకు భర్త మాటలు అర్థంకాలేదు. భర్తకి తన మీద కోపం ఎందుకు రావాలో, ఎందుకు వచ్చిందో తోచలేదు... చదువుకుని, ఉద్యోగం చేస్తూ, వ్యక్తిత్వం తెలిసిన చెల్లెలు తన నిర్ణయాన్ని చెబితే హర్షించ లేక పోవడంలో ఔచిత్యం కనబడలేదు. ఒప్పుకోవడం, ఒప్పుకోక పోవడం వేరు విషయం ! కానీ మనిషి చెప్పేది విననని మొండికేయడం విజ్ఞులు చేయరని ఆమెకో నమ్మకం.

"ఆ అమ్మాయి నిర్ణయం చెప్పింది. దాని బాగోగులు విడమర్చి చెప్పడం మీ ధర్మం. అంతేగాని మనం మధ్యన ఘర్షణ

పడ్డం దేనికి ?" అంది నెమ్మదిగా.

"అది అమ్మా నాన్నా చూసుకుంటారు నువ్వు కలగజేసుకోవద్దని చెప్తున్నా"

"అంటే మీకూ, నాకూ ఆ అమ్మాయి విషయంలో సంబంధం లేదంటారు. అవునా ?"

"అవును..."

"సరే సారధితో చెప్తాను.. పాపం అతను అనవసరంగా నాతో వచ్చి చెప్పాడు.. మీకు చెప్పమని" అంది..

"వాడో రాస్కెల్." కాంతారావు కోపంగా కుర్చీలోంచి లేచి వాకిట్లోకి వెళ్ళాడు. సారధి గది ఇవతల నుంచుని 'ఓరే సారధీ' అంటూ కేక పెట్టాడు.

సారధి లోపలినుంచే, 'ఏం అన్నయ్యా.' అంటూ జవాబిచ్చాడు.

"అలా బయటకు వెళ్ళొద్దాం. రా"

సారధి లోపలి నుంచి వచ్చి "ఇప్పుడా ఏమిటి పనీ?" అని అడిగాడు.

"బయట చెప్తాను."

ఇద్దరూ వీధిలోకి వెళ్ళారు. ఇల్లుదాటి ఫర్లాంగు దూరం నడిచిన తర్వాత కాంతారావు గొణుక్కుంటూ,

"మాలతి సంగతి" అన్నాడు.

"మాలతా!"

"అదేదో బుద్ధిలేని వాగుడు వాగుతోందిటగా." సారధి అన్నగారి వైపు చూశాడు.

"నీకింకా కుర్రతనం. ఏదో వెర్రి ఆవేశంలో ఆలోచించకు అమ్మా, నాన్నా చాలా బాధ పడుతున్నారు. ఇటువంటి పన్లు మన ఇంటావంటా ఎవరూ చేయలా

"ఎటువంటి పన్లు"

"ఎవరో కులం కానివాణ్ణి ప్రేమించటం తల పొగరుతో పెళ్ళివరకూ వెళ్ళటం"

"ఓ అదా"

"అదా అని తీసేస్తున్నావ్, ఏమిటను కున్నావ్"

"ఏమీ అనుకోలేదు. దీని గురించా నన్ను పిలుచుకు వచ్చావ్, ప్రేమించింది మాలతి. పెళ్ళాడతానన్నది మాలతి, మధ్యన నేనేం చెయ్యను"

"అదలా అనకూడదు. దానికి నువ్వు చెప్పు?"

సారధి నవ్వేశాడు.

"మాలతి చిన్నపిల్లనా నీ ఉద్దేశం... ఏదో గౌరవం ఇచ్చి చెప్పింది ప్రసాద్‌ని పెళ్ళి చేసుకోవద్దు, నాన్న తెచ్చిన పుల్లాయ్‌ని పెళ్ళాడు అంటే అది ఏమనుకుంటుంది. అయినా ఇదేం సలహా."

"మంచిగా వినకపోతే కట్టి పెళ్ళి చెయ్యాల్సిన బాధ్యత మనమీద వుంది తెలుసా"

"అంత అనవసర శ్రమ మనంఎందుకు పడాలి. ఇష్టంలేని వాణ్ణి అది పెళ్ళి చేసుకుంటే మనకి సుఖం ఏమిటి ? మన ఇంట్లో కన్నీళ్ళకి, కష్టాలకి కొదవేం లేదు. ఇదో కొత్త ప్రోబ్లమ్ ఎందుకుట"

"నాన్న చెప్పమన్నారు నీతో"

"నాతోనా. ఆ చెప్పేదేదో ఆయన నాతోనే చెప్పచ్చుగా..."

"అది నీ మాట వింటుందని ఆయనకూ, నాకూ తెలుసు..."

"సారీ అన్నయ్యా. వీధిలో వాళ్ళకయితే ఒక సలహా, ఇంట్లోవాళ్ళకి మరో సలహా నేనివ్వలేను. అది ఏనాడి పరీక్షించి ప్రసాద్‌ని ఎంచుకుంది. మన కులం వాడు కాకపోవటం తప్పించి అతనికి వేరే డిస్‌క్వాలిఫికేషన్స్ లేవు. కులంవాడే

బాగా చూస్తాడూ, బాగా ప్రేమిస్తాడని మనం గ్యారంటీ ఇవ్వలేంగా!"

"నువ్వు మరీ మితిమీరిపోతున్నావ్"

"ఇందులో చెడు ఏముందని మనం మాలతి మీద కత్తి కట్టాలి చెప్పు?"

కాంతారావు కోపంగా అనేశాడు.

"నా అనుమానం నిజం అన్న మాట. మాలతికి నీ వత్తాసు ఉందన్నమాట..."

"ఆఁ..."

"ఈ పెళ్ళి జరుగుతుందనేనా..."

"కాకపోతే అది ఇంట్లోంచి లేచిపోయి రిజిస్టర్డ్ మేరేజ్ చేసుకుంటుంది. మనమేం చెయ్యగలం...అప్పుడు..."

"ఇద్దర్నీ తన్ని"

సారథికి నవ్వొచ్చింది. "జీవితాలతో ఆటలాడ్డం, జీవితం మన చేతిలో బొమ్మ అనుకోవడం ఎంత అవివేకం! కాలాన్ని మించిన వేగంతో మనసులు ఉరకలు వేస్తూంటే, ఆ ఉరకల్లో, పరుగుల్లో మనుషులు కొత్త అవతారాలు దాల్చి కొత్త పుంతలు తొక్కుతూంటే వాళ్ళని గతం గోతులోకి తోసి 'అదే నీ స్వర్గంగా భావించుకో' అనడం ఎంత పురాతనం!"

"నువ్వు నాటకాలనీ, పుస్తకాలనీ, నీ ఇష్టం వచ్చినట్టు ఉంటున్నావ్. మేం ఏమనలేదు. ఆ నాటకాల పిల్ల శాంతితో నువ్వు తిరిగే తిరుగుళ్ళూ నాకు తెలుసు. మనం మగవాళ్ళం. కానీ ఆడది అలా ఉంటే లోకం హర్షించదు. దాన్ని నీలా తయారు చెయ్యకు" కఠినంగా అన్నాడు కాంతారావు.

సారథికి కోపం ఆగింది కాదు.

"శాంతి గురించి నువ్వు మరో ఉద్దేశంలో అంటున్నావ్. శాంతి నాకు స్నేహితురాలు. ఆ అమ్మాయి జీవితానికీ, మాలతి జీవితానికి పోలిక లేదు. కానీ శాంతి ఎదుర్కొన్న జీవితం, ఆ అమ్మాయి జీవితంతో చేసిన యుద్ధం మాలతి చేస్తే అన్నగా నేనెంతో సంతోష పడతాను"

"ఇష్టం అయిన దాన్ని పొగడక ఏం చేస్తావ్ వెనకేసుకు వస్తున్నావ్ పైగా"

"మంచివాళ్ళని మర్చిపోవడం కష్టం. వాళ్ళలాగే మనకి నచ్చినవాళ్ళ బ్రతుకులు కూడా వెడితే చూడాలనివుంటుంది"

"ఛీ ఛీ నీకు బుద్ధి లేదు" కాంతారావు వెనక్కి తిరిగి త్వరగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

సారథి అక్కడే ఉన్న పార్కు బెంచీమీద చతికిల బడ్డాడు. అవును ఇదే మిటి? శాంతి గురించి ఎవరు మాట్లాడినా తనకి ఆవేశం వస్తుంది! ఆ అమ్మాయి గుర్తుకు వస్తేనే మనసు ఉద్రేకంతో పరవళ్ళు తొక్కుతుంది. ఏదో నాటకంలో వేషాలు వేసే అమ్మాయిగా తను శాంతిని చూసి ఊరుకోలేదు కొద్ది పరిచయంతో శాంతి తనకి ఎంత దగ్గరగా వచ్చింది. సారథి శాంతి గురించే ఆలోచిస్తున్నాడు.




స్టౌవ్ మీద అన్నం దింపింది శాంతి. వంటిల్లు అంతా శుభ్రం చేసింది. పది నిమిషాల్లో స్నానం పూర్తిచేసి జడ వేసుకుని సాదా నేత చీర కట్టుకుని, ద్వార్లో




పూసిన నంది వర్ధనాలు తల్లో పెట్టుకుని కర్రి కుర్చీలో కూర్చుని నాటకం పుస్తకం 'విధి' తీసుకుంది. అరగంట తన పోర్షన్ చదువుకుంది...ఇంకా చదవాలంటే విసుగేసింది. పుస్తకం కొసలు మీద గీస్తూ కూర్చుంది.

నాటకం వారం వుంది. దాంతో 'విధిని'ని విసిరి మూల పారెయ్యొచ్చు. శాంతికి నవ్వొచ్చింది. 'విధి' కాకపోతే ఆ తర్వాత మరో పుస్తకం చదవాలి... ఏదో పాత్ర తీసుకుని ఆ పాత్రని తనకి ఆపాదించుకోవాలి.

శాంతికి తను వేసిన నాటకాలు, అందులో వేషాలు,ఆ వేషాలు వేసిన మనుషులు కళ్ళల్లో తిరుగుతున్నారు. అదే లోకం. చిన్న లోకం. కడుపు నింపుతోన్న ఉద్యోగం.

శాంతి ఆలోచించకూడదనుకుంది ... గబ గబా లేచి వీధి తలుపులు తెరిచి చూసింది. చీకటయితే పడింది గానీ ఏడు గంటలు కూడా కాలేదు. రిహార్సెల్స్‌కి ఇంటి దగ్గర నుంచి 8 గంటలకు బయలుదేరితే చాలు...సారధి గారు వస్తానని చెప్పారు.

లోపలికి వెళ్ళి కంచం వాల్చుకుని అన్నం పెట్టుకుంది. గబ గబా నాలుగు మెతుకులు తినాలనుకుంది. ఎప్పుడు అన్నం ముందు కూర్చున్నా ఈ మధ్య తరుచు కన్నీళ్ళు వస్తున్నాయి ... తిండి కోసం తనెన్ని అగచాట్లు పడింది..చిన్నప్పటి నుంచీ అన్నం ముందు కూర్చుని ఏడవడం తనకి అలవాటయిపోయింది... నెత్తి మీద రెండు మొత్తిగానీ పిన్ని అన్నం పెట్టేది కాదు..... ఏడుస్తూనే తను ఎదిగింది. తన జీవితంలో ఏడుపు ఒక భాగం అయిపోయింది. రెండు ఏళ్ళ నాడు తన ఏడుపుకి పరాకాష్ఠ ... పదేళ్ళు రాకుండానే తల్లీ తండ్రీలేని బాధ అంటే ఏమిటో అర్థమయ్యింది. తోటి స్నేహితుల్లా చదువుకొనేందుకు లేక, నవ్వడం తెలియక గడిచిపోయింది చిన్న

తనం.

అమ్మా నాన్నా సంపాదించి పిల్లల్ని నవ్వించి పెంచుతారు ఏ ఇంట్లో అయినా! పన్నెండో ఏటే తను సంపాదన పరు రాలయ్యింది. సాంఘిక నాటకాల్లో చిన్న పిల్లల వేషాలు వేసేది. అయినా తనకి రోజు గడిచేది కాదు. పరికిణీ కండువా వేసుకున్న పది రోజులకే తనకి సైడ్ హీరోయిన్ వేషం వచ్చింది. ఆ రోజు తనెంత గర్వపడిందని. నాటకంలో తను ధరించిన పాత్ర ధరించిన చీర కొనుక్కో వాలని! అదొకటే కాదు-ఆ వేషం లాగే తన భవిష్యత్ కూడా వుండాలని! ఎదిగీ ఎదగని కోరికలు పూత పూసి ఫలించ డానికి వెనక ఎన్ని ఇబ్బందులు వుంటాయో తనకి తెలియలేదు అప్పట్లో! ఏడాది గడిచింది. అప్పుడే డైరెక్టర్ రమేశం గారు తనని కొత్త నాటకంలో ప్రధాన పాత్రకి తీసుకున్నది! అవును, అప్పుడే తన బ్రతుకు కూడా ఒక విషపు మలుపు తిరిగింది.

జగన్ హీరో వేషధారి. అతన్ని తను రెండు మూడు నాటకాల్లోచూసింది. అతని పక్కన తను హీరోయిన్ వేషం వేయాలనుకునేది. అదీ నిజం అయ్యింది. వరుసగా నాలుగైదు నాటకాల్లో వేశారు. అతను నాటకంలో పోర్షన్ చదువుతూంటే తనతో మాట్లాడుతోన్నట్టూ బాసలు చేస్తో న్నట్టూ వుండేది. రిహార్సెల్స్‌లో జగన్ భుజం మీద చెయ్యి వేసినా, ప్రేమతో కౌగలించుకున్నా ఎందుకో తనకది నట నలా తోచేది కాదు.

వయసు పిచ్చిది! పిచ్చి నమ్మకాలకి ఆశలు కూడా తోడవుతాయి.



జగన్ తన గురించి పినతల్లినీ పిన తండ్రినీ అడగడం, వాళ్ళు కూడా తనని జగన్‌తో పెళ్ళికి ప్రోత్సహించడం, తను పెళ్ళికి ఒప్పుకోవడం అన్నీ నిమిషాల మీద జరిగాయి. పెళ్ళీ, కాపురం, నాట కాలూ ఒక దానితో ఒకటి ముడివడ్డాయి. అలా ఏడాది జరిగిందేమో! కానీ ఏమ యింది!

జగన్ తనతో పోట్లాట పెట్టు కుందుకు, తనని హింసించడానికి, తన డబ్బుకోసం దిగజారడానికి ఎంతో కాలం పట్టలేదు. మనిషిలో దుర్గుణాలు ఒక్కొ క్కటే చూపించడం మొదలు పెట్టాడు.

ఆఖరికి తెలిసొచ్చింది. ఇంటిలోవాళ్ళ మాటలు నమ్మి, అంతకు మించి జగన్ బాసలు విని వినీ తను పతనంవైపు పరి గెత్తినట్టు!

జగన్ తను ధరించే ప్రధాన పాత్ర ధారిలా కాకుండా తన ముందు ఓ రోజు కొత్తరూపంతో కన్పించాడు. ప్రేమనీ పెళ్ళినీ వేళాకోళం చేసి,తీసి పారేశాడు.

"నాటకాలు అడ్డం తెలిసిన దానివి; నాతో సంసారం చేస్తావా నువ్వు" అనే వాడు.

"బ్రతుకు నాటకం అవదుగా."

జగన్ తన పాలిట విలన్‌అయ్యాడు. ఎన్ని పుస్తకాలు చదివింది తను! ఎంత మంది జీవితాల్ని తెలుసుకుంది తను! ఇరవై ఏళ్ళ వయసులో పెంచినవాళ్ళు వెక్కిరించి వీధిలోకి గెంటితే, ప్రేమించిన వాడు వెటకారం చేస్తే ఏ ఒక్కరూ తనని ఆదుకోలేదు.

అవును. అప్పుడే అర్థమయింది. పుస్త కాలు చదువుకుందుకు మాత్రమేనని, వేషాలు ధరించడానికేననీ!

ఉన్న రెండు చీరలతో డైరెక్టర్

వెంకట్రావు గారింటికి వెళ్ళి రెండు రోజులు తల దాచుకుంది. ఆయన అంతా విని నొచ్చుకున్నాడు.

ఆ పైన హైదరాబాద్ వెళ్ళమనీ, అక్కడ స్త్రీ పాత్రధారులకి గిరాకీ వుందనీ సలహా యిచ్చాడు. తనకి తెలుసున్న రామేశంకి ఉత్తరాలు రాసి యిచ్చాడు.

పుట్టి పెరిగిన బెజవాడలో దొరికిన చేదు అనుభవాలను కొంగున కట్టుకుని చెదిరిన మనసుతో తను హైదరాబాద్ వచ్చింది. హైదరాబాద్‌లో అన్నానికి కరువు కాలేదు. చిన్న చిన్న వేషాలు వేసింది. ఎక్కడో చింతల్‌బస్తీలో ఇల్లు అద్దెకు తీసుకుంది.

సరిగ్గా ఆర్నెల్లకి తను మంచి నటిగా, నాటక ప్రదర్శన అనంతరం ఉత్తమ నటిగా నిలబడ గల్గింది. అందుకు తను చేతులెత్తి దణ్ణం పెట్టదగిన పెద్ద మనిషి రామేశం.

వరసగా తన దర్శకత్వంలో రెండు నాటకాల్లో వేషాలు యిచ్చాడు.

శాంతికి సారథి కళ్ళముందు కదిలాడు. మంచి సంస్కారం ఉన్న మనిషిని చూడ్డం తనకదే మొదటిసారి. ఏదో మంచి పుస్తకం చదివిన సంతోషం సారథితో మాట్లాడితే కలుతుంది. తనింటికి వచ్చి అరమరికలు లేకుండా మాట్లాడ్డం భోజనం చేయమంటే సరేననడం తనకెంతో ఆశ్చర్యంగా ఉండేది.

"మర్యాదకి అన్నాను. మా ఇంట్లో మీరు అన్నం తింటారా?"

"మీ ఇంట్లో నేను తినకూడదా. నేను అంటరానివాణ్ణనుకుంటున్నావా?"

"మీరు పెద్ద కులంవారు"

"కులం గురించి నా కంతగా పట్టింపు లేదు. ఆప్యాయంగా అన్నం పెట్టేవాళ్ళు ఎవరైనా నాకు సమ్మతమే."

కలిసి భోజనం చేస్తే మనుషులు దగ్గరవుతారని తనెక్కడో చదివింది. నిజమేనేమో.

రిహార్సల్స్ ముందుగా ఇంటికి వచ్చి సాహిత్యం మీద మాట్లాడేవాడు. రిహార్సల్స్ అయిన తర్వాత అర్ధరాత్రి అయినా పట్టించుకోకుండా ఏదో చెప్తూనే ఉండేవాడు.

"ఇవన్నీ నాకెందుకు చెప్తున్నారు మీరు"

"నాటకాలు వేసేవాళ్ళు రంగు కడిగేసుకుని అంతా మర్చిపోవడం నా కిష్టం వుండదు. ఈ నాటక రంగం పుట్టు పూర్వోత్తరాలే కాకుండా దీనితో సంబంధం ఉన్న కళలన్నీ తెలుసుకోవాలి. పైగా మన తెలుగు దేశంలో నాటకాల్లో వేషాలేసే అమ్మాయిలంటే అట్టడుగు మనుషులని అందరికీ ఓ చులకన భావం ఉంది. మా సమాజంలో వేషం వేసే నువ్వయినా కాస్త లోతుపాతులు తెలిసిన దానివంటే మాకే గర్వం. అందుకని ఇవన్నీ చెప్తున్నాను."

"పొట్ట కోసం పడే తిప్పలు, ఎంత దాచుకుంటే ఎంత నేర్చుకుంటే ఏం లాభం."

"నాటకాల మీదే నీ జీవితం వెళ్ళనప్పుడు నువ్వు ఆకలితో పస్తులు ఉండకూడదు. ఖాళీగా ఉన్నప్పుడు చదువు, మెట్రిక్ పాసుకా. నువ్వేదో సినిమా స్టార్ వయి పోతావని నమ్మించడం నాకు ఇష్టం వుండదు. ఈ నాటక రంగాన్ని నమ్ముకున్నవాళ్ళెవరూ బాగుపడగా నే చూడలా.

అందుకే మన భవిష్యత్ మనం చూసుకోవాలి."

"నేనంటే మీ కెందుకింత అభిమానం."

"నాకు నచ్చిన వాళ్ళు. వేళ్ళుతన్ని నిటారుగా నిలబడే మనుషులవ్వాలని నాకు వెర్రి ఆశ. నా ఆత్మీయుల భవిష్యత్ గురించి కలలు కంటూంటే నాకు గొప్ప థ్రిల్ కల్గుతుంది. ఇదో జబ్బేమో నాకు తెలియదు"

తను నవ్వేసేది!

అంతటితో సారధి ఆగేవాడు కాదు. తన ఇంటి గురించి ఇంట్లో మనుషుల గురించిన బాధలు, సుఖాలు, అన్నీ చెప్పేవాడు.

నిన్నటికి నిన్న మాలతి గురించి చెప్పాడు. తన సలహా అడిగాడు. మాలతి



గురించి తనేం చెప్పగలదు.

తన కెందుకో భయం వేసింది.

"మాలతిని మీ ఇంటికి తీసుకు వస్తాను" అన్నాడు.

"మా ఇంటికా!..."

"మా చెల్లెలు నీకు పరిచయం అవడం మంచిది."

"ఎందుకు?"

"కొంత కాలం దానికి ఆప్తురాలివి నువ్వే అవ్వాల్సి వస్తుందేమో."

"అంటే"

"మా ఇంట్లో వాళ్ళు ఒప్పుకోక పోతే అది ఇటే రావల్సి వుంటుంది."

"అమ్మో.."

"నిన్నెవరూ ఏంచెయ్యరులే! నువ్వంటే మా వాళ్ళు ముందే దడుస్తారు." సారధి నవ్వేశాడు.

శాంతి ఆలోచనలు కట్టిపెట్టి కంచం ముందు నుంచి లేచింది-వీధి తలుపు చప్పు

దవుతూం టే:

"ఎవరూ?" అంటూ అడిగింది తలుపు తీయకుండానే

"నేనే శాంతీ!"

శాంతి తలుపు తెరిచింది.

సారధి లోపలికి వస్తూనే "తయారుగా ఉన్నావా?"

"ఆ..."

"అయితే పద."

ఇద్దరూ రోడ్డు మీదికి వచ్చారు. ఓ ఫర్లాంగు దూరం వరకూ ఎవరూ మాట్లాడుకోలేదు.

సారథే అన్నాడు.

"నే అనుకున్నంతా అయ్యింది.మాలతి ప్రసాద్‌ని పెళ్ళి చేసుకుంటానంటే మా వాళ్ళు ఒప్పుకోవడం లేదు."

"అరెరే.."

"మాలతి మాత్రం తన ఉద్దేశం మార్చుకునేటట్టు లేదు."

"మరయితే ఏం చేస్తారు."

"గప్ చుప్‌గా రిజస్ట్రారాఫీసులో పెళ్ళి చేసుకుంటాం అంటున్నారు."

"రిజస్ట్రార్ ఆఫీసులోనా."

సారథి నవ్వేశాడు. "ఏం అక్కడ చేసుకుంటే పెళ్ళికాదా."

"కాదని కాదు."

"అసలు నేనయితే అదీ వద్దన్నాను. మీ ఇద్దరూ ప్రేమించుకున్నారు. ఒకళ్ళని వదలిఒకళ్ళు ఉండలేరు. మధ్యలో ఈ పెళ్ళితతంగం అనే అతుకులేకపోతే మీరు గాఢంగా ప్రేమించు కోలేరా అంటే మొహాలు దించుకున్నారు."

"మీరు మరీను. పెళ్ళి కాకుండా ఎలా?"

"ఏమిటట నష్టం పెళ్ళి కాకపోతే?"

"అవన్నీ మీరు పాటించండి. చెల్లాయిని ఎందుకు బెదరేస్తారు. ఇంతకీ అసలు విషయం చెప్పండి."

"వారం తరువాత పెళ్ళి. ఆ తరువాత, అంటే అతనికి ట్రాన్స్‌ఫర్ వచ్చే వరకూ మాలతి మీ ఇంట్లో వుంటుంది. నీకు ఇష్టమేనా?" శాంతి మాట్లాడలేదు.

"ఏం భయపడుతున్నావా?"

"లేదండీ"

"మరింకేం? సమాధానం చెప్పు"

"మీ ఇష్టం"

"థాంక్యూ"

"నో మెన్షన్"

"మా ఇంట్లో ఇంతకాలానికి కన్నవాళ్ళని ఎదిరించే ఆడపిల్ల తయారయ్యింది మా వంశాన్ని కిందా మీదా పడేసి కుదిపి చరిత్ర తిరగేస్తే మా మాలతే మా ఇంటికి ఫస్ట్ లేడీగా చరిత్రలో నిలబడుతుంది"

శాంతి వింటోంది.

"మార్పు, మార్పు రావాలి శాంతీ! మనుషులు రాళ్ళలా, మర మనుషుల్లా బ్రతక కూడదు. చైతన్యం చావకూడదు. ఇలా ఇంటి కొకళ్ళు సాంప్రదాయాల మీద, కులంమీద తిరగబడితే ఎన్నోవేల సంవత్సరాలకిగానీ మనం ముందు పడం తెలుసా?"

"గొప్ప...దీనివల్ల ఏమవుతుంది... ఇవన్నీ తాటాకు మంటల్లాంటివి. మన సంఘంలో సవాలక్ష అవకరాలున్నాయి.. ఇవన్నీ నరుక్కుంటూ రావాలంటే ఎవరి వల్ల అయ్యేపని. బలి తీసుకోవడం తప్ప గుణపాఠం నేర్చుకోవడం మన జాతికి తెలియదు" శాంతి గబగబా అనేసింది.

సారధి ఆశ్చర్యంగా చూశాడు అంత చీకటిలోనూ శాంతివేపు. ఎంత ఘాటుగా

విమర్శించింది. ఎంత ఆవేశం విరజిమ్మింది. మరతుపాకీలా.

"పద, త్వరగా నడు" అంటూ సారధి శాంతి చెయ్యి పుచ్చుకున్నాడు.

"ఇదేమిటి ఇక్కడే రిహార్సెల్సా?"

"ఆ ... పంచభూతాల సమక్షంలో కొత్త నాటకానికి తెర ఎత్తవల్సిన రోజు ఈరోజే అవుతుందేమో? ఎవరికి తెలుసు?"

"ఇవన్నీ మీ డైలాగులు కావండీ. నావి మేస్తారూ. ఓవర్‌లాపింగ్... ?" నవ్వేసింది శాంతి.

"అయితే నువ్వు అను వింటాను. పోర్షన్ వచ్చిందో లేదో కూడా తెలుస్తుంది".

"రోడ్డుమీద జనం విని, మనని పిచ్చివాళ్ళనుకుంటారు".

సారధి నవ్వేశాడు. ఇద్దరూ రిహార్సెల్స్ వేసే పాత స్కూలు బిల్డింగ్‌లోకి, అల్లరి పిల్లలమాదిరి ప్రవేశించారు.



సాయంత్రం ఆరు దాటింది. మాలతి ఇంటికి రాకపోవడంతో లక్ష్మమ్మగారు వీధి గుమ్మం దగ్గరే తచ్చాడుతోంది. అరుంధతిని పిల్చి "మాలతి ఇంకా యింటికి రాలేదు, ఎంచేతనంటావ్?" అని అనుమానంగా అడిగింది.

"ఆఫీసు నుంచి ఏ స్నేహితురాలింటికైనా వెళ్ళిందేమో" అంది అరుంధతి.

"ఈయనా, కాంతారావు కూడా రాలా. నాకేమిటో భయంగా ఉంది."

"మీరు అనవసరంగా కంగారు పడకండి."

"పోనీ నువ్వోసారి ఫోన్ చేసి చూడమ్మా"

అరుంధతి "అలానే" అనిచెప్పి పక్కింటికి వెళ్ళింది.

ఈ లోపునే సుబ్బరామయ్య, కాంతారావూ వీధిలోంచి వచ్చారు. లక్ష్మమ్మగారు వాళ్ళని చూసి ఆదుర్దాగా మాలతి సంగతి చెప్పింది.

"సారధిగాడు వచ్చాడా?"

"వాడూ రాలా"

"ఇద్దరూ కలిసి ఎక్కడికైనా వెళ్ళారేమో"

ఇంతలో అరుంధతి వచ్చింది.

"మాలతి ఆఫీసులో వుందామ్మా?"

"లేదుట. మధ్యాహ్నమే ఆఫీసు వదిలి వెళ్ళిందిట."

"అయ్యో, ఎలాగండీ ఇప్పుడూ"

సుబ్బరామయ్యగారు "కంగారు పడకు" అని భార్యని హెచ్చరించాడు గానీ ఆయన ఆలోచన పరిపరి విధాల్పోతోంది. కాంతారావు వైపు చూశాడు.

"నేను ఆ ప్రసాద్‌గాడి రూమ్‌కి వెళ్ళి చూసి వస్తాను" అన్నాడు కాంతారావు.

"ఎందుకులే" అన్నాడు సుబ్బరామయ్య.

"వెళ్ళనివ్వండీ" అంది లక్ష్మమ్మ.

"వాడితో ఏం ఘర్షణ పడకు."

ఇంతలో వీధిలోంచి సారధి వచ్చాడు. వస్తూనే వాకిట్లో కంగారుగా ఉన్న నలుగురి మనుషుల్నీ చూశాడు. కానీ ఏమీ

కానట్టుగా తన గదిలోకి వెళ్ళబోయాడు.

"సారథీ!" సుబ్బరామయ్యగారు కేక వేశాడు. సారథి ఓసారి తండ్రి వైపు చూసి "ఏం నాన్నగారూ" అన్నాడు.

"మాలతి ఇంతవరకూ యింటికి రాలా, ఎక్కడికి వెళ్ళిందో! నీకేమన్నా చెప్పిందా?"

"నాకేం చెప్పలా మధ్యాహ్నం దాన్ని నేను బజారులో చూశానే! ఎక్కడికి వెళ్ళుంటుంది చెప్మా."

"బజారులో కన్పిస్తే అడగొద్దూ దాన్ని నువ్వు."

"బావుందమ్మా రోడ్డుమీద నిలవేసి కేకలు వేయడానికి అదేం చిన్నపిల్లా? ఇంకా 8 అయినా కాలేదుఅదే వస్తుంది."

"నేను వెళ్ళి చూసి వస్తాను" కాంతారావు బయటకు వెళ్ళబోయాడు.

"మాలతిని వెదకడానికా?"

"అవును. పెళ్ళి కావల్సిన ఆడపిల్ల నీకు పట్టకపోయినా నాకు బాధ్యతవుంది."

"బా ధ్య త అని ఎందుకంటావు. భయం అను."

కాంతారావు సారథివైపు కోపంగా చూసి వీధిలోకి వెళ్ళిపోయాడు.

"రేపటినుంచి దాన్ని ఉ ద్యో గ ం మానేయమను" అనేసి సుబ్బరామయ్యగారు లోపలికి వెళ్ళాడు.

"రామ రామ ఏం కొంపో" అంటూ లక్ష్మమ్మగారు వంటింట్లోకి వెళ్ళింది.

"ఏం వదినా నువ్వేం మాట్లాడవేం ?"

"నువ్వు మాట్లాడితే విందామని"

సారథి హేండ్‌బేగ్‌లోంచి ఓ పేకెట్ తీసి, దాన్ని విప్పి అందులో వున్న స్వీట్స్ తీసి

"తీసుకో వదినా" అన్నాడు.

"ఇదేమిటి స్వీట్స్ తినిపిస్తున్నావ్."

"మా స్నేహితుడు ఈ రోజు పెళ్ళి చేసుకున్నాడు. ఆ సందర్భంలో విందు జరిగింది. అదీ విశేషం."

"అంతే కదా హడిలిపోయాను."

"ఎందుకు వదినా."

"ఎందుకేమిటి? ఈ స్వీట్స్ మాలతి పంపిందేమోనని భయం వేసింది."

"భయం ఎందుకు వదినా. మనమే ఇలా భయపడితే అదేం చెయ్యాలి చెప్పు? అది మనల్నేం అడిగిందని? కొంచెం చేయూత, కొంచెం సహాయం కాదా"

"అవుననుకో."

"ఇష్టమైన వాణ్ని పెళ్ళాడతానంది. అలా కాదని ఇష్టంలేని వాణ్ణి పెళ్ళాడ మనడం ఈ రోజుల్లో మూర్ఖత్వం కాదా?"

అరుంధతి మాట్లాడ లేదు.

"మనిళ్ళల్లో ఆడవాళ్ళ ఇష్టా యిష్టాలు తెలుసుకోకుండా పెళ్ళిళ్ళు చేయడం సాంప్రదాయంగా వస్తోంది. దానివల్ల ఎంత క్షోభ పుడుతుందో నీకు నేను వేరే చెప్ప నవసరం లేదను కుంటాను."

"నిజమే..."

"అన్నయ్య నీతో ప్రవర్తించే పద్ధతి చూసిన త ర్వా త నాకేమనిపిస్తుందో తెలుసా!" ఆగి అన్నాడు.

"ఎందుకులే, చె ప్పి నా నువ్వు ఒప్పుకోవు తిట్టి పోస్తావు"

"వెళ్ళి అన్నం తిను ఈ గొడవల కేంలే!"

"అమ్మ నాకు అన్నం పెట్టే స్థితిలో లేదు. నువ్వే వడ్డించు."

"పద.."

ఇద్దరూ వంటగది వైపు వెళ్ళారు. సా ర థి మాట్లాడకుండానే భోజనం

చేశాడు. చెయ్యి కడుక్కుని వాకిట్లోకి వచ్చేసరికి కాంతారావు వీధిలోంచి వచ్చాడు.

"ఏరా నీకు బుద్ధుందా. అన్నం తింటున్నావా గడ్డి తింటున్నావా.?"

"ఏమిటండీ ఆ మాటలు."

కాంతారావు "నువ్వు నోర్మూయ్" అనేసి లోపలికి చూసి "నాన్నా నాన్నా" అంటూ కేకలు పెట్టాడు.

"ఏమిటి" అంటూ పడగ్గదిలోంచి సుబ్బరామయ్యగారు వచ్చారు. వెనకే లక్ష్మమ్మ వచ్చింది.

"మాలతి మనం అనుకున్నంత పనీ చేసింది నాన్నా. మధ్యాహ్నం అది ఆ ప్రసాద్‌గాణ్ణి రిజిస్ట్రారాఫీసులో పెళ్ళి చేసుకుంది."

"ఆ..."అనగల్గాడు సుబ్బరామయ్య లక్ష్మమ్మ ఏడుపు మొదలు పెట్టింది.

"వీడేం తెలియనట్టు మన దగ్గర నాటకం ఆడాడు. వాళ్ళ పెళ్ళికి విట్‌నెస్‌గా సంతకాలు చేసిన ప్రసాద్ స్నేహితుడు నాకంతా చెప్పాడు. వెనక నుంచి గ్రంధం నడిపించింది వీడే."

"ఏరా,అన్నయ్య చెప్పింది నిజమేనా? పసువా... ఇంత పని చేస్తావా" సుబ్బరామయ్య కోపంతో ఊగిపోయాడు.

"ఎందుకు చేశావురా యి లా?" లక్ష్మమ్మగారు గొణుక్కుంటోంది.

"అదెక్కడ ఏడుస్తోంది, చెప్పు."

"మొగుడి దగ్గర వుంటుంది."

"నోర్మూయ్.."

"పెద్ద తెలివిగా! మాట్లాడుతున్నాననుకోకు." కాంతారావు అరిచాడు.

"ఇందులో తెలివేంలేదు. దాని కిష్టమైంది. చేసుకుంది. మనం గొంతు చించు కోవడం దేనికిట?"

"అంతా దానిష్టమేనా?"

"ఇప్పుడదే రుజువయింది. అయినా మీరు తెచ్చిన సంబంధం అది ఇష్టపడనప్పుడు మీకెందు కుండాలి పట్టుదల. దాని మీద మీ హక్కు ఆధిపత్యం చెల్లాలను కోవడం తప్పు కాదా?"

"పరువు మర్యాదలు ఉండక్కరలా" కాంతారావు అన్నాడు.

"ఈ ఇంటి పరువు మనం నిలబెడితే, అది పాడు చేసిందని బాధ పడొచ్చు. ఎవరి లొసుగులు వాళ్ళకున్నాయి."

"ఎవర్నిరా నువ్వు అంటున్నది."

"నిన్నే అన్నయ్యా. నువ్వు పెద్ద మనిషివి. అయినా భార్యని లెక్క చేయకుండా మీ ఆఫీసులో సుజాత అనే అమ్మాయితో సంబంధం పెట్టుకున్నావ్? ఈ విషయం అందరికీ తెలుసు. అయినా నిన్నెవరూ ఏం అనరు? పెళ్ళాన్నీ, పక్కన మరో పిల్లనీ ఏలుతున్నందుకు నీకుగర్వం తప్ప, కించిత్తు బాధలేదు. నిన్నెవరూ తప్పు పట్టడం లేదే! అదే నీ చెల్లెలు ఎవణ్నో పెళ్ళి చేసుకుంటే, దానికి నలుగురూ నిన్ను నిలేస్తే నువ్వు నచ్చజెప్పు కోలేవా?"

"ఏమిట్రా ఆ మాటలు. అరుంధతి నిజం అనుకుంటుంది. పెద్దవాడని లేకుండా ఆ నిలవేయడం మంచిది కాదురా" లక్ష్మమ్మ అంది.

"ఏం వదినా! అన్నయ్య ప్రవర్తన నీకు బాధగా లేదా? అన్నయ్య నిన్ను.."

కాంతారావు వెంటనే "నోర్మూయ్య వోయ్ ఫూల్" అని అరిచి "లోపలికి పద. వీడికి మతి పోయింది" అంటూ అరుంధతి వైపు చూశాడు. అరుంధతి

తల వంచుకుని తమ గదిలోకి వెళ్ళింది. కాంతారావు కూడా వెనకే వెళ్ళాడు.

"మరి దాని సంగతేమిటండీ?"

"ఎవరికిష్టమొచ్చినట్టు వాళ్ళని ఏడవని. అది చచ్చిందనుకుంటాను" సుబ్బరామయ్యగారు కూడా తన గది లోకి వెళ్ళిపోయాడు.

అక్కడ లక్ష్మమ్మగారూ సారథీ మిగిలారు.

"ఏరా సారథీ అన్నయ్య చెప్పింది నిజమేనా మాలతి పెళ్ళి అయిపోయి నట్టేనా ?"

"నువ్వు ఏడుపు మానేసి కళ్ళు తుడుచుకో అమ్మా. నీ కూతురు పెళ్ళి చేసుకుంది. సంతోషంగా బ్రతుకుతుంది. అందుకు మనం సంతోషపడాలి. ఏడవడం తప్పమ్మా"

"ఇది పెళ్ళిట్రా"

"అది చేసుకున్న పెళ్ళి"

"ఇప్పుడది ఎక్కడ ఉందిరా"

"ఏమో"

"ఒక్కసారి దాన్ని చూడాలిరా" లక్ష్మమ్మ ఏడ్చేసింది.

సారథికి తల్లి ప్రేమ కరిగి నీరవడం కన్పడుతోంది. తండ్రి,తోడబుట్టిన వాళ్ళు మనసులోని ప్రేమని అహంకారపు పొరల మధ్య దాచుకుంటూంటే, తల్లి మాత్రం ఆ ప్రేమని ఏ స్వచ్ఛంగా లేకుండా బహి ర్గతం చేసుకుంటోంది. కానీ ఆ ప్రేమకి కూడా ఆటంకాలు పడతాయి.

"మాలతి వస్తుందే.తప్పకుండా, నిన్ను చూడ్డానికి వస్తుంది. నా మాట నమ్ము నే తీసుకువస్తాను సరేనా."

"ఎలారా నాన్నకి తెలిస్తే"

సారథికి యాభై ఏళ్ళ తల్లిలో అమాయకత్వం అసహాయత, భయం కన్పించాయి. ఏ అనుభూతినీ ధైర్యంగా ప్రదర్శించుకోవడం తెలియక, అవకాశం లేక భర్త చాటున కాపురం వెళ్ళదీసిన ఓ భారతనారి తల్లిలో దర్శనమిచ్చింది.

"నే ఉన్నానమ్మా సరేనా"

లక్ష్మమ్మగారు పయిట కొంగుతో కళ్ళు వత్తుకుంటూ కన్నీటి పరవగా నెమ్మదిగా లోపలికి వెళ్ళింది. సారథి అలా చూస్తూనే ఉన్నాడు.



తప్పు చేయడం చాలా సాధారణం. ప్రతి మనిషీ ఏదో ఒక పరిస్థితిలో తప్పు చేస్తూనే ఉంటాడు.కొందరు చేసిన తప్పుకు లెంపలు వేసుకుని దారి తప్పామని తెలుసు కుని బాగుపడతారు. మరికొందరు తప్పులు చేయడానికి అలవాటుపడితప్పులకు పది తప్పులు చేస్తూ దారితప్పి బ్రతుకుతారు.

కాంతారావుకుతనకు సుజాతతో ఉన్న సంబంధం గురించి ఏదోఒకరోజు భార్యకి, ఇంట్లో వాళ్ళకి తెలియక తప్పదనితెలుసు. అరుంధతి మంచితనం అతనికి మరింత ధైర్యం ఇచ్చింది. పైగా తల్లీ తండ్రీ తనని అనుమానించరని అతనికో పిచ్చి నమ్మకం.

భార్యకి ద్రోహం చేయకూడదనీ, జీవి తంలో ఆదర్శాలతో బ్రతకాలనీ అతనికి ఎప్పుడూ తోచదు. అరుంధతిని తన పీకకి బలవంతంగా కట్టబెట్టారని అతనికి

కోపం. పెళ్ళిచేసిన తల్లిదండ్రుల్ని ఎదిరించలేక ఆ కోపం అరుంధతి మీద ప్రదర్శించేవాడు. పైగా సుజాత అందం, మాటకారితనం ఆమెకి కట్టి పడవేశాయి. అలంకరణలో, ఆకర్షణలో, హొయలు ప్రదర్శించడంలో సుజాత అందెవేసిన చెయ్యి. సుజాత ఆకర్షణలో అతనికి లేని తెగింపు పుట్టుకొస్తుంది. సుజాతకోసం అరుంధతిని వదులుకుందుకైనా అతను సిద్ధపడ్డట్టుగా ఊహించుకునే వాడు. అలాంటి ఊహ రాగానే అతనిలో పశుప్రవృత్తి తలెత్తేది. అరుంధతి తనతో విసిగి పుట్టింటికి వెళ్ళిపోతే, ఆపైన తను విడాకులు తీసుకోవచ్చనే ఆశ కూడా ఉండుడి మెదడులో తలెత్తేది.

సాధి అందరిముందూ తనని అవమానించిన రాత్రి కాంతారావు తన గదిలోకి వెళ్ళి మంచంమీద పడుకుని భార్య తనని ఎత్తిపొడుస్తుందేమోనని, ఘర్షణ పడుతుందేమోనని ఎంతగానో ఉవ్విళ్ళూరాడు. కానీ అతని ఆశ ఫలించలేదు. మరునాడు ఆఫీసులో సుజాతకి ఇంటర్వెల్‌లో మాటల సందర్భంలో ఇంటిలో జరిగిన గొడవ చెప్పాడు.

"అయితే నన్ను మర్చిపోతారన్న మాట"

"అంత తేలికకాదు"

"ఏం చేస్తారేమిటి? మీ భార్య గొడవ చేస్తుంది. తను కావాలో నేను కావాలో తేల్చుకోమంటుంది"

"అడగనీ చెప్తాను" కాంతారావు నవ్వేశాడు.

"తెగిన గాలిపటంత అందరూ ఆడుకుంటారు. కానీ..."

"సుజాతా, అవేం మాటలు. నీ కోసం నేను ఉన్నాను తెలుసా"

"ఎంతయినా నేను భార్యని కాలేనుగా"

"అన్నీ కలిసొస్తే అవచ్చు"

మిమ్మల్ని నమ్మేదెవరు. నేను భార్యనయిన తర్వాత మళ్ళీ నేను వెగటవుతానేమో! ఎవరికి తెలుసు"

"అలా ఎప్పుడూ కాదు. నువ్వు ముందు ప్రేయసివి. అందుకే భార్యవయినా మనమధ్య గొడవలు రావు"

"ఏమోనండీ నాకు భయంగా ఉంది. నా జీవితం, నా అనుభవాలు..."

కాంతారావు వారించాడు సుజాతని... అతనికి సుజాత గురించి తెలుసు. సుజాతకి పెళ్ళి అయింది. కానీ భర్తనుంచి విడాకులు తీసుకుంది. ఆ విడాకులు తీసుకోవడం వెనక చాలా ఘర్షణలు, కొట్లాటలు ఉన్నాయి.

సుజాత భర్త అనుమానం మనిషి. కాపురం పెట్టిన మర్నాటి నుంచీ ఆమెను అనుమానిస్తూనే ఉండేవాడు. సాయంత్రం తనకోసం వీధిలో నుంచుంటే అతను ఆ నిరీక్షణని వేరే అర్థం చేసుకునేవాడు. సుజాత అందంగా అలంకరించుకుంటే, ఆకర్షణీయంగా తయారయితే అతనికి గంగవెర్రులెత్తేవి.

సుజాత పెళ్ళి కాకముందు ఎవర్నో ప్రేమించిందని అతని అనుమానం.

"నువ్వు పెళ్ళి కాకముందు మరెవర్నీ పెళ్ళాడాలని అనుకోలేదా"

"బావుంది. మా నాన్న తెచ్చిన సంబంధం నచ్చనప్పుడు ఫలానా ఎక్కోవైయ్యో అయితే బావుండునని ఆశపడేదాన్ని"

"అంతేగాని ఫలానా అని..."

"ఏం లేదు"

అయినా సుజాత మాటలు అతను నమ్మేవాడు కాదు. భర్త చాటున భార్యలు పిచ్చి కలలు కంటారనీ భర్త ఆఫీసుకు వెళ్ళిన తర్వాత చిన్ననాటి స్నేహితులతో కాలక్షేపం చేస్తారనీ అతని అపోహ.

అతనికి భార్యని ఎందుకో అందుకు తప్పు పట్టి శిక్షించాలని ఉండేది. అందుకే అతనికి తెలియకుండానే సుజాత మీద జెలసీ పెరిగింది. చాలా రాత్రుళ్ళు దెబ్బలాటలతో, కొట్లాటలతో గడిచేవి.

ఓ రోజు సుజాత ఊరినుంచి ఎవరో ఒకతను వచ్చాడు...పుట్టింటి కబుర్లు అతని ద్వారా వింటోంది సుజాత.అప్పుడే భర్త వచ్చాడు.

అంతే! అతనిలో భార్యపట్ల విముఖత పెరిగింది. నెలరోజుల్లో ఇద్దరి మధ్య అఘాతం పెరిగింది. సుజాత భర్తతో విసిగి పుట్టింటికి వచ్చేసింది. ఆ తర్వాత ఉద్యోగం వెదుక్కోవడం, తన కాళ్ళమీద తను బ్రతకడం మొదలయింది. అందుకే సుజాతకి మగవాళ్ళ మీద అసహ్యం. పెళ్ళి అయిన వాళ్ళూ, కానివాళ్ళూ కూడా తన వెనక తన జీవితాన్ని ఆరా తీసి, కూపీలు లాగుతున్నారని తెలుసు.

ఒక్కొక్కసారి ఆమెకు బ్రతుకు మీద విసుగు పుడ్తుంది. మరోసారి వెర్రి అభిమానం కలుగుతుంది. మగవాళ్ళని వెర్రి వాళ్ళను చేసి ఆడించాలని వుంటుంది. అంతలో తోడు లేని తన జీవితం చూసి భయంవేసి ఆధారంకోసం వెదుక్కోవాలని ఆరాటం కల్గుతుంది.

కాంతారావు పరిచయంతో ఆమె తన జీవితం మలుపు తిరుగుతుందని ఆశ పడలేదు. కాంతారావు కూడా తనలాగే జీవితంలో ఏదోపోగొట్టుకున్న మనిషని ఆమెకి అర్థమయింది. అలాంటి మనిషి తనకి సానుభూతి అందించగలడని ఆమెకి అన్పించింది. అందుకే తనకి తెలియకుండానే అతనికి దగ్గరయ్యింది.

అయితే కాంతారావు వివాహితుడనీ, అతను శాశ్వతంగా తనవాడు కాలేడనీ ఆమెకు తెలుసు. అలాంటప్పుడు మరో రకంగా ఆలోచించేది. కాంతారావు ద్వారా మగవాళ్ళ మీద తను కక్ష తీర్చుకుంటున్నానని ఆమెకు అన్పిస్తూ ఉంటుంది. భార్యగా స్త్రీని హర్షించలేని మగాడు, ప్రేయసిగా ఎటువంటి ఆడదానికయినా బానిసవుతాడు. అది ఆమెకు గర్వ కారణం. ఈ విధంగా తన మాజీ భర్తని సవాల్ చేస్తున్నానని ఆమెకు గర్వం. అయితే అరుంధతికి ద్రోహం చేస్తున్నాననీ సుజాతకి తెలుసు. అరుంధతి ఏదో ఒకరోజు భర్తతో ఢీకొని అతనికి ఎదురు తిరగాలనీ ఆమె కలలు కంటూ ఉండేది. అంతేగానీ— ఆమె సాటి ఆడదాని బ్రతుకు ముక్కలవుతుందని సానుభూతి పరంగా ఆలోచించ లేదు. అది ఆమె జీవితం నేర్పని పాఠం. అనుభవంగాని విషయం. తన సంతోషం నలుగురికీ పంచడు మనిషి. కానీ తన దుఃఖం, అవమానం నలుగురికీ కలగాలని ఆశిస్తూ ఉంటాడు. వారం తర్వాత ఓ రోజు సుజాత కాంతారావుతో అంది.

"మీ భార్యని చూశానండోయ్" అని.

కాంతారావు మాట్లాడలేదు.

"ఎక్కడని అడగరేం?"

"నువ్వు చెప్తున్నావుగా"

"నాటకాలు వేస్తుందే, శాంతి అని. ఆ అమ్మాయితో వెడుతోంది"

"ఎవరూ?" అన్నాడు కాంతారావు

ఉలిక్కిపడి.

"శాంతి అండీ... మీ తమ్ముడు సారధి స్నేహితురాలు"

"ఆ అమ్మాయి నీకు తెలుసా..."

"నాటకాల్లో చూడ్డమే"

కాంతారావు మాట్లాడలేదు. అతని ఆలోచనలు భార్య మీదకు వెళ్ళాయి. భార్య శాంతితో వెళ్ళడం...రకరకాల వంకరలు తిప్పి ఆలోచించాడు – భార్యకి ఆ నాటకాలమ్మాయితో పనేమిటా అని. సాయంత్రం ఇంటికి రాగానే అరుంధతితో భేటీ వేసుకున్నాడు–

"దానింటికి వెళ్ళావటగా" అని.

"ఎవరింటి కండీ..."

"అదే శాంతి"

అరుంధతికి ఏమనాలో తెలియలేదు.

"ఓహో తోటి కోడలనాలా ?"

"ఏమీ అనద్దు ... ఊరుకోండి" అంది నెమ్మదిగా.

"ఎందుకూరుకోవాలి నేను. అసలు దానింటికి ఎందుకు వెళ్ళినట్టు...దానిలా నువ్వూ నాటకాలు వేద్దామనా?"

"నేను నాటకాలు ఒకటే ఆడాలి ఇక...అదీ, అదీ అంటూ ఆ మాటలేమి టండీ ... ఆ అమ్మాయి కూడా గౌరవంగా బతుకుతోంది"

"చాలా గౌరవంగా బతుకుతోంది. దానికి నువ్వే ఇవ్వాలి సర్టిఫికెట్"

"నిజం తెలిస్తే సర్టిఫికెట్ కాదు ... మనం తలలు వంచుకోవాలండీ, ముందు"

"అబ్బో ఏమిటో..."

"ఎందుకు లెండి" అరుంధతి బయటకు పోబోయింది.

"నాకు సమాధానం చెప్పి వెళ్ళు. ఏమిటా అహంకారం ...". అరుంధతి తిరిగి వచ్చి భర్త ముహంలోకి చూసింది.

"ఏం. అలా చూస్తున్నావ్. కళ్ళల్లో నిప్పులు కురిపిస్తావా"

"చేతకాదు మరి..."

కాంతారావు వెక్కిరింపుగా నవ్వేశాడు.

"నన్ను వెళ్ళనివ్వండి బయటకు"

"సరియైన సమాధానం రాకపోతే బయటకే పోవల్సి వుంటుంది"

"సరియైన సమాధానం అంటే?"

"దానికీ, నీకు ఏమిటి సంబంధం?"

"అక్కడ మన మాలతి వుంది. పెళ్ళి అయిన తర్వాత చూడలేదుకదా వెళ్ళాను. సరేనా..."

"మాలతి శాంతి ఇంట్లో వుందా!"

"పెళ్ళి అయినప్పటి నుంచీ అక్కడే వుంటోందిట!ఆఅమ్మాయి భర్త ప్రసాద్‌కి మద్రాసు ట్రాన్స్‌ఫర్ అయిందిట. వాళ్ళు రెండు రోజుల్లో ఇక్కడి నుంచి వెళ్ళిపోతున్నారు. అందుకని వెళ్ళాను.."

"ఇవన్నీ ఎలా తెలిశాయి నీకు? సారథి చెప్పాడు కదూ"

"అవును"

"అంటే అంతా నీ ఇష్టమే అన్న మాట. నువ్వు స్వయం నిర్ణయాలు తీసుకుంటావు. నీ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తావు. అవునా..."

"భోజనాలు అయ్యాక తీరిగ్గా దెబ్బలాడుకుందాం ,నేను వెడుతున్నాను"

"ఆగు ముందు! నువ్వు చేసిన పని సిగ్గుమాలిన వాళ్ళు చేస్తారు. భర్తగాడంటే లెఖ్ఖలేని ఆడది చేస్తుంది. నిన్ను ... నిన్ను..."

"కొడతారా"

"చంపి పాతర వేస్తాను"

అరుంధతి భర్తని అసహ్యంగా చూసింది.

"చంపడం అంత తేలిక కాదండీ ... మాటలతో చంపడం వరకే మీకున్న హద్దు. ఆ హద్దు కూడా మీరు చాలా సార్లు దాటారు. చెపుతున్నాను వినండి! మీ చెల్లాయి మీద మీకు ప్రేమ లేదు కదా అని ఎవరికీ వుండదనుకోకండి. మీరు మాలతిని అసహ్యించుకుంటున్నారు కదా అని ఇంట్లో వాళ్ళందర్నీ అసహ్యించుకోమంటారా! అత్తగారు మాలతి మీద బెంగపడి సారథితో కలసి నన్ను మాలతి దగ్గరకు వెళ్ళమన్నారు. ఒక్కసారి ఇంటికిరమ్మనమని చెప్పమన్నారు."

"ఈ విషయం ఎవరికీ తెలియ కూడదనుకున్నాం గానీ ఇందులో మీకు చేసే ద్రోహం ఏముందో నా కర్థం కావడం లేదు"

అయినా కాంతారావుకుకోపం పోలేదు.

"నన్ను అడగఖ్ఖరలేదా ? నీ ఇష్టం వచ్చినట్టు ఉండేటట్టయితే నీకూ నాకూ సంబంధం ఉండదు నీ దారి నువ్వు చూసుకోవచ్చు"

అరుంధతి మాట్లాడలేదు.

"మళ్ళీ మళ్ళీ ఇలా చేయనని ప్రమాణం చెయ్యి".

"ఈ విషయంలో మామగారు కనక అత్తయ్యని ఇలా అడిగితే నేనూ-వచ్చి మీ కాళ్ళ మీద పడతాను. రేపటి వరకూ ఆగండి. మీ నాన్నగారు ఏం చేస్తారో చూద్దాం."

"నోర్మూయ్" అరుంధతి చెంప మీద కొట్టాడు కాంతారావు.

అరుంధతి తలవంచుకుని చెంప రాసుకుంటోంది.

"చంపేస్తాను ఎదుపు తిరిగితే, జాగ్రత్త." అరుంధతి క్రోధంగా కాంతారావుని చూసింది.




వీధి తలుపు దగ్గరగా వేసి వుండడం చూసి మాలతి సారధి మొహం చూసింది... గుమ్మం దగ్గరే ఆగిపోయిన చెల్లెల్నీ, ప్రసాద్‌నీ చూసేసరికి సారధికి ఆశ్చర్యం వేసింది.

"మనింట్లోకి వెళ్ళడానికి జంకుతున్నావేమిటే! పద లోపలికి..."

"గొడవ అవుతుందేమో" మాలతి అంది.

"మీరు అనుకున్నట్టు జరుగుతుందా?" ప్రసాద్ అనుమానంగా అన్నాడు.

"చెప్పి వెళ్ళడం మన ధర్మం. మనం అంటే ఇష్టపడని వాళ్ళు ఒక్కళ్ళే లేరుగా ఈ యింట్లో! మీరు వస్తారనీ, ఒకసారి చూడాలనీ అమ్మ ఎంతో ఇదిగా బాధపడుతోంది..." అని తలుపు మీద కొట్టి, "సుబ్బరామయ్యగారు ఇంట్లో లేరాండీ" అంటూ రెండు సార్లు పిలిచాడు.

ఒక నిమిషంలో తలుపులు తెరుచుకుని సుబ్బరామయ్యగారు గుమ్మంలో నించున్నారు. ఆయన గడప అవతల వున్న కూతుర్ని-కూతురుతో వచ్చిన అల్లుణ్ణీ, సారధినీ చూసి నిశ్చేష్టుడయ్యాడు.

"నాన్నా! నేను..." మాలతి అంది.

"అమ్మనీ, నిన్నూ చూడ్డానికి వచ్చారు వీళ్ళు." సుబ్బరామయ్యగారు ఏదో అనాలని ప్రయత్నించాడు కానీ లోపలి నుంచి లక్ష్మమ్మ "ఎవరండీ వచ్చిందీ" అంటూ వీధి గుమ్మం దగ్గరకు వచ్చి కూతుర్ని, ప్రసాద్‌నిచూసి మొదట సంతోషంతో, వెంటనే సంశయంతో ఆపైన మనసులో రేగిన బాధతో "నువ్వా?" అనేసింది,

వెంటనే సుబ్బరామయ్యగారు వెనక్కి తిరిగి లోపలికి వెళ్ళిపోయారు. భర్త మాట్లాడకుండా వెళ్ళడం చూసి నెమ్మదిగా "లోపలికి రండి, రా నాయనా" అంది.

"నాన్నకి మేంరావడం ఇష్టంలేదమ్మా!" అని భర్తని చూసి "వెళ్ళిపోదామండీ" అంది.

"నీ ఇష్టం." అన్నాడు ప్రసాద్.

"అదేమిటే ఇంటి ఆడబడుచువి, అలా వెళ్ళకూడదు. పద లోపలికి" అన్నాడు సారధి.

"రా అమ్మా" అంది లక్ష్మమ్మ. వాకిట్లోకి వచ్చిన మాలతి భర్తకి సోఫా చూపించి కూర్చోమని - మరో కుర్చీలో తల్లిని కూర్చోపెట్టి పక్కనున్న కుర్చీలో తను కూర్చుంది. సారధి ప్రసాద్‌పక్కన సోఫాలో చతికిల పడ్డాడు.

"అమ్మా ఏమీఅనుకోకమ్మా..నువ్వూ, నాన్నా బాధపడితే మేం సంతోషంగా ఉండలేం. చెప్పమ్మా.. నా మీద ఇంకా కోపంగా వుందా.." లక్ష్మమ్మగారు

జవాబు చెప్పలేదు.

"అమ్మా! అది బాధపడుతుంది, మాట్లాడమ్మా" అన్నాడు సారథి.

"ఏం లేదే! కోపం ఏం లేదు" ఆవిడకు ఏడుపు ఆగలేదు.

"ఆయనేనమ్మ మా వారు"

ప్రసాద్ నమస్కారం చేశాడు.

"దానికేం తెలియదు. ఒట్టి అల్లరి పిల్ల. దాన్ని సంతోషపెట్టు నాయనా. ఇక అన్నీ నువ్వే" అనేసింది. ఆపైన ఆలోచనగా లోపలకు చూసి, "అరుంధతీ అరుంధతీ" అని కేకేసింది..

వంటింటోంచి వచ్చిన అరుంధతి మాలతిని చూసి సంతోషం ఆపుకోలేక "మాలతీ" అనేసింది. మాలతి లేచి అరుంధతి దగ్గరకు వెళ్ళి "వదినా" అంది అంతే.

అరుంధతి వెంటనే "ఏమిటమ్మా ఇలా వచ్చావ్? ఇల్లు మర్చిపోయావను కున్నాం."

"దానికి కారణం నేను కాదు.. మీ తమ్ముడు" మాలతి నవ్వేసింది.

"నమస్కారమండీ" అన్నాడు ప్రసాద్.

"నమస్తే"

"వదినా మేం ఈ రాత్రికి మద్రాసు వెడుతున్నాం. మిమ్మల్ని చూసి వెడదా మని వచ్చాం."

"నాన్నగారికి కన్పించావా"

"నాన్న మమ్మల్ని చూసి మాట్లాడ కుండా వెళ్ళిపోయారు" మాలతి బాధగా అంది.

"ఫరవాలేదమ్మా! చెప్పి వెళ్ళు"

మాలతి తండ్రి గది దగ్గరకి వెళ్ళి కాసేపు తటపటాయించి తలుపు తీసుకుని లోపలికి వెళ్ళింది. తండ్రి వీపు కన్పి స్తోంది. కుర్చీలో కూర్చుని వున్నాడు.

వెనక వెళ్ళి "నాన్నా" అని పిల్చింది.

సుబ్బరామయ్యగారు మాట్లాడలేదు.

"నన్ను క్షమించండి నాన్నా! మీకు కోపం తెప్పించే పని చేశాను. నిజమే..."

సుబ్బరామయ్యగారు మళ్ళీ మాట్లాడ లేదు.

"మేం సాయంత్రం ట్రయిన్‌లో మద్రాసు వెడుతున్నాం నాన్నా! మళ్ళీ ఈ ఊరు రావాలంటే మీరు ఏదో ఒకటి మాట్లాడితేనే! మీరు 'వద్దూ' అంటే మానేస్తాను. కనీసం అమ్మ చేతనయినా మీరు ఉత్తరం రాయిస్తూ వుండండి. మీరు జాగ్రత్తగా మందులు తీసుకోండి. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి..."

సుబ్బరామయ్యకి మాలతి కనపడ్డం లేదు. ఇరవై ఏళ్ళు పెంచిన కూతురు నెల క్రితం గుండెల మీద నుంచి నడిచి వెళ్ళడం ఒకవైపు గుర్తుకు వస్తోంది... తనకి కూతురుగా కాకుండా తల్లిలా అన్ని అవసరాలూ చూసే మాలతి దూరం అవబోతున్న వార్త ఘాతంలా తగుల్తోంది.

మమత, పట్టులద మనసులో కుస్తీ పట్లు పడుతున్నాయి. రక్తం రక్తపాశం వలలో గిల గిల తన్నుకుంటోంది. వయసు అనుభూతి తెచ్చే ఆటుపోటు మధ్య విలవిల్లాడుతోంది. దూరం అవు తున్న మాలతి అడుగుల చప్పుడు విన్పి స్తోంది.

"ఆరోగ్యం జాగ్రత్త. వెళ్ళగానే ఉత్తరం రాయి" అన్నాడు వెనక్కి తిరక్కుండానే.

తలుపు పట్టుకుని వెడుతూన్న మాలతికి కన్నీళ్లు ఆగలేదు.

"అలానే నాన్నా" అనేసి వాకిట్లోకి వెళ్ళి భర్తని చూసి, "లోపల నాన్న ఉన్నారు. మీరుకూడా చెప్పిరండి" అంది.

ప్రసాద్ మామగారి గదిలోకి వెళ్ళాడు.

మాలతి అరుంధతి పక్కన కూర్చుని "అన్నయ్యతో చెప్పు వదినా! అన్నయ్యకి నా మీద చాలా కోపంగా ఉండి వుంటుంది"

"చెప్తానులే"

మాలతి నెమ్మదిగా అడిగింది "అన్నయ్య నీతో ఎలా వుంటున్నాడు?"

"బాగానే ఉంటున్నారు"

"వదినా! సారథి అన్నయ్య చెప్తున్నాడు- మా ఇంట్లో నీకు సంతోషం లేదు. వాడు మారితే బాగుండును."

అరుంధతి చిన్నగా నవ్వింది.

ప్రసాద్ మామగారి గదిలోంచి బయటకు వచ్చాడు. సారథి చేతి వాచీ చూసుకుని "మనం బయలుదేరాలి. టైం లేదు." అన్నాడు మాలతిలేచి "వస్తాంఅమ్మా" అంది. అరుంధతి లోపలి నుంచి ఓ పేకెట్ తెచ్చి అత్తగారి చేతిలో పెట్టి, "మాలతికి ఇవ్వండి అత్తయ్యా. ఆడపిల్ల ఇంట్లోంచి వెడుతూంటే సారె ఇవ్వాలంటారు. ఇదే మినీ సారె." లక్ష్మమ్మగారు మాలతికీ, అరుంధతికీ బొట్టు పెట్టి, తను బొట్టుపెట్టుకుని చేతిలో పార్సెలు కూతురి చేతిలో పెట్టింది.

గుమ్మాలు దాటిమొదట సారథీ వెనక ప్రసాద్, ప్రసాద్ పక్కన మాలతీ మెట్లు దిగారు. మాలతి వెనక్కి తిరిగి చూసింది. గుమ్మంలో తల్లీ, తల్లి పక్కన తండ్రీ, తల్లి వెనక నుంచున్న అరుంధతీ కన్పించారు. చేయి ఊపుతూ కాసేపు నుంచుని తిరిగి బయలుదేరింది.

వాళ్ళు స్టేషన్‌కి వెళ్ళేసరికి స్టేషన్ దగ్గర శాంతి ఎదురు వచ్చింది.

"శాంతీ! నువ్వుకూడా వచ్చివుంటే బావుండేది మా ఇంటికి."

శాంతి నవ్వేసింది.

"భయపడింది. మీ ఆడవాళ్ళు భయం చుట్టుకుని మరీ పుట్టారు. మళ్ళీ మమ్మల్ని అంటారు పైగా." సారథి అన్నాడు.

"ఇది భయంకాదు. ముందుచూపు."

"శాంతీ!నువ్వూ, అన్నయ్యా మద్రాసు రావాలి. మర్చిపోవద్దు."

"అలానే"

"అన్నయ్యా! శాంతిని మనింటికి తీసుకువెడతావా?" నెమ్మదిగా అడిగింది.

"ఏం వద్దంటావా?"

"నా మూలంగా ఇప్పటికే అమ్మా నాన్నా బాధ పడుతున్నారు. ఈ విషయం తెలిస్తే.."

"ఇప్పుడే చెప్పనులే—"

ఇంతలో మద్రాసు ఎక్స్‌ప్రెస్ వచ్చింది. కంపార్ట్‌మెంట్ దగ్గరే నలుగురూ నుంచుని మాట్లాడు కుంటున్నారు.

ఇంతలో దూరం నుంచి వస్తోన్న అన్నగారు కాంతారావుని సారథి చూశాడు పక్కనే సుజాత వుంది. కాంతారావు సారథిని చూసి సుజాతని వదిలి ఎవరో స్నేహితుణ్ని పలకరించి సుజాతతో ఏదో చెప్పి దూరంగా వెళ్ళిపోయాడు.

సారథి, సుజాతని శాంతికి చూపించి "ఆ వెడుతున్న అమ్మాయి ఎవరో తెలుసా?"

"అమ్మాయే!"

"మా అన్నయ్య స్నేహితురాలు. భార్యని మించిన ప్రేయసి"

ట్రయిన్ బయలు దేరబోతున్నట్లు మైకులో ప్రకటన వినబడింది. జనంలో కలకలం... వగం ఎక్కువయ్యాయి.

మాలతి, ప్రసాద్ కంపార్ట్‌మెంట్ లోపలికి వెళ్ళారు. ఓ రెండు నిమిషాలు ప్లాట్ ఫారం నవ్వులతో, వీడ్కోళ్ళతో ఊగి పోయింది. రైలు ఆకుపచ్చ లైట్లని వెక్కిరిస్తూ సాగిపోయింది. సారథీ, శాంతీ స్టేషన్ బయటకువచ్చారు.

ఇద్దరూ నడవడం మొదలు పెట్టారు.

"ఏమిటీ ఆలోచిస్తున్నారు?"

"ఏం లేదు"

"మీ చెల్లాయి గురించా?"

"కాదు"

"ఇంటి గురించా?"

"ఊహూ..."

"మీ అన్నయ్యగారి గురించా?"

"కాదు శాంతీ! వదిన గురించి."

శాంతి మాట్లాడ లేదు.

"మా అన్నయ్య ఇంట్లో భార్య పట్ల భర్తగా ప్రవర్తించడు. డిక్టేటర్ మాదిరి వుంటాడు. ఆవిడ ఏమనడానికి లేదు. చూశావుగా! ఆఫీసులో కొలీగ్‌తో తిరుగు తాడు. నాన్న అడగడు. అమ్మ అడిగితే బుకాయిస్తాడు."

"మీరు అడగలేదా"

నేను ఎదిరిస్తానని వాడికి కోపం. వదినకి నేను వీధిలో విషయాలు చెబుతానని బాధ. పెళ్ళాం ముందు తను అవమానం పాలవుతున్నానని ఉక్రోషం. ఇలాంటి భర్తల్ని భార్యలు మనసులో ఎన్ని శాపాలు పెడతారని! సంఘం కోసం భార్య కావాలి. సంతోషం కోసం వీధిలో ఆడది కావాలి"

"పోనీ మీ వదినా వాళ్ళ వాళ్ళు వచ్చి నచ్చజెబితే"

"ఆడపిల్ల నిచ్చుకున్న వాళ్ళు ఏం చెయ్యగలరు. మీ అమ్మాయిని తీసుకు పొండి అంటాడు. ఆ తెగింపు పని వాళ్ళు గానీ, వదినగానీ చెయ్యరని వాడి నమ్మకం"

"ఆవిడ ఏమంటారు?"

"వదినకి ఓర్పు ఎక్కువ. అలాంటి వాళ్ళు చాలా తక్కువ మంది ఉంటారు ఈ రోజుల్లో. వదిన వుంటే ఈపాటికినేను విడాకులు తీసుకోమని సలహా యిచ్చేవాణ్ణి తెలుసా"

"కబుర్లు చెప్పడానికేం లెండి"

"నిజం శాంతీ! వదినకి సుఖం లేదు. వాళ్ళమధ్య భార్యాభర్తల సంబంధం తప్పించి అనురాగం లేదు. కానీ మగవాడు కాబట్టి అన్నయ్య సుఖపడుతున్నాడు. ఆడది కాబట్టి వదిన దుఃఖాన్ని మూట గట్టుకుంటోంది. ఇదంతా మన వివాహ వ్యవస్థ లోపం. ఏ పరిచయం, స్నేహం లేకుండా 'ఊరిలో ఉప్పురాయి, అడవిలో చెట్టుకాయ' అన్నట్టు ఇద్దర్ని కలిపి ముడి వేస్తారు. పసుపుతాడు, మంగళసూత్రాలు, మంత్రాలు, మంగళ వాయిద్యాలూ ఏవీ కూడా ప్రేమని ఇవ్వలేవు! పెళ్ళి అంటే ఏదో బంధం, అదితెంచుకోవడంపాపంఅనే దురభిప్రాయం మనలో పాతుకుపోయింది.

శాంతి నవ్వేసింది. ఆపైన అంది-

"పెళ్ళి అనే వ్యవస్థ మీద నమ్మకం లేదంటూనే మరి ఆ సుజాతనీ, సుజాతని ప్రేమించిన మీ అన్నయ్యనీ ఎలా తప్పు పడుతున్నారు?"

"వాళ్ళని నేను తప్పు పట్టడం లేదు. అన్నయ్య వదిన్నుంచి విడాకులు కోరి ఆమె జీవితానికో దారి చూపించి తను సుజాతతో సుఖపడమను"

"మీ ఇష్టం వచ్చినట్టు ఆయనెందుకు చెయ్యాలి. ఇది సంఘానికి ఎదురు తిరగడం అవుతుంది. ఆయనకా చెడ్డపేరు. ఈ పెద్దమనిషి ముసుగులో ఆయన సుఖ పడుతున్నారుగా. ఈ అవస్థలన్నీ ఆయనెందుకు పడాలి" సంశయంగా అడిగింది శాంతి.

"మంచను, చెడను ఎవరైనా బాహాటంగా చెయ్యాలి.మన ప్రవర్తన సమర్థించుకునే కన్నా మన ప్రవర్తన నలుగురికీ కాకపోయినా ఒక మనిషికైనా ఆదర్శంగా వుండేటట్టు నడుచుకోవాలి. శతాబ్దాల తరబడి వస్తూన్న ఆచారాలు, అలవాట్లు గాడి తప్పాయి. అవి మనుషుల్ని ఏ విధం గానూ సుఖపెట్టలేవని తెలిసినప్పుడు వాటిని త్యజించాలి. భార్యలు భర్తచాటునా, భర్తలు భార్య చాటునా వ్యభిచారం చేస్తూ పవిత్రులుగా బురఖాలు వేసుకుని ముందు రాబోయే తరాల్ని వంచించేకన్నా వివాహ వ్యవస్థని మోడరేట్ చేసుకోవడం లేక పునర్వ్యవస్థీకరించడం న్యాయమంటాను! నీకు తెలియదేమో శాంతీ! మన దేశంలో అను, ఏ దేశంలో అను-వివాహ వ్యవస్థ, వ్యభిచారం రెండూ ఒకటినొకటి అనుకుని వుంటాయి. వివాహ వ్యవస్థ పోతేనే వ్యభిచారం పోతుంది. అప్పుడే దొంగచాటు వ్యవహారాలు, ఆత్మద్రోహాలు, వంచనలూ తగ్గుతాయి."

శాంతి అర్థంకానట్టు తలూపి-

"ఏమో బాబూ మీరనుకున్నది సాధ్యమని నేననుకోను."

"ఎందుకు కాదు. కింద తరగతి వాళ్ళలో చూడు. పై కులాల వాళ్ళల్లోలా

వాళ్ళకి వ్యవస్థమీద సమ్మకం తక్కువ. మగవాడు ఆడదాన్ని, ఆడది మగవాణ్ణి వంచించడం తక్కువ. ఈజీగా విడిపోవడం, ఈజీగా కల్సుకోవడం చేస్తారు. పుస్తెకట్టిన మొగుడిని వదిలి మరో మొగాణ్ణి చాలా నేచురల్‌గా యడ్మిట్ చేస్తుంది. మగవాడూ అంతే. వాడికీ పసువూ ప్రతిష్టల గొడవలేదు. ప్రేమే ముఖ్యం. అది తనలో వెలుగుతూన్నంత కాలం ప్రేమికుడిలా జీవిస్తూనేవుంటాడు"

శాంతి మాట్లాడలేదు.

ఇద్దరూ టాంక్‌బండ్ వరకూ వచ్చారు.

"శాంతీ! నేను వెళతాను. ఇప్పటికే నీకు ఆలస్యం అయింది"

"సరే"

"సరే కాదు. నే చెప్పింది ఏం ఆలోచించావ్?"

"ఏ విషయం"

"నా విషయాలన్నీ నీకు తెలుసు. అలాగే నీ విషయాలూ నాకు తెలుసు. చెప్పు నాతో కలిసి వుండడానికి నీకు ఇష్టమేనా అని?"

"నాకేం చెప్పాలో తెలియడం లేదు. మీకు ఆవేశం ఎక్కువ. నా జీవితం, నా పరిస్థితులూ మీకు తెలుసు. నాటకాలు వేసుకునే అమ్మాయితో కలిసి జీవిస్తానంటే మీవాళ్ళు ఏమంటారు? ఇప్పటికే మీ చెల్లెలు మూలంగా వాళ్ళు బాధపడుతున్నారు. నేను మీ బతుకులోకి వచ్చి వాళ్ళని మరింత.."

"అవన్నీ ఆలోచించకు. నాతో నీకూ పరిచయం వుంది. మనం సుఖపడగలమని నా నమ్మకం. ఒకళ్ళ కోసం మన బతుకులు దూరం కాకూడదు"

"నా గత జీవితం.."

సారథి శాంతి నోరు మూశాడు.

"మనిషి ప్రేమానురాగాల్ని ఒకళ్ళకి పంచినంత మాత్రాన తరిగిపోవు. మోసపడ్డ ఆడది బతుకులో వెనకపడ్డం అంటే నేను ఇష్టపడను. మనలో ప్రేమించే గుణం వున్నంతవరకూ, ఒకళ్ళంటే ఒకళ్ళకి ఇష్టం వున్నంతవరకూ ఎవళ్ళి మనం దగా చేసుకోవడం జరగదు."

శాంతి మాట్లాడలేదు.

"నీకు పెళ్ళి అనే తంతుమీద నమ్మకం పోలేదా"

"ఈ దేశంలో పుట్టిన ఆడపిల్లని"

"నువ్వనుకున్నట్టు అగ్నిసాక్షిగా చేసుకున్న పెళ్ళే పెళ్ళవుతుందా? ఎలా అవుతుంది? దీనికి సాక్ష్యం ఏమిటి? మనస్సే కదా మొదటి సాక్షి, ఆ తర్వాత పిల్లలు...అంతే కదా?" నవ్వేశాడు తిరిగి అన్నాడు—

"శాంతీ! నువ్వంటే నాకు ఇష్టం. నిన్నెనాడూ నేను మోసం చెయ్యను. అలాగే నువ్వూనూ! నేనంటే నీ కిష్టంలేని రోజున నీ ఇష్టం. నా నుంచి విడిపోవచ్చు. దీని కోసం మనం కోర్టుల పర్మిషన్ అడగవల్సిన అవసరం లేదు. మన కాపురానికి ఆధారం ప్రేమ. అది పోయినప్పుడు ఈ తతంగంతో నీకు గానీ, నాకు గానీ లాభం ఏమిటి? నిష్కల్మషమైన ప్రేమ, ఒకరి పట్ల ఒకరికి ఇష్టం. యివి చాలు భార్యాభర్తలవడానికి". శాంతి మాట్లాడలేదు.

"ఇన్‌స్పెక్షన్‌కి వెళ్ళి నేను వారంలో తిరిగి హైదరాబాద్ వస్తాను. సరాసరి మీ ఇంటికే వస్తాను. ఆ రోజునే మనం కాపరం పెడదాం. స్నేహితులకి విందు చేద్దాం సరేనా?"

శాంతి మాట్లాడలేదు.

"పిచ్చిదానా బాగా ఆలోచించుకో...

రాత్రంతా! టాటా వెళ్ళొస్తాను" అంటూ సారధి శాంతిని సిటీ బస్ ఎక్కించి వెళ్ళి పోయాడు.

బస్‌లో కూర్చుంది గానీ శాంతి ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి.

సారధి మంచి మనిషి. మాటలకీ, చేతలకీ మధ్య దూరం వుంచడు. పదునైన ఆలోచన, అంతకు మించిన క్రియాశీలం మనిషిలో తొంగి చూస్తాయి.

కానీ ఈ నిర్ణయం ఏమిటి? పెళ్ళిని బాహాటంగా కొట్టి పారేసెయ్యాలంటాడు? సాధ్యమేనా? శాంతి ఆలోచనలు ఎటో పోతున్నాయి.

ఐదేళ్ళ క్రితం పెద్దల ముందు, మంత్రాల రణగొణ ధ్వనిలో, బాజాల మోతల్లో తన పెళ్ళి జరిగింది...ఎన్ని బాసలు! మరెన్ని ప్రమాణాలు. మంగళ సూత్రం కట్టిన జగన్ తన చేతుల్తో దాన్ని తెంపి పారేసిననాడు ఏ దేవతలూ అడ్డు పడలేదు. ఏ మంత్రాలూ జగన్‌ని శపించలేదు! కాపురం చేసినందుకు, శరీరం అంకితం చేసినందుకు తనకి జగన్ మిగిల్చింది కన్నీళ్ళు. తాళికట్టిన భర్త కాదన్ననాడు తను అనాధ అయ్యింది తప్ప ఆర్తనాదం వినే వాళ్ళు దొరకలా??

ఇలా ఎందుకు జరిగింది? సమాధానం లేదు. ఎవరికి చెప్పినా ఓదారుస్తారు. పెదవి విరుస్తారు! అంతవరకే—

అయితే తను జీవితంలో ఏం పోగొట్టుకోలేదని చెప్పే సారధిని తనెందుకు నమ్మలేక పోతోంది! ప్రేమిస్తున్నాను, ప్రేమిస్తాను అంటే తనకి కొత్తగా ఎందుకు వుండాలి!!

జీవితంలో ఓ సారి దెబ్బతిన్న మూలంగా మనసులో రేగే సంశయాలు చాలా పెద్దవిగా ఉంటాయి! కానీ సారధిని ఏ విషయంలో అనుమానించగలదు? ముక్కుకు సూటిగా మాట్లాడే అతని నైజంలో తనకి ఇంకా ఏం కన్పించాలి?

'స్త్రీగా నీకు స్వేచ్ఛ వుంటుంది. ఇస్తాను.

ప్రేయసిగా నాతో కాపురం చెయ్యి. పిల్లల్నికను' అనడం తనకి భయంగా, కొత్తగా వుందా??

'తమాషా మనిషి ఆయన' అనుకుంటూ శాంతి సిటీబస్ దిగింది.

భోజనం చేసి మంచం మీద పడుకుంటే సారధి పక్కనే పడుకుని చెవిలో గుసగుసలు చెబుతోన్నట్టు, కొత్త రాగాలు విన్పిస్తోన్నట్టుగా అన్పించింది. సిగ్గుతో పక్కకి తిరిగి పడుకుంది. స్టేషన్ దగ్గర సారధి కొని యిచ్చిన సంపెంగ పూలు తలలో దూరి అల్లరి పెడుతోన్నట్టుగా తోచింది శాంతికి.



లక్ష్మమ్మగారు భర్తకీ, కొడుకులిద్దరికీ అన్నం వడ్డిస్తోంది. సుబ్బరామయ్యగారు అన్నం తినేటప్పుడు ఎక్కువగా మాట్లాడరు. లక్ష్మమ్మ గారే ఆయనకు ఏం కావాలో చూసి వడ్డిస్తుంది. అరుంధతి సాధారణంగా పగలు వంటలోకి గానీ వడ్డనలోకి గానీ రాదు. రాత్రి మాత్రం వంటింటి బాధ్యత తన మీద వేసుకుంటుంది.

"సారధీ ... నువ్వు లేవు మొన్న. రాజమండ్రి నుంచి పెళ్ళి వారు వచ్చారు. అన్నయ్యా, నాన్నగారూ మాట్లాడారు."

"ఏమనీ ?"

"ఏమనేమిట్రా ... పెళ్ళి చూపులకు వస్తామని"

"వద్దు ... నేను పెళ్ళి చేసుకోను. అనవసరంగా ఎవరికీ మాటివ్వద్దు" సారధి అనేశాడు.

"అదేమిటి? పెళ్ళి చేసుకోకుండా ఇలానే వుండి పోతావా?" లక్ష్మమ్మగారు ఆశ్చర్యంగా అడిగింది.

"ఇప్పుడు వాడికేం ఇబ్బంది లేదులే అమ్మా! ఓ నాటకాలు వేసే అమ్మాయి స్నేహం పట్టాడు. పెళ్ళి వద్దనక...సరే, అంటాడేమిటి?" కాంతారావు వ్యంగ్యంగా అన్నాడు.

"ఎవరూ?" అన్నాడు సుబ్బరామయ్య గారు.

"వీడు చాలా పెద్దవాడయ్యాడు నాన్నా! మనమాట వింటాడని నమ్మకం లేదు"

"ఏమిట్రా అది"

"అవును. అన్నయ్య చెప్పింది నిజమే"

"ఆఖరికి దొమ్మరి వేషాలు వేసే వాళ్ళే తప్ప నీకు దొరకలా? చూస్తూ చూస్తూ ఇదేం బుద్ధి. ఇలాంటి వేషాలు వేయద్దు" సుబ్బరామయ్య గారు అన్నారు.

"మంచిది కాదురా–నలుగురూ వింటే ఏమనుకుంటారు. ఇలాంటి పనులు మన ఇళ్ళల్లో ఎరుగుదుమా? అదే వెన్నుపోటు పొడిచిందంటే, ఆఖరికి నువ్వూ ఇలానే చేస్తావా? మాకింత విషంపెట్టి మా పీడ వదిలించుకుని ఆపైన మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి..." లక్ష్మమ్మ గారు గద్గద స్వరంతో అంది.

"వీడు దేశోద్ధారకుడమ్మా! వీడి ఆదర్శాలతో మన కుటుంబ చరిత్ర పుస్తకాల్లోకి ఎక్కడం ఒక్కటే తరవాయి"

"ఆ చరిత్రల్లో నీ కోసం కూడా ఓ ప్రకరణ కేటాయించి వుంచుతారులే! ఒకళ్ళని అనే ముందు వెనక్కి చూసుకోవడం మంచిది. ఈ ఇంటి పరువు పెద్ద మనిషయి వుండి నువ్వు బజారుకు లాగగా లేనిది, నేను పొరపాటు చేస్తున్నానని ఎలా అనగలుగుతున్నావ్?" సారధి ఎదిరింపుగా ప్రశ్నించాడు.

"ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడు. నీ కన్నా వందరెట్లు నయం. ఏ విషయంలోనూ నేను నీలా అమ్మనీ, నాన్ననీ ఎదిరించలా!"

"మన గొప్పలు మనమే చెప్పకోవాలి. పెళ్ళాం ఇంట్లో వుంది... ఆవిడ కర్మకి ఆవిణ్ని వదిలి, ఆఫీసులో అమ్మాయితో నువ్వు సాగించేదాన్ని ఏమనాలి? పైగా పెద్దవాడవయుండి నువ్వు తప్పు దారి పట్టి–నేను చెడిపోతున్నా ననడం..."

"నిన్ను నువ్వు సమర్థించుకుందుకు నన్ను బజారుకు లాగుతున్నావ్. ఆ అమ్మాయి నా సబార్డినేట్. ఎవరూ లేరు కనుక ఆ అమ్మాయి నా సహాయం కోరుతుంది. ఎందుకో తెలుసా? నీ లాంటి ఈవ్ టీజర్స్ నుంచి తప్పించుకుందుకు" అంటూ కాంతారావు తల్లి వైపు చూసి, "వీణ్ని ఆ నాటకాలమ్మాయినీ నేను చాలా సార్లు చూశానమ్మా... మొగుడు పెళ్ళాలు కూడా భయపడతారు, అలా

భుజాలు-రాసుకుంటూ తిరగడానికి మన వాడంత తెగించి ఏడుస్తున్నాడు."

"ఆ అమ్మాయిని నేను ప్రేమిస్తున్నాను. మేం ఇద్దరం..."

"నోర్మూయ్! ఇలాంటి వేషాలు వేస్తే నీకూ, మాకూ సంబంధం పోయినట్టే" సుబ్బరామయ్యగారు అరిచి విస్తరి దగ్గర నుంచి లేచిపోయాడు. వెనకే కాంతారావు కంచంలో చెయ్యి కడుక్కుని లేచాడు.

"సారధీ! తప్పు కాదురా. నాన్నగారి ముందు అలా మాట్లాడచ్చా?"

"అమ్మా! నేనో మాట చెప్తాను. వింటావా?"

"ఆ పిల్ల గురించా?"

"నా గురించి అమ్మా...నాకు మీరేం సంబంధాలు చూడద్దు. అన్నయ్య చెప్పాడు చూడు ఆ అమ్మాయి పేరు శాంతి. మా ఇద్దరికీ స్నేహం. నాకు నచ్చిన ఆ అమ్మాయిని నేను..."

"అవ్వ !"

"నాన్నతో చెప్పు అమ్మా. మళ్ళీ నేను చెప్పలేదనీ, మీకు తెలియకుండా భార్యని ఎన్నుకున్నాననీ అనుకోవద్దు"

"ఏం మాటలురా ఇవి"

"నా ఉద్దేశం చెప్పాను" సారధి కంచం దగ్గర నుంచి లేచాడు.

"మమ్మల్ని ఒకేసారి చంపేసి, మీ ఇష్టం వచ్చినట్టు బరితెగించండి. ఈ ఇంటి కేదో ముసలం పుట్టింది" లక్ష్మమ్మగారు అలాగే వాక్కుంటూ వంటిల్లంతా సర్దుకుని వాకిట్లోకి వచ్చి సారధి గదివైపు చూసింది. గది వరకూ వెళ్ళి తలుపు తోసి చూసింది. సారధి కన్పడలేదు ఆవిడకి. కాంతారావు గది వరకూ వెళ్ళి, "కాంతారావూ" అని పిల్చింది.

"ఏం అమ్మా" అంటూ లోపలి నుంచి వచ్చాడు.

"పీడేదిరా?"

కాంతారావుకు తల్లి భావం అర్థమయ్యింది.

"బయటకు పోయాడేమో"

"వాడు చెప్పేవన్నీ నిజమే నంటావా? వేళాకోళానికి మాట్లాడుతున్నాడా" లక్ష్మమ్మగారి మనసులో సంశయం వుంది. కానీ నిజాన్ని తట్టుకునే సత్తువా, ఓపికా లేవు.

"వాడు చెప్పేవన్నీ నిజమేనమ్మా"

"మరయితే ఎలారా? అది వీడికి ఏ మందో మాకో పెట్టి వుంటుంది. మనం చూస్తూ ఊరుకోవడమేనా? ఒరేయ్.. నువ్వు ఇంటికి పెద్దవాడివి. మాలతి అలా చేసి పోయింది. వీడూ మనకి దక్కకుండా పోతాడేమో, ఆలోచించరా." బాధగా అంది.

"ఒకటే దారి వుందమ్మా! వీణ్ని మనం మార్చలేం. దాన్నే బెదరియ్యాలి."

"అదెంత తెగించిన రకమో. మన మాట వింటుందంటావా?"

"నేను అవన్నీ చూసుకుంటాను. నువ్వెళ్ళు అమ్మా" అని కాంతారావు తల్లిని పంపించేశాడు.

అతను సుజాత ద్వారా శాంతి గత జీవితం గురించి కొంత విన్నాడు. సుజాతది శాంతి వాళ్ళ పక్క ఇల్లే. శాంతి పినతల్లీ, తండ్రీ సుజాతకి బాగా తెలుసు. శాంతికి పెళ్ళి అవడం, జగన్ శాంతిని నానా రకాలుగా హింసించి మెడలో పుస్తెలు తెంచి బయటకు గెంటడం అన్నీ సుజాత పూస గుచ్చినట్టు చెప్పింది.

రెండు రోజుల్లో తను ఎటూ సుజాత తో విజయవాడ వెడుతున్నాడు. అప్పుడే శాంతి పినతల్లినీ, తండ్రినీ కల్సుకోవాలనీ, జగన్‌నీ పట్టుకుని అతనిద్వారా సారధికి శాంతిని కాకుండా చేయాలనీ అతను పథకం వేశాడు.

అలాగే ఆలోచిస్తూ లోపలికి వెళ్ళాడు.

అరుంధతి పుస్తకం చదువుతూ మంచంకోడు నానుకుని కూర్చుని వుంది.

"ఏమిటీ మీ అమ్మగారు అంటున్నారు"

"ఏం లేదు"

"ఏంలేనప్పుడు మాట్లాడతారేమిటి ?" నవ్వుతూ అడిగింది.

"అవన్నీ నీకు తెలియని-అనవసరం విషయాలు"

"పోనీ నాకు అవసరమయిన సంగతులు చెప్పండి"

"హాయిగా నిద్రపో"

"హాయిగా నిద్ర పోవడం ఎలానో అదైనా చెప్పవచ్చుగా" కొంటెగా అంది.

"పీలు చూసుకుని చెప్తాను"

"ఇప్పుడు కూడా మీకు పీలు లేదా"

"లేదు"

"పోనీ ఎప్పుడు వుంటుంది?"

కాంతారావు కోపంగా అరుంధతిని చూసి-

"నువ్వు మాట్లాడకుండా వుంటావా ? నన్ను బయటకు పొమ్మంటావా? చెప్పు"

అరుంధతి కటువుగా అంది.

"నేను ఆగమంటే ఆగుతారా. చెప్పండి"

"నోర్మయ్"

"ముందు నాకు సమాధానం చెప్పండి ఆ తరువాత నోరు మూసుకుంటాను. నాతో ఎందుకు ముభావంగా వుంటారు? నేనంటే ఇష్టం లేనప్పుడు పెళ్ళి ఎందుకు చేసుకున్నారు ? ఈ బలవంతపు కాపురం నాతో ఎందుకు చేస్తున్నారు ?"

"నాకు అవేం తెలియవు"

"మరి మీకు తెలిసిందేమిటి ?"

"నా సుఖం గురించే నాకు తెలుసు"

"అంటే మీ స్వార్థం మీకు ముఖ్యం. అంతేనా ?"

"అవును"

"నా అవసరం మీకు ఏం లేదు అవునా ?"

"అది నే చెప్పవలిసిన అవసరంలేదు. నువ్వు ఏమనుకుంటే అదే !"

"అయితే నేననుకుంటున్నది చెప్తున్నాను. నేను రేపే మా ఇంటికి వెడుతున్నాను. మళ్ళీ మీతో ఏకాంతంగా మాట్లాడే అవకాశం రాకపోవచ్చు. మీకు నేను అవసరం లేదని నేననుకుంటున్నాను. అది మీ ఉద్దేశం కూడా అవచ్చు. నేను మళ్ళీ ఈ గడప తొక్కే అవకాశం రాదనుకుంటాను. అంటే ఇదే మనకు ఆఖరి రాత్రి. బాగా ఆలోచించుకోండి. మీరు నాకు చేసిన ద్రోహం, మోసం ఇంతా అంతా కాదు. అయినా నేను మిమ్మల్ని వెర్రిగా ప్రేమించాను. అందుకే మీ తప్పుల్ని చూసీ చూడనట్టు సహించాను. పెళ్ళీ, ప్రేమా ఒకేచోట కష్టపడితే సాధించవచ్చని నేను నమ్మాను. ఆ రెండు వేరు అని మీ ఉద్దేశం. ఎవరో మనిషిని ప్రేమించి, ఆ మనిషికిచ్చిన గౌరవంలో వందోవంతు నాకూ ఇచ్చినట్టయితే మీ దారికి నేను అడ్డు వచ్చేదాన్ని కాను. కానీ నాకు మీ అవహేళన, అసహ్యం ఇవే ఇచ్చారు. మన మధ్య చాలాదూరం ఉండి పోయింది. నేను ఇంకా ఇక్కడ

వుంటే మనం ఒకళ్ళ నొకళ్ళం కొట్టుకుని చంపుకునే హీన స్థితికి దిగజారుతామేమో! మనలో మనిషి అంశ వున్నప్పుడే మంచి నిర్ణయం తీసుకో గల్గుతాం. అందుకే చెప్తున్నాను. మీరు మీ నాన్నగారికి, అమ్మగారికి ఏ అబద్ధం చెబుతారో నాకు తెలియదు. కానీ నేను మాత్రం ఉన్నది వున్నట్టుగానే చెప్పి మా ఇంటికి పోతాను. పొద్దున మన వాకిట్లో ఓ కొత్త సీను నడుస్తుంది. నాకు జరగబోయే న్యాయా న్యాయాలతో నాకు సంబంధం లేదుకాబట్టి నేను మనమధ్య ఇంత కాలం నడిచిన అన్ని విషయాలు చెప్పబోతున్నాను. అప్పుడు మీరు బాధపడొద్దు. నావైపు కోపంగా చూడద్దు. మీ భార్య కాదు, ఓ ఆడది గుండె రాయి చేసుకుంటే, బ్రతుకులో విసిగి వేసారితే ఎలా మాట్లాడుతుందో వినండి!"

కాంతారావుకు ఏమనాలో తెలియలేదు. అరుంధతి వైపు చూస్తున్నాడు. అలా చాలా సేపు చూశాడు.ఆ తరువాత ఏమనుకున్నాడో లైటార్పి మంచం ఎక్కాడు. అరుంధతి కాంతారావుకి తగలకుండా పడుకుంది. ఓ నిమిషం ఊరుకుని కాంతారావు.

"కోపంలో అన్న నా మాటలన్నీ నిజం అనుకున్నావా" అన్నాడు చిన్నగా.

అరుంధతి మాట్లాడ లేదు.

"నిన్నే" దగ్గరగా జరిగి అరుంధతి మీద చేతులు వేశాడు.

"సారధిగాడి మీద కోపంతో ఏవేవో అన్నాను. నువ్వు నిజంగా రేపు ఏ గొడవ చెయ్యకు. ఇప్పటికే అమ్మా నాన్నా చాలా క్షోభ పడుతున్నారు."

అరుంధతి మళ్ళీ మాట్లాడ లేదు.

"సుజాత నేను వద్దన్నా నాతో తిరుగుతుంది. కట్టుకున్న నీకు నేను ద్రోహం చేస్తానా? మనసు బావుండనప్పుడు నాకు సహజంగా కోపం వస్తుంది. అవన్నీ నువ్వు పట్టించుకోకూడదు. నాకు విడాకులు ఇస్తే నా పరువు ఏమవుతుందో ఆలోచించావా."

కాంతారావు అలా పిచ్చి పట్టినట్టు మాట్లాడుతూనే ఉన్నాడు. అరుంధతి బొమ్మలా వింది చాలా సేపు. భర్త బలవంతంగా శరీరాన్ని ఆక్రమిస్తే భార్యగా, స్త్రీగా కాదనలేక పోయింది కూడా. కాంతారావు ఓ గంట తర్వాత నిద్ర పోతున్న అరుంధతి మొహం చూసి ఓ చిన్న నవ్వు నవ్వుకున్నాడు.




మన్నాడు—

కాంతారావు, సుజాత విజయవాడ వెళ్ళి సరాసరి ఓ పెద్ద హోటల్లో దిగారు. స్నానాలుచేసి భోజనాలు అయిన తర్వాత కాంతారావు సుజాతతో తన మనసులో మాట చెప్పాడు.

"మనం విజయవాడ వచ్చింది ఇందుకా" అంది నవ్వుతూ.

"ఇది ఒక పని. ఏదో విధంగా మా సారధిగాణ్ని ఆ శాంతి ఉచ్చులోంచి బయటకు లాగాలి"

"ఆ అమ్మాయి అంటే అతనికి, అత

నంటే ఆ అమ్మాయికి ఇష్టంకదా! మధ్యన మీ కెందుకూ ఉక్రోషం"

"వాడు ఇంటి గౌరవం మంట కలపడం లేదా?"

సుజాత నవ్వేసింది. "మీరు మాత్రం ఏం చేస్తున్నారు. స [redacted] ఈ వేళ అతని మీద మీరు ఈ విధంగా దాడి చేస్తారు. రేపు మీ ఆవిణ్ని వెనకేసుకుని అతను మనమీద అదే ఆయుధం ఉపయోగిస్తే?"

"వాడి మొహం. మనం ఎలానూ పెళ్ళి చేసుకుంటాం"

"పెళ్ళి మీద పెళ్ళా"

"కాదు మాఆవిడకి విడాకులుఇస్తాను."

"ఎప్పుడు"

"సమయం రావాలి. దానికంతా ప్లాను వేశాను. సరేనా"

"ఈలోపునే అతగాడుఎదురుతిరిగితే"

"నువ్వున్నావుగా"

"నేనా... ?"

"అవును. మనిద్దరి మధ్య స్నేహం తప్ప వేరే సంబంధం లేదని నువ్వు అంటావు. దానికి తిరుగు ఉండదు"

"మీ ప్లాను తెలిసి శాంతి కూడా నాలానే అంటే". కాంతారావు నవ్వేశాడు. "మా వాడు వట్టి ఆవేశం గాడు. దాన్ని పెళ్ళాం అంటాడు తప్ప స్నేహితురాలని తప్పించుకోడు. ఆ మాట చాలు వాడి ముక్కుకి తాడు వెయ్యడానికి."

"ఏమో బాబూ! ముందు మా వాళ్ళు మీరెవరని అడిగితే నేనేం చెప్పను."

"ఇలా కష్టంలో పడి వచ్చాడు మా బాస్ అని చిన్న సీన్ క్రియేట్ చెయ్యి. తెలిసిందా?"

సుజాత కాంతారావు చెప్పినట్టె కాంతారావుని ఇంటికి తీసుకు వెళ్ళి అన్న గారికి పరిచయం చేసింది. సుజాత అన్న శివరావు కాంతారావుకి మర్యాదలు చేశాడు. చెల్లెలి ఆఫీసరు అనగానే అతనికి కాంతారావు దేవుడిలా కన్పించాడు. కాంతారావుఎంతో బాధ నటించి తను వచ్చిన విషయం చెప్పాడు.

"నేను జగన్‌కి కబురు చేస్తాను"

కాంతారావు వెంటనే అన్నాడు. "అతను ఎక్కడ వుంటాడో చెప్పండి. నేవెళ్ళి మాట్లాడతాను"

"మొగల్రాజపురంలో వుంటాడను కుంటాను, సాయంత్రం చెప్తాను అడ్రసు"

ఆ సాయంకాలం శివరావు జగన్ అడ్రసు సంపాదించాడు. కాంతారావు మొగల్రాజపురం వెళ్ళాడు. ఓ ఇరుకైన ఇంటిలో జగన్ దొరికాడు. కాంతారావు జగన్ ఇంటిని పరీక్షగా చూశాడు. అతనికి ఆ ఇంటిలో నలుమూలలా ధరిద్రం కన్పించింది. ఏదో ఆయిల్ వాసన ముక్కుని ఎగర గొట్టింది. అతనింటికి స్కూటర్స్ బాగు చేయించుకుందుకు జనం వస్తూ వుంటారు. కాంతారావు ఆ బాపతు అనుకున్నాడు.

"నీతో పనుండి వచ్చాను"

జగన్ "కూర్చోండి" అన్నాడు.

"అలా లబ్బిపేట దాకా వెడదాం. బట్టలు వేసుకో"

జగన్ ఆశ్చర్యంగా కాంతారావు మొహం చూశాడు.

"భయపడకు"

జగన్ బట్టలు వేసుకున్నాడు.

"నాది హైదరాబాద్" అంటూ కాంతారావు తన హోదాని పదింతలు చేసి విన్పించి జగన్‌ని హోటల్‌కి తీసుకు వెళ్ళి మస్తుగా తిన్పించి-

"బార్ అలవాటుందా నీకు" అన్నాడు.

"వద్దులెండి"

"నీకు పెళ్ళి అయ్యిందా ?"

జగన్‌కి ఏం చెప్పాలో తెలియలేదు. నాలుగేళ్ళనాడు శాంతితో చేసిన కాపురం, శాంతిని తను వేధించిన తీరు, వీధిలోకి గెంటిన దృశ్యం అతనికి గుర్తుకొచ్చాయి. దానికి కారణం అతనిలో కలిగిన పశ్చాత్తాపం కాదు. బంగారు గుడ్లు పెట్టే బాతుని నరికిన మూర్ఖుడు తనేనని అతనికి అర్థమయింది. శాంతిని ఏడిపించడం కోసం, వేధించడం కోసం అలవాటు చేసుకున్న తాగుడు, నెత్తి ఎక్కి అలవాటుగా మారింది. ఎవరైనా నాటకాలకి పిల్చినా అందులో రాబడి వుండేది కాదు—ఖర్చు తప్పించి, బజార్నపడ్డట్టయ్యింది. అందుకే స్కూటర్స్, టాక్సీలూ రిపేర్ చేయడం నేర్చుకున్నాడు.

"ఏం చెప్పమంటారు ?"

"అయిందా లేదా ?"

"అయినట్టే. కానీ వదిలిపెట్టా"

"ఎందుకు ?"

జగన్ మాట్లాడలేదు.

"ఇన్నేళ్ళయ్యింది నీ భార్య మీద నీకు మనసు పోవడం లేదా? పైగా ఆవిడ సంపాదన పరురాలేమో ?"

"అది నన్ను మర్చిపోయుండాలి" అన్నాడు బాధ కన్పించనీయకుండా.

"మర్చిపోయిందా లేదా అన్నది కాదు ప్రశ్న. నీ పెళ్ళాం నీ దగ్గర వుంటే ఎలా వుంటుందంటావ్ ?"

జగన్ ఆలోచిస్తున్నాడు.

"మాట్లాడవేం"

"అది రావడం, మా కాపరం నడవడం



జరగని మాటలు లెండి"

"అలా ఎందుకనుకుంటావ్"

"నేను తన్ని తగిలేశాను"

"ఇప్పుడు వెళ్ళి అడిగితే రాదా"

"చెప్పలేను"

"నీ పెళ్ళాన్ని నువ్వు తెచ్చుకో. హాయిగాసుఖపడు.పిల్లల్ని కను. నీ వెనక నేను వుంటాను"

"మీకెందుకీ శ్రమ"

"ఆ అమ్మాయి మా తమ్ముణ్ని మరిగింది"

జగన్ ఆశ్చర్యంగా చూశాడు.

"నీకు ఎంత డబ్బు కావాలన్నా ఇస్తాను. నువ్వు నా కూడా హైదరాబాద్ రా... నీకు నీ పెళ్ళాన్ని చూపిస్తాను.మర్యాదగా అడుగు"

"రానంటే"

"భార్యని ఎలా లొంగదీసుకోవాలో నీకు తెలియదా" కాంతారావు జేబులోంచి నోట్లు తీసి జగన్ జేబులో పెట్టాడు. ఆ తరువాత ఆటోలో కూర్చోబెట్టి బార్‌కి తీసుకు వెళ్ళాడు. రాత్రి సినిమాకి తీసుకు వెళ్ళాడు. హైదరాబాద్ వచ్చి ఏం చెయ్యాలో ఎలా ప్రవర్తించాలో చెప్పాడు. రాత్రి ఒంటిగంట దాకా చెడతాగి వచ్చి మంచం మీద పడి "మంచి బిజినెస్సే. పెళ్ళాన్ని వదిలేయడం కూడా మంచిదే అయ్యింది. రెండు వైపులనుంచీ రాబడి రాబోతోంది" గొణుక్కున్నాడు జగన్.



నాటక సమాజంలో సభ్యుల్నే కాకుండా స్నేహితుల్ని అందర్నీ ఆహ్వానించాడు సారథి పార్టీకి. కొత్త తరహాలో ఆహ్వాన పత్రికలు వేయించాడు. అందులో సారాంశం కూడా కొత్తగానే ఉంది.

'భార్యా భర్తలు సారథి, శాంతి మిమ్మల్ని విందుకు ఆహ్వానిస్తున్నారు. కొత్త దంపతుల్ని ఆశీర్వదించండి' అంతే.

స్కూల్ బిల్డింగ్‌లో రిహార్సల్స్ జరపడానికి ముందు చిన్న తేనీటి విందు.

వీధి గుమ్మం దగ్గర నిలబడి వచ్చే స్నేహితుల్ని సారథీ, శాంతీ ఆహ్వానించారు.

ఆహ్వానితులు అందరూ వచ్చిన తర్వాత సారథి చిన్న ఉపన్యాసం ఇచ్చాడు.

"మన దేశంలో ఏ కులం వాళ్ళు ఆ కులం వాళ్ళను పెళ్ళాడ్డం అనాదిగా వస్తూన్న ఆచారం. అది తప్పనీ, జాతి మనుగడకి ముప్పనీ ఈ వేళ చాలామంది ఒప్పుకుంటున్నారు. అందుకు భిన్నంగా జరిగే పెళ్ళిళ్ళు సంఘ పురోగమనానికి దోహదం చేస్తాయంటారు. ఈ రోజుల్లో ఏ ఉద్యోగంలో వాళ్ళు ఆ ఉద్యోగంలో వాళ్ళని ప్రేమించడం, దగ్గరవడం చూస్తున్నాం. ఉదాహరణకి డాక్టరు డాక్టర్నీ, లాయర్ లాయర్నీ, వ్యాపారస్తుడుతోటి వ్యాపారస్తుడితో సంబంధాలు ఎన్నుకుంటున్నారు. దీనివల్ల ఒకళ్ళ ఈతి బాధలు మరొకళ్ళకి అర్థమవడానికి ఎక్కువ అవకాశం ఉంది.

ఇదే సిద్ధాంతం మనకు సినిమా రంగంలో కన్పిస్తుంది. ఇక మన ఆంధ్ర దేశంలో పూర్వం సురభి నాట్యమండలి వాళ్ళు వాళ్ళ సంతానానికి ఆ సమాఖ్యలోనే సంబంధాలు చూసే వారనేది మనకి తెలిసిన విషయం. కానీ ఔత్సాహిక నాటక సమాజాల వాళ్ళు మాత్రం ఈ సిద్ధాంతాన్ని ఎందుకో కార్యాచరణలో పెట్టడం బహు తక్కువ. దానికి కారణం కూడా మనకు తెలిసిందే. ఎమెచ్యూర్ నాటక సమాజాల్లో పురుషులందరూ వైట్ కాలర్ వాళ్ళు కావడం, స్త్రీ పాత్రధారుల్ని కింది తరగతి వాళ్ళుగా చిన్న చూపు చూడ్డం. నాటకం వేయడానికీ, తనతో పాత్ర వేయడానికి పనికి వచ్చిన లేడీ ఆర్టిస్ట్ తనతోపాటు గౌరవనీయురాలు ఎందుకు కాకూడదు? శాంతితో నాకు రెండేళ్ళ పరిచయం ఉంది. ఈ రెండేళ్ళ పరిచయంతో నేను ఆమెని భార్యగా స్వీకరించాను. ఇదేదో స్త్రీ జనోద్ధరణ అని గానీ, ఆదర్శం అని గానీ నేను బాజాలు వాయించుకోను. నాకు నచ్చిన అమ్మాయిని నేను ప్రేమించాను. భార్యగా మీ అందరి ముందూ ఆమెనిస్వీకరిస్తున్నాను".

అక్కడకు వచ్చిన వాళ్ళలో రామేశం గారు "ఇప్పుడు శాంతి మాట్లాడుతుంది" అంటూ ప్రకటించాడు.

శాంతి రెండు నిమిషాలు కిందకి చూసి ఆపైన నెమ్మదిగా అంది-

"ఎవరో రచయిత రాసిన సంభాషణలు చదివి ఒప్ప చెప్పడం మాత్రం నాకు తెలుసు. ఎన్నో పాత్రలు వేశాను నేను. మరెవరో నటిస్తూంటే చూశాను. 'నా జీవితం నా భవిష్యత్ ఇలా ఉంటే బావుండునన్న' సంఘటనలు స్టేజిమీద చూసి సరదా పడ్డ రోజులూ, 'ఇలా ఎవరికీ జరక్కూడదు. ఈ కష్టా లెవరికీ వద్దు' అని భయపడ్డ నిమిషాలూ నాకు తెలుసు. అనుభవం కూడా! కానీ నిజ

జీవితంలో నేనిలాంటి రోజు చూసానని ఏనాడూ కలలు కనలేదు. అందుకే జీవితం అంత విచిత్రమయిందీ, వింతయినదీ, వినోద భరితమయిందీ, విషాధ పూరిత మైనదీ వేరొకటి వుండదేమో! రామేశం గారు నాకు అన్నం పెట్టి పెంచి పెద్ద చేస్తే-ఈ రోజు సారధిగారు నా జీవితానికి...." శాంతి తలవంచుకుంది.

"మీ సారధి అయ్యారు" స్నేహితులు అరిచారు! చప్పట్లు మారుమోగాయి.

"మంగళ సూత్రధారణ జరగాలిగా మరి" ఎవరో అరిచారు.

"మాకు మంగళ సూత్రాలు మళ్లె దండలే" సారధి జవాబు చెప్పాడు.

పార్టీ అయ్యేసరికి రాత్రి పదిగంట లయింది. అతిథుల్ని పంపి సారధి, శాంతి-శాంతి ఇంటికి వెళ్ళారు.

శాంతి ఇంటి తలుపుకి వున్న తాళం తీసింది.

"కొత్త పెళ్ళి కొడుకుగారు కుడికాలు మోపాలి."

"ఇల్లరికం అల్లుడికి ఆ పట్టింపులు వుండవు."

శాంతి అరగంటలో ఇల్లంతా సర్దింది. సారధి పడక కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. అతని మనసు సంతోషంతో తేలిపోతోంది. ఇంతలో బయట రోడ్డు మీద రిక్షా ఆగిన చప్పుడయింది. చీకటిలో రిక్షాలోంచి ఎవరో దిగడం సారధికి కన్పించింది. లేచి వీధి గుమ్మం దగ్గరకు వెళ్ళాడు.

సుబ్బరామయ్యగారు — తల్లీ.

"సారధీ" బయట నుంచే కేక వేశాడు తండ్రి.

సారధి-తల్లిదండ్రులు అలా వస్తారని ఊహించలేదు. క్షణం తటపటాయించాడు. ఆ పైన ఆలోచించి, "లోపలికి రండి నాన్నా...రా అమ్మా" ఆహ్వానించాడు.

"ఎందుకులే! ఇది ఎవరి ఇల్లు? ఇక్కడేం చేస్తున్నావు?" అక్కడి నుంచే అడిగాడు ఆయన.

"అన్నీ చెప్తాను లోపలికి వస్తే."

"ఇది నాటకాలు వేసే పిల్ల ఇల్లేనా?"

"అవును"

"అయితే ఇక్కడ నీకేం పని?"

"శాంతితో.."

సుబ్బరామయ్యగారు వెంటనే "ఇక్కడ ఘర్షణ పడ్డం మంచిది కాదు, ఇంటికి పద" అన్నాడు.

"ఘర్షణ పడ్డం నాకూ ఇష్టం లేదు. లోపలికి రండి— అన్ని విషయాలూ మాట్లాడుకుందాం"

"ఆ పిల్లని పెళ్ళి చేసుకున్నావట నిజమేనా?"

"అవును"

"మేం చచ్చాం అనుకున్నావా?"

"అనుకోలేదు. అలా అనుకోవడానికి నేను మూర్ఖుణ్ణి కాను"

"ఇది తెలివైన వాళ్ళు చేసే పనిట్రా! అదెవరో ఏమో. మనం ఎవరం...ఏం పనిరా ఇది"లక్ష్మమ్మగారు బాధగా అంది.

"ఎవరండీ వస్తా" అంటూ స్నానం చేసి వంటి మీద చీర కట్టుకుని జడ అల్లుకుంటూ లోపలి నుంచి వచ్చింది శాంతి.

"మా అమ్మా, నాన్నానూ"

శాంతి "ఓ" అంది.

"లోపలికి రండి అమ్మా"

"ఇదేనా?" సుబ్బరామయ్య శాంతిని

చూస్తూ అడిగాడు.

"నా భార్య నాన్నగారూ!"

"ఏడిశావ్ నోరు మూసుకుని ఇంటికి నడు. పెళ్ళాంట... పెళ్ళాం... మాట్లాడుతున్నావ్ పైగా"

"క్షమించండి. వస్తే లోపలికి రండి. లేకపోతే మీ ఇష్టం... వెళ్ళి పోవచ్చు."

"ఆ..."

"అవును. నేను గౌరవంగా, ప్రేమగా మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను.కాదంటే..."

"లోపలికి రండి" శాంతి అంది.

"ఏం అమ్మా! మా వాడు గానీ దొరక లేదా నీకు..."

"నలుగురూ చూసి నవ్వుతారు. మాకేం కాదు ఆ అవమానం, పెద్ద వాళ్ళయిన మీకే"

"నోర్ముయ్"

"మీరు వెళ్ళచ్చు. లేకపోతే మా ఇంటి మీదకి వచ్చి గొడవ చేస్తున్నారని నేనే పోలీస్ కంప్లయింట్ ఇస్తాను" సారధి వీధి తలుపు వేసేశాడు.

సుబ్బరామయ్యగారు సణుక్కుంటూ రిక్షా ఎక్కాడు. రిక్షా వెళ్ళిన చప్పుడు వినబడింది సారధికి.

"మా అమ్మా-నాన్నా. చూశావుగా."

"వాళ్ళు బాధ పడుతూంటే మీరు వాళ్ళని రెచ్చ గొట్టడం ఏం మర్యాద చెప్పండి".

"అది బాధ అంటావా! కాదు శాంతీ! ఆవేశం. కన్నబిడ్డల మీద తల్లిదండ్రులకు హక్కు ఉంటుందన్న వెర్రితనం."

"నచ్చజెబితే సరిపోయేది"

"ఆ పని ఉదయం వెళ్ళి నేను ఎలాగూ చేసేవాణ్ణి కానీ ఇక్కడకు వచ్చి వాళ్ళ మీద గౌరవాన్ని వాళ్ళే చెరుపు కుంటున్నారు"

"వద్దండీ అలా అనొద్దు. తల్లిదండ్రుల బాధ, ప్రేమా, మనం తల్లిదండ్రులం అయితేగాని అర్థంకాదు"

"సరేగానీ అన్నం పెడతావా రాత్రికి పస్తు వుండమంటావా?"

"పొద్దున మీ ఇంటికి వెళ్ళి ఓసారి కన్పించి వస్తానని మాటిస్తేనే"

"లేకపోతే అన్నం లేదా?"

"అన్నం ఒక్కటే కాదు..." శాంతి నవ్వేసింది.

"సరే చూద్దామా" లేచి సారధి శాంతి భుజం పట్టుకున్నాడు. శాంతి వారించబోయి అతని కౌగిలిలో ఇమిడిపోయింది. రాత్రి ఓ రాత్రివేళ శాంతి సారధి చెవిలో అంది-

"రేపు గనుక మీ ఇంటికి వెళ్ళకపోతే రేపు రాత్రికి నిజంగా పస్తే సుమా"

"అయితే ఈ రాత్రికే..."

శాంతి నవ్వేసింది. సారధి-శాంతి నవ్వుల్లో కరిగి కలిసిపోయాడు.




నెలరోజులు దొర్లిపోయాయి!

శాంతికి కొత్త అవతారం ఎత్తినట్టుగా ఉంది. తనిల్లు తను సంభాళించుకుంటూంటే వెర్రి ఆనందం కల్గేది. కలగా మిగిలిపోయిన సంసారం ఆనే మాట నిజమవడంతో ఆమెకు కొత్త లోకాలు చూస్తో

న్నట్టుగా అన్పిస్తోంది. సారథితో చనువుగా మసిలిన రోజులకూ, ప్రస్తుత వాతావరణానికీ తేడా ఏమిటో, ఆ తేడా ఎందుకు వచ్చిందో శాంతికి అర్థమవుతూనే ఉంది. అది సారధికి తను భార్య అయిన మూలంగా వచ్చిన మార్పు అని తెలుసు. స్నేహంలో మాధుర్యం ఉండొచ్చు, ఆప్యాయత ఉండచ్చు కానీ కాస్తంత బెదురు కూడా ఉంటుంది. అయితే యిప్పుడెందుకో బెదురులేదు. చెప్పలేని ధైర్యం. మహారాణిగా మారిన అనుభవం.

తను జీవితాన్ని ఎన్ని శాపాలు పెట్టింది! ఎంతగా ఛీదరించుకుంది! కానీ ఈ మంచి మార్పుకి లోబడ్డానికే వెనక అన్ని గడ్డురోజుల్ని భరించిందేమో! 'మంచి రోజులు లేవు, లేవు' అనుకున్న నోటితోనే వరించిన అదృష్టానికి పొంగిపోవల్సి వస్తుందనీ, కొత్త రుచులు చవిచూడవల్సి వస్తుందనీ, చెదిరిన గుండె భయంకర బాధల పాటల పల్లవి పాడిన నోటితో- ఈరోజు సంతోష తరంగాల రాగాల మాలిక విన్పిస్తుందనీ ఊహించగల్గిందా?

జీవితం ఎప్పుడు ఏ తంత్రులు మీటి ఏ రాగాలు విన్పిస్తుందో ఎవరికి ఎరుక?

శాంతికి వీధి తలుపు చప్పుడు ఆలస్యంగా విన్పడింది.

"వస్తున్నా" అంటూ వెళ్ళి తలుపు తీసింది.

తలుపు అవతల నిలబడ్డ మనిషిని చూసి ఆశ్చర్యపోయింది.

"వారు ఇంట్లో లేరు"

"మీతోనే మాట్లాడాలని వచ్చాను. నా పేరు కాంతారావు"

శాంతి మాట్లాడలేదు.

"లోపలికి రావచ్చునా?"

శాంతి తలుపుకి అడ్డంగా తప్పుకొని "రండి" అంది.

కాంతారావు అక్కడే వున్న సోఫాలో కూర్చుని చుట్టూ ఓసారి చూసి ఆపైన శాంతిని చూసి-

"కూర్చోండి" అన్నాడు.

శాంతి కుర్చీలో కూర్చుంది.

"నేను కళారవి అసోసియేషన్ సెక్రటరీని. అఫ్‌కోర్స్ ఇంతకాలం మా అసోసియేషన్ కలకత్తాలోనే జీవించిందనుకోండి. ప్రస్తుతం ఈఊళ్ళో దీనికి ప్రాణప్రతిష్ఠ చేయాలనుకుంటున్నాం"

శాంతి మాట్లాడలేదు.

"మా అసోసియేషన్‌కి మంచి పేరూ, ఆపైన ఆర్థిక స్తోమతా రెండూ వున్నాయి. కానీ ఇక్కడ కళాకారులకు మా వాళ్ళంతా కొత్త. మేం ఓ నాటకం వేయాలని అనుకున్నాం. సహజంగా లేడీ ఆర్టిస్ట్ ఎవరయితే బావుంటారని వాకబు చేస్తాం కదా! ఊళ్ళో చాలామంది మీ పేరు చెప్పారు"

"అలానా"

"నేను స్క్రిప్ట్ తెచ్చాను. మీకు ఎంత కావాలో చెబితే ఎడ్వాన్స్ ఇస్తాను. రిహార్సల్స్ రేపటినుంచి మొదలు పెట్టాల్సి వుంటుంది. సరేనా"

శాంతి "వద్దండీ! పర్స్ తీయద్దు" అనేసింది.

"అదేమిటి ఎడ్వాన్స్ తీసుకోవడం మీకు ఇష్టం వుండదా?" నవ్వేశాడు.

"వేషం వేయాలని ఇష్టం వున్నప్పుడు కదా, ఎడ్వాన్స్ తీసుకునేది"

"అంటే"

"నాకు ప్రస్తుతం తీరిక లేదు"

"అరే" అనేసి కాంతారావు క్షణం ఆగి, "పోనీ మీకు నచ్చిన డేట్ చెప్పండి.

మీ గురించి ప్రోగ్రాం మార్చుకుంటాం"

"వద్దండి! నా గురించి మీరు అప్ సెట్ కావద్దు. నేను నాటకాలు మానేశాను"

కాంతారావు ఆశ్చర్యంగా చూశాడు. ఆపైన నవ్వేసి "వేళాకోళం అనుకుంటాను"

"నిజం. మీరు మరెవర్నయినా చూసుకోండి"

"మీరయితే బావుంటుందని..."

"సరిగ్గా చేస్తే ఎవరయినా ఒకటే. అయినా పాత్ర గట్టిదయినప్పుడు పాత్రధారుల పట్టింపు మంచి లక్షణం అవదు కదా"

"పాపులారిటీ అనేమాట ఒకటి ఉందిగా మరి. మీ పేరు పేంప్లెట్ మీద చూస్తే ఈజీగా టికెట్లు తెగుతాయి.

"నాకు కుదరదండీ! క్షమించండి."

"బాగా ఆలోచించండి. మీకెంత కావాలో అడగండీ పోనీ"

"డబ్బు సమస్యకాదు."

"నేను అదే అనుకుంటున్నాను"

"మీరు పొరబడ్డారు."

"మీరు మమ్మల్ని నిరుత్సాహ పరుస్తున్నారు."

"క్షమించాలి.."

"ఎవరు చెబితే మీరు ఒప్పుకొంటారు? పోనీ వాళ్ళ చేతే చెప్పిస్తాను" ఆలోచనగా అని, "సారధి చెబితే వేస్తారా?" అన్నాడు.

"వారికి నా ఉద్దేశం తెలుసు. నన్ను బలవంత పెట్టరు"

"వారు అంటున్నారు? సారధి మీకేమవుతాడు?" శాంతి ఓసారి అసహనంగా కాంతారావుని చూసి-

"వారు, మా వారు"

"అంటే వాడు మీ భర్తా? ఎప్పటి నుంచి? ఎలా అయ్యాడు? పెళ్ళి చేసుకున్నారా?"

"మీరు అనవసర ప్రశ్నలు వేస్తున్నారు" శాంతి కావాలనే కుర్చీలోంచి లేచింది.

కాంతారావు "వద్దు వద్దు కూర్చోండి. సారధి నా తమ్ముడు, మీకు తెలుసో తెలియదో" అన్నాడు. శాంతి విస్తుపోయి చూసింది కాంతారావుని.

"అందుకే అడుగుతున్నాను. ఇప్పుడు చెప్పండి. మీరు ఏదో కాలక్షేపానికి వాడితో ఉంటున్నారని మేం యింట్లో అనుకుంటున్నాం. సహజంగా చూడండి. ఈ సంబంధాన్ని ఎవరూ పెళ్ళి అనరు? ఎందుకంటే ఆ తతంగం, ఆ మనుషులూ వేరు. ఏమంటారు"

శాంతికి కాంతారావు మాటలు శూలాల్లా తగుల్తున్నాయి.

"సారధిగారు వచ్చిన తర్వాత మీరు రావల్సింది. నేనేం చెప్పినా మీకు నమ్మకం కలగదని నాకు అర్థమవుతూనే వుంది. అందుకే వినేదేదో ఆయన నోటివెంట విందురుగాని!"

"వాడేం చెప్తాడు. వాడు మత్తులో వున్నాడు."

"మరి మీరు దేనికి వచ్చినట్టు యిక్కడికి? నాకు హితబోధ చెయ్యాలనా!"

"సరిగ్గా నే ఊహించావ్. చూడు అమ్మాయ్! వాడు ఆదర్శం, సంఘోద్ధరణ, తిరుగుబాటూ అంటూ వెర్రిలో పడ్డాడు. దాంతో వాడికి ఇల్లూ వాకిలీ పట్టలేదు. ఇక నీ సంగతి...నీకన్నా బాగా నాకు తెలుసు. నీలాంటిదాన్ని ఉంచుకుని మోజు తీరేవరకూ ప్రేమించేవాళ్ళు తప్ప జీవితాంతం ఏలుకునే వాళ్ళని నువ్వెప్పుడైనా,

ఎక్కడయినా చూశావా ? ఆపేక్ష వేరు, అవకాశం వేరు. నిజం చెప్పు! ఈ స్థితికి నువ్వు వస్తావని,నిన్నిలా నెత్తికి ఎక్కించుకునే మనిషి, మనిషి కాదు [illegible]రివాడు దొరుకుతాడని నువ్వేనాడయినా ఊహించావా? లేదు. ఆవారా మొగుడు జగన్‌తో నీ కాపురం, నీ గత చరిత్ర అవన్నీ గుర్తు చేసుకో? నా మాట విను. నీకు కావల్సినంత డబ్బు ఇస్తాను. సినిమాల్లో ఛాన్స్ వచ్చేటట్టు చూస్తాను. అంతవరకూ మా సమాజానికి కాంట్రాక్ట్ పద్ధతిలో వక్కచేసి పెట్టు"

శాంతికి కాంతారావు మనిషిగా కాకుండా మనిషి రూపు ధరించిన తోడేలులా కనిపించాడు. ఆవు మొహం తొడుక్కున్న పులి వేద పఠనం చేస్తోన్నట్టుగా ఉంది. అడుగునపడ్డ మనిషిని అడుగునే ఉంచాలని శాసించే అతని వాగ్ధోరణిని నిప్పులు కురిపించే తన కళ్ళతో కాల్చి భస్మం చెయ్యాలని వుంది శాంతికి. మనిషినీ, మనిషి పతనానికి కారణాల్ని హేతువాదంతో పరిష్కార మార్గం చూపించకుండా—కన్నీరు తుడవవల్సిన చేతుల్తో అలాంటి మనుషుల గొంతులు కోయబోయే వ్యక్తిని చూస్తే ఆవేశం పుట్టుకొచ్చింది. కావాలని కళ్ళు మూసుకుని లోకం కళ్ళు తెరవాలని వ్యర్థప్రయత్నం చేసే అభ్యుదయవాది వేషం వేసుకున్న కాంతారావుని చూస్తే చాచి లెంపకాయ కొట్టి బయటకు గెంటాలనిపించింది.

"నా గురించి మీకు చాలా తెలుసునని ఒప్పుకుంటున్నాను బావగారూ!" అంది కోపాన్ని శరీరం లోపునే అణుచుకుంటూ.

"వరసలు బాగానే కలపగలవన్నమాట"

"మీ మరదల్ని కదా! మీ పాటి చెయ్యక పోయినా అక్కగారంత మెతక మనిషిని కాను గుర్తుంచుకోండి"

"నువ్వేటువంటి దానివో నాకు తెలుసు కదా ఖర్మ,నిజం దాచడం నీవల్ల కాదులే"

"మీ గురించి కూడా నాకు తెలుసు కాంతారావు గారూ ? మీరు నా దగ్గర ఏం దాచలేరు ? నేను చాలా చిన్న కుటుంబంలో చిన్న కులంలో పుట్టినదాన్ని. బ్రతకడం గురించి ఎన్నో వేషాలు వేయడం మాకు అలవాటు. కారణం—ఆకలి. చిన్నప్పటి నుంచీ మాకు నటన నేర్పుతుంది చుట్టూ సంఘం. అందుకే మేం చాలా తప్పుల్ని అవలీలగా చేస్తాం. ఒక్కొక్కసారి మీలాంటి ఆప్తులు వచ్చి అది తప్పంటే చప్పున సరిజేసుకుంటాం. అంతేగాని అందుకోసం ఆత్మాభిమానాన్ని అడ్డు పెట్టుకోం ? బావగారూ! మీకూ నాకూ చాలా పోలికలు వున్నాయి తెలుసా! నేను చెడినదాన్ని, భర్త వదిలిన దాన్ని, ఒంటరి దాన్ని అని తెలిసి మీ తమ్ముడుగారు నన్ను పెళ్ళిచేసుకున్నారు. మీ పరిభాషలో చెప్పాలంటే ఉంచుకున్నారు. కానీ మీరు. నిప్పులు కడుక్కునే వంశంలో పుట్టారే? కక్కుర్తి వేషాలు వేయడం మీకు తెలియవే? మరి మీరెలా తప్పటడుగు వేశారండీ ? భార్యని ఇంట్లో వుంచుకుని మరో అమ్మాయితో తిరగడం ఎక్కడి సాంప్రదాయం? ఈ సాంప్రదాయం మిమ్మల్ని కళ్ళు మూసుకుని పాలు తాగ మన్నప్పుడు—నేను కళ్ళు తెరిచి నా సుఖం గురించి నాకు నచ్చిన నిర్ణయం తీసుకుంటే ఎందుకు గొంతుకలు పగిలేటట్టు అరవాలి చెప్పండి? మనిద్దరం దొంగలం అయినప్పుడు

ఇద్దరూ తేలు కుట్టిన వాళ్ళలా తలలొంచుకుని వుండాలిగానీ ఇలా మిమ్మల్ని నేనూ, నన్ను మీరూ హేళన చేసుకోవచ్చా చెప్పండి ?"

కాంతారావు బొమ్మ అయిపోయాడు.

"వెళ్ళండి బావగారూ ! చీకటి పడింది సారధిగారు వస్తే చీకట్లో మిమ్మల్ని చూసి దొంగ అనుకోవచ్చు. నేను కూడా అలానే చెప్పవలసి వస్తుంది. మీరు ఇంటికి వెళ్ళి మరోసారి అక్కగార్ని వంచించో దగాచేసో నిద్రపొండి. అమ్మగారికీ నాన్నగారికీ మా మీద కల్పించి



ఓ దండకం విన్పించండి! అంతేగానీ మనుషుల్ని ఉద్ధరిద్దామనీ, ముళ్ళదారిని సరిజేద్దామనీ ఆశలు పెంచుకోకండి!

ఈ దేశంలోకి మంచి గాలీ, మంచి మార్పూ వీయడం మానేసి చాలా కాలం అయింది. అందుకు దేవుణ్ణి తిట్టుకుంటూ కూర్చోండి.



ఎందుకంటే దేవుడివల్ల ఆ కాస్త ఉపకారం జరిగి ఏ ఉప్పెనో వస్తే, ఆ తాకిడికి గడ్డిపోచల్లాంటి మనం కూడా ఎగిరిపోతాం. మన మనుగడే మిగలదు" అనేసి లోపలికి వెళ్ళిపోయింది శాంతి.

"నీ కెంత పొగరు? నీ కెంత అహంకారం...రేపు చెప్తాను నీ పని" సణుక్కుంటూ బయటకు వెళ్ళాడు కాంతారావు.

శాంతి లోపలినుంచి వచ్చి వాకిట్లో లైటు వేసింది. చీకటి మాయమయి వెలుతురుకు చోటిచ్చింది క్షణంలో. మళ్ళీ ఓ సారి లైటార్పి వాకిటంతా చీకటయితే తిరిగి లైటు వేసి, "ఈ చీకటీ, వెలుతురూ కూడా ఎంత క్షణికం" అనుకుంది శాంతి.

సారథి కోసం వీధి గుమ్మం వరకూ వెళ్ళి తలుపు నానుకుని నిలబడి, వీధిలోకి చూస్తూ నుంచుండి పోయింది.

ఎందరో వస్తున్నారు అటునుంచి. మరి కొంతమంది యిటునుంచి వెడుతున్నారు. చాలా దూరం నుంచి నడిచి వస్తోన్న సారథిని గుర్తుపట్టింది శాంతి. దూరానికి పెయింటర్ వేసిన సిల్‌హౌటీలా ఉన్నాడు సారథి. దగ్గరగా వస్తున్నాడు. మనిషి తలవంచుకుని కంగారుగా నడుస్తున్నాడు. చాలా దగ్గరగా వచ్చిన తరువాత గుమ్మం ముందు తలెత్తి "శాంతీ"

అన్నాడు కంగారుగా.

"ఏమిటండీ ఏమయింది ?"

"లోపలికి పద చెప్తాను"

సారధి వెనకే శాంతి లోపలికి నడిచింది.

"మాలతి టెలిగ్రాం యిచ్చింది. ప్రసాద్‌కి సీరియస్‌గా ఉందిట"

"అరెరే...ఎలా జరిగిందండీ"

"టెలిగ్రాంలో వివరాలేమీలేవు. ట్రంక్ కాల్ చేసినా ఎవరూ ఏం చెప్పలేక పోయారు. నేను ఏదో విధంగా మద్రాసు వెళ్ళాలి యిప్పుడే"

"సరే..."

"బట్టలు సర్దు. స్నానంచేసి వస్తాను"

సారధి లోపలికి వెళ్ళాడు,

శాంతి అరగంటలో సారధికి అన్నం పెట్టి ప్రయాణానికి సిద్ధం చేసింది. భర్త వెనకే వాకిట్లోకి వస్తూ—

"పోనీ నన్నూ రమ్మంటారా ?"

"ఎందుకు ?"

"మనిషికి మనిషి సాయం. అందులో ఆడసాయం అవసరం అవుతుందేమో"

"శాంతీ" బాధగా అరిచాడు.

"మీరు ఆలోచించండి"

"ఏం జరక్కూడదు. అలా జరక్కూడదు శాంతీ. నువ్వొ వచ్చేస్తే ఎలా...నువ్వు రేపు పొద్దునే ఎలాగైనా మా యింటికి వెళ్ళి అమ్మకి కబురు అందజెయ్యి. అవసరమయితే ఇద్దరూ వద్దురుగాని. ఈ సమయంలో మా వాళ్ళెం గొడవ చేయక పోవచ్చు. తెలిసిందా"

"అలానే"

"మరి నే వెడతాను"

"శుభం" అంది శాంతి. సారధి వీధి గుమ్మం దిగి అటుగా వచ్చిన రిక్షా ఎక్కాడు.

* * *

శాంతి నవల చదువుకుంటూ వాకిట్లో కూర్చుంది. కానీ దృష్టి నవలమీదకు పోవడం లేదు. ఆలోచనలు అత్తవారింటి మీదకు పోతున్నాయి. శాంతికి బాధతో మిళితమైన నవ్వు వచ్చింది. అత్తవారిల్లు... తనని ఆ యింట్లో బంధువుగా ఎంతమంది గుర్తిస్తారన్నది అనుమానాస్పదమే! సారధి తండ్రి తనవైపు పురుగును చూసినట్టు చూశాడు. పెద్దావిడ మాత్రం మర్యాద చేయకపోయినా మొహంమీద తిట్టలేదు. తను మాలతి గురించి చెప్తే నిశ్శబ్దంగా వింది.

అయినా తను అంది కూడా—

"మీరు తక్కిన విషయాలు పక్కన పెట్టి ఆ అమ్మాయి గురించి ఆలోచించండి. మీరు ఏమీ అనుకోనంటే మిమ్మల్ని యిప్పుడే నాతో తీసుకువెడదామనుకుంటున్నాను"

"వద్దు. సాయంత్రానికి నేను వస్తాను"

వచ్చే ముందే గుమ్మంలో అరుంధతి కన్పించింది.

"బావున్నారా"

"నీ దయవల్ల"

"నా దయా! భలే వారేనే"

"అప్పుడే వెడుతున్నావేం. రా నా గదిలో కూర్చుందాం"

"నే వచ్చిన పని—" అంటూ శాంతి జరిగింది చెప్పింది.

"అరెరే"

"ఆయన చాలా బాధపడుతూ వెళ్ళారు. ఎలా వుంటుందో ఏమో" అంది శాంతి. ఆపైన ఆమెకి కాంతారావు గుర్తొచ్చాడు.

"మీవారు..."

"ఆఫీసుకు వెళ్ళారు"

"నేను ఇలా వచ్చి వెళ్ళినట్టు చెప్ప కండి వారితో."

"ఏం?"

"నేనంటే వారికి కోపం. కోపం కూడా కాదు అసహ్యం"

"నీకెలా తెలుసు?"

"నేను జరిగిందంతా చెప్తే....వద్దు బావుండదు. ముందు మీ మనసు కష్ట పెట్టడం నాకిష్టం లేదు."

"ఆయన ముక్కోపి"

"ముక్కోపం వాళ్ళకి ప్రేమ ఎక్కువ వుంటుందంటారే!"

"ముక్కోపం కాదు మొండితనం."

"పరిస్థితులతో రాజీపడని వాళ్ళకే మొండితనం వుంటుంది."

"నిజమే చెప్పావు"

"మరి నే వెడతాను."

అరుంధతి శాంతికి బొట్టు పెట్టి తాంబూలం రవిక గుడ్డా చేతిలో పెట్టి తను బొట్టు పెట్టుకుని వీధివరకూ శాంతిని సాగనంపింది.

ఒకే ఇంట్లో ఎన్ని రకాల మనుషులు. ఒకే గూటిలో పెరుగుతున్నా పక్షులన్నీ ఒక జాతివి కావేమో!

వీధి తలుపు చప్పుడయితే నవల సోఫాలో పడేసి ఒక్క ఉదుటున లేచి శాంతి తలుపు తెరిచింది!

జగన్...

శాంతికి కళ్ళు తిరిగి నట్టయింది. అరక్షణం భయం, అనుమానం, ఆ వెంటనే మొండితనం, చొరవా, జగన్ మీద అసహ్యం ఏవేవో భావాలు కదు ల్తున్నాయి.

"గుర్తుంటానా" జగన్ నవ్వుతూ లోపలికి వచ్చాడు. శాంతి మాట్లాడే లోపునే జగన్ గ్రాంఫోన్ కి యిచ్చి నట్టు వాగడం మొదలు పెట్టాడు. "నన్ను పూర్తిగా మర్చిపోయా వులా వుందే! అవునులే. అది సరేగాని ఈ కప్పులన్నీ నీకు డ్రామాల్లో వచ్చిన వన్నమాట." అల్మైరా దగ్గరకు వెళ్ళి చూడ్డం మొదలు పెట్టాడు.

శాంతి షాక్ తగిలిన దానిలా జగన్ వైపు చూస్తూనే వుంది.

"మెత్తం మీద పెద్ద యాక్టర్ వయి పోనావ్. బాగానే వుంది గానీ నాకు కడు పులో మండి పోతంది.కొంచెం కాఫీ పూజ చెయ్యాలి. ఆ-నా కాఫీ ఎట్టా వుండాలో తెల్సుగా. డబల్ స్ట్రాంగ్ బెజవాడ కాఫీ." జగన్ మాటలు ఆపి-

"ఏంటి మాట్లాడవ్. ఇదంతా సిగ్గేనా! ఏంటా చూపు బుచ్చి" అన్నాడు దగ్గ రగా వచ్చి లాలనగా బుగమీద చిటికేసి.

"ఏం లేదు. నిన్నూ నీ పద్దతీ చూసి ఆశ్చర్య పోతున్నా." శాంతి అక్కడే వున్న ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసి టీ పాయ్ మీద పెట్టింది.

"అయితే ఆనాా కాఫీ తాగే అలవాటు నీకూ పోలేదన్నమాట. కూర్చో నించుంటా వేంటి."

శాంతి కుర్చీలో కూర్చుని "ఇంతకి ఎందుకొచ్చినట్టు ఈ ఊరు. పనుండి వచ్చావా?" అంది.

"పనేంటే ఎర్రిమొహం. పనంతా నీతోనే."

"నాతోనా."

"ఆ..."

"నాతో నీకేమిటిపని."

"మొగుడికి పెళ్ళాంతో వుండే పనే!" కిసుక్కున నవ్వేశాడు.

శాంతి అసహ్యంగా జగన్‌ని చూసి "ఇన్నేళ్ళ తర్వాత, ఇప్పుడు నీకు నేను కావల్సి వచ్చానా?"

"నాగుండెలు చీల్చి చూ పిం చ మంటావా? లోపల నీ ఫొటో వుండే.ఏదో జరిగిపోనాధి. మనం ఒక్కళ్ళ కొకళ్ళం కాకపోము. ఏటంటావ్?"

"అనడానికేం లేదు. నేను నీ నుంచి వచ్చేసినప్పుడే, నువ్వు నన్ను తన్ని తగిలేసినప్పుడే మనిద్దరి సంబంధం పోయింది. ఈ వేళ మొగుడూ పెళ్ళాలు అవమంటే అవుతామా, జరిగే పనా ఇది."

"ఒకసారి మొగుడు గాడు తనే నే పోద్దా–సంబంధం. పక్కలో పడుకున్న తర్వాత చచ్చే వరకూ వుంటుందే చుట్టరికం."

శాంతికి జగన్ పశువులా కన్పిస్తున్నాడు. నాలుగేళ్ళనాడు అతనితో సంసారం చేయడం, దెబ్బలు తినడం, కష్టాలు అనుభవించడం అన్నీ చేసింది. అప్పటికింకా తను వయసులో, అనుభవంలో చిన్నదే! ఐదేళ్ళ క్రితం నాటికీ ఈనాటికీ తనలో మార్పు వచ్చింది. అది ఒకే రకమైన మార్పుకాదు. చుట్టూతా అన్ని మూలల నుంచీ ఆర్థికంగా సాంఘికంగా,చైతన్య పరంగా ఒక్కొక్క మెట్టు చొప్పున ఎక్కి తల బొప్పి కట్టించుకుని, జీవితం నుంచి ఎన్నో గుణపాఠాలు నేర్చుకున్న తర్వాత వచ్చిన మార్పు. తన మనసుకు పట్టిన మకిలిని, అసహ్యాన్ని చీదరినీ తుడుచుకుని ఈ స్థితికి ఎదగడానికి తను పడిన కష్టాలు జ్ఞాపకం వస్తున్నాయి. మనిషి రూపం చూసి మాటలు నమ్మి తను మోసపోయింది. పినతల్లీ, తండ్రీ చెప్పిన మాటలు కూడా నమ్మింది.

కామదాహం తీర్చుకుందుకూ, భార్య తాలూకు డబ్బు ఆశించీ పుస్తె కట్టిన మొగాడు ఏవో కొన్ని క్షణాలే భర్తగా నటించగలడు. ఆ తరువాత ఎప్పుడో ఒకప్పుడు కాదు క్షణ క్షణానికీ తన విశ్వరూపం చూపిస్తూనే వుంటాడు.

ఈరోజు జగన్‌ని తనుభర్తగా అంగీకరించే సమస్యేలేదు. పాత జీవితంలోకి ప్రవేశించడం...కాదు కాదు అటు తొంగి చూసే ప్రసక్తే లేదు.

"సరే అసలు విషయం చెప్పు. దారి ఖర్చులు కావాలా. అవును కదూ?" అంది సాధ్యమయినంత వరకూ జగన్‌తో దూరం వెళ్ళ కూడదూ, రెచ్చగొట్ట కూడదని.

"నీ ప్రేమ నాకు తెలుసే. నాకు నువ్వుండగా వేరే డబ్బు ఎందుకు? నువ్వే నా ఇనప్పెట్టెవి. నా పాణానివి. మనం ఈ రాత్రికే బెజవాడ పోదాం. తయారుకా! అక్కడ లేడీ వేషగాళ్ళంతా సినిమా ఛాన్సులొచ్చి మద్రాసు పోయారు. ఆడ మొహానికి రంగుపూసే పిల్లనేక బెజవాడంతా గొడ్డోయిందనుకో. ఇప్పుడు ఆ ఊరికి నువ్వే రాణివి."

"నేను నాటకాలు మానేశాను."

జగన్ నవ్వేశాడు. "నేను తాగడం మానేశానన్నట్టే వుంది, నీ జోకు, నెగు. వణ్ణం వడ్డించు. కోడి కూర వండుతావేంటి, తెస్తా."

"నేను మాంసం కూడా మానేశాను."

"అలానా." అంటూ జగన్ నవ్వేసి, "అయితే నేవిన్నమాట నిజమేనన్నమాట.

నువ్వు బ్రాహ్మల్లోకలిశావంటగా?" శాంతి మాట్లాడలేదు.

"ఆ డెవడో నిన్ను బాగా బుట్టలో ఏసుకున్నాడు ఏం?"

"నీకు మనువయినట్టుతెలవదా ఆడికి?"

"ఆయనకు నా సంగతంతా తెలుసు నీ గురించి కూడా చెప్పాను."

"ఏవనీ.."

"ఇలా ఎప్పుడూ మనింటికి రాడనీ! అర్థమయిందా"

"అంటే ఆడితోనే వుండిపోవాలనా?"

"ఉండి పోవడం కాదు. మేం మొగుడూ పెళ్ళాలం. సరేనా?"

జగన్ మళ్ళీ నవ్వేశాడు. నవ్వుతూనే తొడలు చరచుకుని,

"ఎన్ని పెళ్ళిళ్ళు ఎంత మందిని చేసు కుంటావే? ఉంచుకుంటే ఊరుకుంటుంది గవర్నమెంటు. పెళ్ళి మీద పెళ్ళిచెల్లదు."

"ఆ గొడవలేవో మేం చూసుకుంటాం"

"అంటే..."

"నువ్వెళ్ళచ్చు..."

"ఎక్కడికి..."

"నీ ఇష్టం వచ్చిన చోటికి..."

"నువ్వు లేకుంటా ఏడకీ పోనుగానీ వణ్ణం వడ్డించు."

"నా భోజనం అయి చాలా సేప యింది. హోటల్‌కి వెళ్ళి తిను."

"మొగుడికి ఇలానేనా మర్యాద చేసేది నా సంగతి మర్చిపోయావా?"

"నువ్వు మొగుడివీ కాదు. నేను పెళ్ళాన్నీ కాను నువ్వు వెళ్ళచ్చు."

జగన్ లేచి శాంతి వెనకే వెళ్ళి కుర్చీ మీదకి వాలి హఠాత్తుగా భుజాలు పట్టు కుని నుదుచు మీద మొహం మీద ముద్దులు కురిపించాడు. శాంతి చేతులు విడిపించుకుంటూ కాళ్ళతో కుర్చీని తన్నడం మొదలు పెట్టింది పక్కకి వంగి.

"ముద్దుగా ఏపుగా పెరిగావు మాటలు కూడా నేర్చింది సిలక."

"ఫో బయటకు..."

"మన సంగతి తెలవదేమో జగన్ దెబ్బ గోల్కొండ అబ్బ నా చేత పుస్తి కట్టించుకుని ఆడితో కులుకుతే ఊరు కుంటానేటే. ఈ వేళ నీ పని పడతాను."

"పడవా?"

ఓ అరగంట శాంతి జగన్‌తో ఘర్షణ పడింది. పోట్లాడింది, తన్నింది. ఆ తరు వాత నీర్సంతో చిందర వందర అయి వాకిట్లో వళ్ళు తెలియని మగతతో పడి పోయింది.

జగన్ బయట నిలబెట్టిన టాక్సీలో మనుషుల్ని లోపలికి పిల్చి వాళ్ళ సహా యంతో శాంతిని టాక్సీలో పడుకో బెట్టాడు. వీధి గుమ్మం దగ్గరగా వేశాడు.

"బెజవాడ పోదామా..."

జగన్ జేబులోంచి కాంతారావు బెజ వాడలో యిచ్చిన అడ్రసు కాగితం తీసి "దబ్బులిసానన్నాడు ఈ అడ్రసుకు తీసుకుపో" అన్నాడు.

టాక్సీ బయలు దేరింది.

పది నిమిషాల తర్వాత లక్ష్మమ్మ గారు శాంతి ఇంటి ముందు రిక్షా దిగి "శాంతీ, శాంతీ" అంటూ లోపలికి వచ్చింది. అక్కడి నిశ్శబ్ద వాతావరణం చిందర వందర అయిన సామాన్లూ ఆవిడ ఊహకు ఏ జవాబూ అందివ్వలేక పోయాయి.

"ఏమిటో" అనుకుని ఇల్లు సర్దడం మొదలు పెట్టింది.

అరగంట తర్వాత పోస్టుమన్ తీసుకు వచ్చి టెలిగ్రాం ఇచ్చాడు.

"బాబూ నాకు చదవడం రాదు చదివి విన్పిసావా ?"

పోస్టుమన్ టెలిగ్రాం చింపి మనసులో దాన్ని చదువుకుని అన్నాడు.

"ప్రసాద్ అనే ఆయనకి ఆపరేషన్ చేశారుటమ్మా, ఇప్పుడు బాగానేవున్నారట"

"పోనీలే నాయనా"

పోస్టుమన్ వెళ్ళిపోయాడు.

"ఈ పిల్ల ఎక్కడికి వెళ్ళిందో ?" అనుకుంటూ అక్కడే కూలబడింది లక్ష్మమ్మగారు.




తల్లి కోసం కబురుచేసి ఆవిడ వచ్చే లోపునే శాంతి ఎక్కడికి వెళ్ళివుంటుంది? ఇల్లంతా వెదికాడు ఎక్కడయినా ఉత్తరం పెట్టిందేమోనని. తల్లి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి, అవును తల్లి వెళ్ళే సరికి ఇల్లంతా చిందర వందరగా వుంది. అంటే శాంతి మామూలుగా ఇల్లు వదిలి వెళ్ళ లేదన్న మాట. సారధి ఒకటి రెండు రోజులు చూశాడు. శాంతి ఉత్తరం రాసుందేమోనని. ఏ కారణం లేకుండా, అదీ తను ఊళ్ళోలేని సమయం చూసి ఎందుకు వెళ్ళినట్టు.

పైగా వారం రోజుల్లో రామేశంగారికి తమ ఆసోసియేషన్ తరపున సన్మాన ప్రయత్నం పెట్టుకున్నారు. ఆ ఆలోచన కూడా శాంతే ఇచ్చింది. ఇరవై ఐదు సంవత్సరాలు ఏకబిగిన నాటక రంగాన్ని నమ్ముకుని అదే జీవితంగా, వ్రతంగా భావించిన మహానుభావుడు. శాంతిలాంటి అనాధల్ని ఆదుకుని వాళ్ళ కళ్ళల్లో నీరు తుడిచి, కాలే కడుపుల్లోంచి, మండే హృదయాల్లోంచి నవనీతం పుట్టించి నటులుగా తీర్చిదిద్దాడు. తనూ, శాంతి చిన్న స్కిట్ ఒకటి ప్రదర్శిద్దామనుకున్నారు.

సారధి ఇంటికి తాళం వేసి అచేతనంగా రామేశం గారింటికి వెళ్ళాడు.

సారధిని చూడగానే రామేశంగారు "రా సారధీ!" అంటూ ఆహ్వానించి కుర్చీ చూపించాడు.

"ఈమధ్య కనబడ్డం లేదు. ఆఫీసు పన్లేనా."

"కాదండీ. మా బావ ప్రసాద్ కి అపెండిసైటిస్ ఆపరేషన్ జరిగింది. చాలా కంగారు పెట్టాడు. టెలిగ్రాం ఇస్తే మద్రాసు వెళ్ళాను."

"అతనా! అరే పాపం."

"ఇప్పుడు కోలుకుంటున్నాడు లెండి."

రామేశంగారు కళ్ళజోడు సర్దుకుని, చేతులు రెండూ తలకిందకు మార్చుకుని పడకకుర్చీలో వెనక్కి ఒరిగారు.

"మీరంతా ఉద్యోగస్తులు. పైగా ఇలాంటి ఇబ్బందులు కొన్ని. సన్మానం వాయిదావెయ్యి. నేనేం అనుకోను."

"అబ్బే దాని దారిని అది జరుగుతుందండీ. కానీ నేను వచ్చింది..."

"ఏమిటి మరి?"

సారధి తను ఊరికి వెళ్ళేముందు శాంతి ప్రవర్తన, వచ్చేసరికి శాంతి మాయమవడం అన్నీ చెప్పి అన్నాడు.

"ఎంత ఆలోచించినా నేనెక్కడా శాంతి బాధ పడేటట్టు ప్రవర్తించలేదు. ఇన్ని రోజుల పరిచయం వుంది. తనే వెళ్ళిందా, ఎవరైనా మోసంచేసి తీసుకు వెళ్ళారో."

"అరే శాంతి చాలా బుద్ధిమంతురాలు సారధీ, ఏదో గొడవ జరిగిందేమో! పెగా నలుగురికి తెలిసిన మనిషి. ఒంటరిగా ఉండడం చూసి..." రామేశంగారు తిప్పు కుని,

"ఛాఛా అలాజరక్కూడదు." అంటూ గొణుక్కున్నాడు.

"నేను బెజవాడ వెళ్ధామనుకుంటు న్నాను. కానీ శాంతి వాళ్ళ వాళ్ళ గురించి నాకేం తెలియదు. మీరు నేను ఆ ఊళ్ళో ఎవరిని కలుసుకుంటే బావుంటుంది. శాంతి గురించి నాకు సరియైన ఆచూకి ఎవరు ఇస్తారు."

రామేశంగారు ఆలోచించి. "శాంతిని నా దగ్గరకు ఉత్తరం ఇచ్చి పంపాడయ్యా వెంకట్రావు అనే మిత్రుడు. అతగాడి అడ్రసు ఉండాలి చూసానుండు." అంటూ కుర్చీలోంచి లేచి తీగకు తగిలించిన ఉత్త రాలకట్ట చేతిలోకి తీసుకుని ఒక్కొక్కటే ఎత్తి చూస్తూ ఆఖరికో ఉత్తరం పట్టు కున్నాడు. సారధి అతృతగా పై ఉత్త రాల్ని తప్పించి వెంకట్రావు అడ్రసు డైరీలో రాసు కున్నాడు.

"ఎందుకైనా మంచిది. నా స్నేహితు డొకడు రాజారావని ఉన్నాడు. అతనికి లేడీ ఆర్టిస్టతో పరిచయం వుంది. అతన్ని కూడా కలుసుకో" అంటూ మరో అడ్రసు ఇచ్చాడు.

"నేవెడతానండీ" సారధి కుర్చీలోంచి లేచాడు.

"సారధీ. కంగారు పడకు! అక్కడ నీకేమయినా ఇబ్బంది అయితే నాకు ట్రంక్ కాల్ చెయ్యి. నేవసాను." అన్నాడు సారధి వెనకే లేచి వీధి గుమ్మం వరకూ సాగనంపుతూ

"అలానే సార్"

* * *

వెంకట్రావు గారికి కూడా రామేశం గారి వయసే వుంటుంది.

సారధిని చూడగానే "ఎవరూ?" అంటూ తలుపు తీశాడు.

"నమస్తే"

"కూర్చోండి"

సారధి తనని పరిచయం చేసు కున్నాడు. నెమ్మదిగా రామేశం గారి గురించి చెప్పాడు. ఆ తర్వాత అన్నాడు-

"మీరు రెండేళ్ళ క్రితం శాంతి అనే నాటకాలు వేసే ఆర్టిస్టని ఉత్తరం రాసి ఇచ్చి హైదరాబాద్ పంపారు గుర్తు వుందా?"

"ఎవరు? శాంతా!" అని "బక్కగా వుంటుంది అవును...ఈ ఊరే ఆ అమ్మా యిది బాగా ఏక్ట్ చేసేది పాపం!"

"అవును ఆ అమ్మాయే"

"ఏమయింది శాంతికి"

"ఏమీ కాలేదండీ! మా నాటక ప్రదర్శ నలో ఆవిడ ఏక్ట్ చేస్తోంది సడన్‌గా ఇలు వదిలి వెళ్ళిపోయింది ఇక్కడికి గానీ వచ్చిందేమో మీకు తెలుసుంటుందని" ఆగాడు.

"ఇక్కడకు రాలేదే! వస్తే ఈ పాటికి మమ్మల్ని కలిసేది" అన్నాడు వెంక ట్రావు గారు.

శాంతి వాళ్ళ పిన్ని గారు ఈ

ఊళ్లోనే వుంటారుట. ఆ అడ్రసు చెబితే నేనక్కడికి వెళ్ళి వాకబు చేసాను.

"అడ్రసా" అంటూ గుర్తు చేసుకుని, "పూర్వం గవర్నర్‌పేట పోస్టాఫీసు పక్క సందులో వుండేది అక్కడ వాకబు చేయండి" అన్నాడు; సారధి రేచాడు.

వెంకట్రావు ఏదో ఆలోచించి అన్నాడు.

"శాంతి కనబడకపోతే మళ్ళీ రా బాబు. నా ఎరుకలో ఒకళ్ళిద్దరు లేడీ ఆర్టిస్టులు వున్నారు. ప్రస్తుతం వేషాల్లేక అలమటిస్తున్నారు. ఒకప్పుడు పరిషత్తుల్లో ఉత్తమ నటులుగా వచ్చిన వాళ్ళే"

"తప్పకుండా" అనేసి సారధి గవర్నరు పేట బయలు దేరాడు.

సారధికి బెజవాడ కొత్త. పైగా శాంతి పిన్ని పేరు గానీ బాబయ్య పేరు గానీ తెలియదు. మధ్య తరహాగా కనిపించే ప్రతీ ఇంటి దగ్గరా ఆగి "ఇక్కడ పూర్వం శాంతి అనే నాటకాలు వేసే అమ్మాయి వుండేది...వాళ్ళ ఇంటి గుర్తు చెప్ప గలరా?" అంటూ వాకబు చేయడం మొదలు పెట్టాడు.

చాలా మంది సారధిని ఆశ్చర్యంగా చూశారు. 'నాటకాల అమ్మాయా' అని కొందరు అదో రకంగా మొహం పెట్టారు.



సారధి మరో గుమ్మం ఎక్కి లోపల తిరుగుతున్న పదేళ్ళ పాపని పిలిచాడు.

"ఎవరు కావాలి? మా నాన్న గారు ఇంట్లో లేరు" అంది పాప బయటకు వచ్చి ఇంతలో లోపల నుంచి పాప తల్లి వచ్చి "ఎవరు కావాలి" అంది.

సారధి చెప్పాడు.

వెంటనే ఆవిడ ఇదివరకు ఆ పిల్ల బంధువులు పక్క ఇంట్లో వుండే వారు.




ఇప్పుడు పడమట మారిపోయారు" అంది.

"శాంతినే మీరు గుర్తు పట్టగలరా చూస్తే"

అంత గుర్తు లేదు. ఇంతకీ ఆ అమ్మాయి మీకే మవ్వాలి ... నెల క్రితం కూడా ఒకాయన మా ఇంటికి వచ్చి శాంతి గురించీ, మొగుడి గురించీ వాకబుచేసి వెళ్లాడు" అంటూ ఎదురు ప్రశ్న వేసింది.

"హైదరాబాద్ నుంచా! ఎవరండి... పేరు గుర్తుందా?"

"మా ఆడబడుచు పై అధికారట పేరు కాంతారావు గారని చెప్పింది"

సారధి ఆశ్చర్యంగా ఆవిడ వైపు చూశాడు.

"దానికి పెళ్ళయింది. ఆ మొగుడు గాడు కూడా ఈ ఊళ్ళోనే ఏడుస్తాడు"

"అతను ఎక్కడుంటాడో తెలుసాండీ"

"బావుంది. ఆడాళ్ళం మాకెలా తెలుస్తుంది..." అనేసింది.

సారధి బయటకు వచ్చేశాడు. అతని కేం చెయ్యాలో తోచలేదు. తెలుసున్న నాటక సమాజాల వాళ్ళ దగ్గరకు వెళ్ళి తనని శాంతి భర్తగా పరిచయం చేసుకుని అడిగాడు.

"శాంతిని మీరు పెళ్ళి చేసుకున్నారా! దానికి ఇదివరకే పెళ్ళయ్యివుండాలే" అన్నాడో మహానటుడు.

"మనతో కలిసి నటించే మనిషి... ఏ చుట్టరికం లేకుండా అదీ గిదీ అనడం బావుండదేమో". సారధి అప్పటికే చాలా మంది నోటి వెంట అటువంటి పిలుపే విన్నాడు. అందరూ నటులు, దర్శకులు. కానీ ఎవరు కూడా నాటకం వేసే ఆడదాన్ని గౌరవంగా, చూడరు! మాట్లాడరు. ఆ రోజంతా తిరిగితే వృద్ధనటుడు రాజారావు శాంతి భర్త పేరూ, అడ్రసూ చెప్పాడు.

సారధి మొగల్రాజపురం వెళ్ళాడు ఓ చిన్న సందులో ఇల్లు...కానీ ఇల్లు తాళం వేసి వుంది...పక్క వాటాలో వున్న కాలేజీ స్టూడెంట్ ని అడిగాడు.

"పది రోజులయ్యింది మనిషి పత్తా లేడు..."

సారధి అడిగాడు. "జగన్ ఎటువంటి వాడు"

"తాగుబోతు, ఆవారా రకం"

"ఇంటికి ఆడపిల్లల్ని తెచ్చుకునే వాడా?"

"తెలియదు. కానీ ఈ మధ్య ఘరానాగా బట్టలు వేయడం, తిరగడం చూశాను మరి డబ్బు ఎలా వచ్చిందో ఏమో!"

సారధికి శాంతిగానీ, జగన్‌గానీ కన్పిస్తారనే ఆశ పోయింది. డీలా పడ్డ మనసుతో రైలెక్కాడు.

దారి పొడుగునా అన్నగారే గుర్తొస్తున్నాడు. కాంతారావు విజయవాడ రావడానికీ, శాంతి కన్పడకపోవడానికీ ఏదో సంబంధం వుండి వుంటుందని మనస్సు హెచ్చరిస్తోంది అతన్ని.

కాంతారావు మీద కసి, శాంతి ఏమయ్యి వుంటుందో అన్న ఆందోళన సారధిని చిత్తు చేస్తున్నాయి.

* * *

సారధి తీవ్రంగా ఆలోచించాడు శాంతి గురించి అన్నగార్ని ప్రశ్నించి లాభం లేదని అతనికి అన్పించింది. కాంతారావు తనకేం తెలియదనచ్చు అడ్డంగా అబద్ధాలు ఆడనూ గల్డు. సారధికి ఒకే మార్గం తోచింది అది సుజాతను కల్సుకోవడం.

సారధి అప్పటికి సుజాతని చాలా సార్లు చూశాడు అన్నగారితో కలిసి తిరుగుతోన్నప్పుడూ, ఒంటరిగానూ కూడా.

అందుకే ఉమెన్స్ హాస్టల్‌కి వెళ్ళి సెక్రటరితో చెప్పాడు.

"సుజాత గారితో మాట్లాడాలి ఓ సారి పిలిపించండి" అని.

సారధిని గెస్ట్ రూమ్‌లో కూర్చోమని

సెక్రటరీ సుజాతకి కబురు చేసింది. సుజాత వచ్చింది...ఆఫీసుకు వెళ్ళే ప్రయత్నంలో వుంది.

"మీతో కొంచెం మాట్లాడాలి నా పేరు సారథి" అన్నాడు.

సుజాత సారథిని పరకాయించి చూసింది.

"మీకు తేలిగ్గా అర్థమవ్వాలంటే నేను కాంతారావుగారి తమ్ముణ్ణి"

సుజాత మొహం వెలవెల బోయింది. "ఎందుకొచ్చారూ" అంది భయం దాచుకుంటూ.

సారథి సుజాతను గమనిస్తూనే వున్నాడు.

"అన్నయ్య నన్ను పంపలేదులెండి" అనేశాడు.

సుజాత మాట్లాడలేదు.

"మీ వ్యక్తిగత విషయాలు మాట్లాడ్డానికి నేనిక్కడకు రాలేదు. మనం... చూడండి, మనకి తెలియకుండానే ఎన్నో పొరపాట్లు చేస్తాం. వాటివల్ల మనకన్నా ఎదుటివాళ్ళే ఎక్కువ నష్టపోతారు. ఒక్కొక్కసారి ఆవేశంలో, ఆనందంలో కూడా మనిషి రాక్షసుడవుతాడు. ఆశ్చర్యం వేస్తుంది తల్చుకుంటే" సారథి ఆగి సుజాత మొహంలోకి చూశాడు.

"శాంతి గురించి మీకు తెల్సుననుకుంటాను".

"శాంతా!"

"నాటకాలు వేసే అమ్మాయి... మీ ఊళ్ళో మీ ఇంటిపక్కన వుండేది"

"ఓ"

"ఆ అమ్మాయి నా భార్య... మీకు బహుశా తెలుసుండదు"

"నాకెలా తెలుసుంది లెండి"

"తెలియకపోతే ఫరవాలేదు. మీరు తెలిసే శాంతికి ద్రోహం చేశారంటే నేను నమ్మలేకపోతున్నాను. మీరుగాక మా అన్నయ్యకి శాంతి మాజీ భర్త గురించిన సంగతులు ఎవరు చెప్పివుంటారా అని ఆలోచిస్తే నాకు ఎవరూ గుర్తురావడంలేదు. కాంతారావు బెజవాడలో మీ అన్నగారింటికి వెళ్ళడం, శాంతి గురించి వాకబు చెయ్యడం...ఇందులో మీ ప్రమేయం..."

"బావుంది నాకేం తెలియదు" అంది గబగబా.

"తెలియదండీ... మీకేం తెలియదు. మీకు తెలిసిందల్లా మనుషులతో ఆడుకోవడం. మీరూ ఉద్యోగస్తులు. మర్యాదస్తులు. మీకన్నా చాలా తక్కువ స్థితిలో వున్న ఓ అమ్మాయి తన బ్రతుకు బాగు చేసుకుంటూంటే మీకెందుకుకన్నుకుట్టాలో నాకర్థం కావడంలేదు"

సుజాత తలవంచుకుంది.

"పోనీ ఒక్క విషయం చెప్పండి. శాంతి కనబడ్డంలేదు. మా అన్నయ్య శాంతి గురించి మీకేం చెప్పలేదా? అబద్ధం ఆడ్డానికి మాత్రం ప్రయత్నించద్దు..."

సుజాత ఊపిరి తీసుకుని అంది. "ఆయన బలవంతంచేస్తే శాంతి గురించి చెప్పాను. కాంతారావుగారు జగన్‌ని కలిశారు. వాళ్ళు ఏం మాట్లాడుకున్నదీ, ఏం జరిగిందీ నిజంగా నాకు తెలియదు"

"వెళతాను, థాంక్స్"

"మీరు..." సుజాత ఏదో చెప్పబోయింది. అప్పటికే సారథి హాస్టల్ దాటి బయటకు వెళ్ళిపోయాడు.

సుజాత బొమ్మలా చూస్తూ వుండిపోయింది.




సుజాత సోఫాలో పడి ఏడుస్తోంది! సుజాత అన్న శివరావు, వదిన శారదా చెరో కుర్చీలో కూర్చున్నారు!

శివరావుకు చెల్లెల్ని ఎలా ఓదార్చాలో తెలియడం లేదు. శివరావు స్వతహాగా చాలా మెతక మనిషి, చిన్నప్పటి నుంచీ కూడా! చెల్లెలి పెళ్ళి అవడం, చెల్లెల్ని భర్త వదిలేయడం అతనికి చాలా రోజులు ఆశ్చర్యంగా, బాధాకరంగా వుండేది. అతను ఎవరేది చెప్పినా నమ్ముతాడు, కన్నీళ్ళు ఎవరు కార్చినా కరిగిపోతాడు. లోకంలో చెడ్డవాళ్ళుంటారనీ, దగా మోసం నిలువెత్తు లేచి, తాండవమాడే రోజులన్నా అతనికి అంతగా అర్థం కావు. చెల్లెల్ని భర్త వదిలేశాడు. చెల్లెలికి సంసారం లేదు. ఆ ఊహతో అతనికి చాలా రోజులు నిద్ర పట్టేది కాదు. సుజాత హైదరాబాద్‌లో ఉద్యోగం చేసుకుంటూ ఒక్కతీ వుండడం అతనికి అదోలా వుండేది. కానీ శివరావు భార్య శారద చాలా తెలివైంది. సుజాత కొంచెం తెగింపు మనిషని ఆమెకు అనుమానం. అందుగురించి ఆమెకు భయం, బాధల కన్నా సుజాత తమకి గుదిబండ కాకూడదని ఆమె ఆలోచన చేస్తూ వుండేది. ఆడపడుచు ఏదో విధంగా తమకి దూరంగా వుండాలి తప్ప ఆమె బరువు బాధ్యతలు తమ నెత్తిన పడకుండా వుండాలని ఆశపడుతూ వుండేది. సుజాత అర్జంటుగా రమ్మనమని ఉత్తరం రాస్తే శివరావు ఒక్కడూ వెళ్ళి సమస్యని ఎక్కడ జటిలం చేస్తాడోనని తనూ వెంట బడి వచ్చింది.

సుజాత మీద లేని ప్రేమ నటించి ఆమె దగ్గర నుంచి అన్ని సంగతులూ ఆరా తీసింది. సుజాత, కాంతారావు అనే అతని వలలో పడి మూడోనెల గర్భిణీతో వుందని తెలియగానే శారదకి ముందు కాళ్ళూ చేతులూ ఆడలేదు. కాంతారావు ఎవరో, ఏం చేస్తాడో ఎక్కడ వుంటాడో అన్నీ నెమ్మదిగా సుజాత నుంచి తెలుసుకుంది.

శారద తనూ తన సంసారం రోడ్డున పడబోతున్నట్టుగా విలవిల్లాడి పోయింది. సుజాతని ఓదార్చి జాలిపడి తమతో తమింటికి తీసుకుపోయి ఆమె భారాన్ని మోయడం ఇష్టం లేదు. అందుకే శివరావుని ఎంత రెచ్చగొట్టాలో అంతా రెచ్చగొట్టింది. కాంతారావు మీద దాడి చేయమంది. పెళ్ళి చేసుకోకపోతే కోర్టుకి వెడతామని బెదరించాలని సలహా చెప్పింది. చెల్లెలి బ్రతుకు పాడుచేసిన వాణ్ని ఉపేక్షించకూడదంది. నాలుగు గంటలు శివరావుకి బ్రెయిన్ వాష్ చేసి యుద్ధ వీరుడిలా తయారు చేసింది.

"నీకేం భయం లేదు. అన్నిటికీ మీ అన్నయ్య ఉన్నారు. నేనూ, మీ అన్నయ్య ఆ కాంతారావు ఇంటికి వెడతాం. బాధ పడకు"

. శివరావు నెమ్మదిగా అన్నాడు. "నేనున్నాను, ఏడవకు" అని.

శారద అదే వేడిలో భర్తని తీసుకుని

సుబ్బరామయ్య గారింటి మీద మెరుపు దాడి చేసింది. వాకిట్లోకి వెళ్ళగానే శారదకి లక్ష్మమ్మగారు కనపడింది.

"ఎవరూ?" అంది లక్ష్మమ్మగారు.

"మీ కోడలు ఆడపడుచుని"

"మా కోడలా?" అంది లక్ష్మమ్మగారు కొత్తగా చూస్తూ శారదని.

"అవునమ్మా... మీ కాబోయే పెద్ద కోడలు సుజాత ఆడబిడ్డని" అంది.

లక్ష్మమ్మగారు ఆశ్చర్యపోయింది.

"అవునండీ అమ్మమ్మగారూ...మా ఖర్మ కాలి ఇలా మమ్మల్ని మేం పరిచయం చేసుకోవల్సి వచ్చింది. మీ పెద్దబ్బాయే మమ్మల్ని ఇంటికి ఆహ్వానిస్తే ఈగొడవ వుండకపోను"

లక్ష్మమ్మగారికి కాళ్ళూ చేతులూ అడ లేదు.

శారద శివరావుని మొగుడిగా పరిచయం చేసింది. ఆపైన అంది-

"ఇప్పుడు చెప్పండి పెళ్ళి ముహూర్తం ఎప్పుడు పెట్టిస్తారో! మా సుజాత అసలే మామూలు మనిషి కూడా కాదు. ఏ మాత్రం ఆలస్యం అయినా దాని బ్రతుకూ, మన బ్రతుకులూ బజార్న పడతాయి"

"నాకేం అర్థం కావడం లేదు."

"ఇందులో అర్థం కావడానికేంలేదు. మీ పెద్దబ్బాయీ, మాసుజాతా స్నేహితులయ్యారు. ఆయనగారేమో దాన్ని పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చారుట."

"వాడికి ఇదివరకే పెళ్ళిఅయిందమ్మా"

"ఆ విషయం కూడా ఆయనే చెప్పార్ట మా సుజాతతో. భార్యని వదిలేశాననో, వదిలేస్తాననోఅన్నార్ట. ఆ తంతు ఇంకా పూర్తికాలేదా?"

లక్ష్మమ్మగారికి కాళ్ళూ చేతులూ అడ లేదు. పూజగదిలో భర్త, వంటగదిలో కోడలు ఆమె కళ్ళల్లో కదులుతున్నారు.

"మీ వారు ఇంట్లో లేరా?"

"ఉన్నారు" నీరసంగా అంది.

శారద శివరావుని చూసి "మీరు లోపలికి వెళ్ళి మాట్లాడండి. వెళ్ళండి. నన్ను రమ్మంటే నేనూ వస్తాను."

"నే వెడతానులే" శివరావు లేచాడు.

"మొహమాటం ఏంలేదు. గట్టిగా చెప్పండి. ఇది చావు బ్రతుకులు సమస్య. ఏం అనుకున్నారో!"

శివరావు లోపలికి వెళ్ళాడు.

ఇంతలో వంట గదిలోంచి అరుంధతి వచ్చింది. శారద అరుంధతిని చూసింది. అరుంధతి ఎవరయి వుంటుందో యిట్టే ఊహించింది కూడా.

అరుంధతి శారదని కొత్తగా చూసింది.

"నా పేరు శారద. నేను సుజాత ఆడబిడ్డని."

లక్ష్మమ్మగారు వెంటనే "అవన్నీ ఎందుకులే అమ్మా."

"చెప్పనివ్వండి. ఏం లేదమ్మా నువ్వు బాధ పడతావు వింటే! నిజమే! కానీ మా బాధ ఎవరు తీరుస్తారు చెప్పు. మీ ఆయన నీకు సవితిని తేబోతున్నాడు. మేం వచ్చింది రాయబారానికి." అరుంధతి ఏం మాట్లాడ లేదు.

"ఉద్యోగం చేసుకుంటోంది కదా అని మేం సంతోష పడ్డాం. అంతేగానీ ఇలా జరుగుతుందను కోలా! ఈరోజుల్లోఇదికూడా తప్పుకాదేమో! భర్త తనని కాకుండా మరో పిల్లని పెళ్ళి చేసుకున్నా ఓర్చుకోవడం మంచి తనానికి నిదర్శనమేమో!"

"మీరేమంటున్నారు?"

"మీవారి గురించి."

అరుంధతి ఆ తగారి వైపు చూసింది. ఆవిడ మొహంలో నీరసం దైన్యం కన్పిస్తున్నాయి. శారదని చూసి అంది.

"రండి, లోపల కూర్చుని మాట్లాడుకుందాం"

"మావారు వచ్చారు. మీ మామగారితో మాట్లాడు తున్నారు."

"దానిదేముంది రండి."

శారద కుర్చీలోంచి లేచి అరుంధతి వెనకే వెళ్ళింది. అర క్షణం తర్వాత వీధి లోంచి వచ్చిన కాంతారావు తనగది వరకూ వెళ్ళి లోపల పరాయి మనిషి వుండడం చూసి, వాకిట్లోకి వచ్చి తల్లి దిగాలుగా వుండడం చూసి తండ్రి గది వరకూ వెళ్ళాడు. వాకిలి వైపు మొహం పెట్టుకుని కూర్చున్న శివరావు కన్పించాడు. కాంతారావుకి షాక్ తగిలినట్ట య్యింది.

"మా పరువు బజార్న పెట్టద్దు. ఎంత డబ్బు కావాలన్నా ఇస్తాను. వాడ్ని వదిలేయండి."

"మా చెల్లాయి బ్రతుకుని రూపాయల్లో కొలవకండి. ఇది న్యాయంకాదు."

"వాడికి పెళ్ళాం వుందండీ చావలేదు."

"మీ అబ్బాయి కాదంటే మా చెల్లాయి బ్రతకదు మరి."

"నేను ఒప్పుకోను."

"మేం అంత తేలిగ్గా వదిలి పెట్టం. కోర్టుకి లాగుతాం"

కాంతారావుకి అయోమయంగా వుంది. తలంతా విద్యుత్ ప్రసారం జరుగుతోంది. తనింత కాలం దాచి పెట్టిన నిజం కళ్ళ ముందు నగ్నంగా కనబడుతూంటే దిక్కులు చూస్తూ నుంచుండి పోయాడు.

అరుంధతి తలవంచుకుని కూర్చుంది మంచం మీద.

సారధి కుర్చీలో కూర్చున్నాడు. క్షణం ఎవరూ మాట్లాడలేదు.

"ఏం చెప్పింది నచ్చలేదా ?"

"నువ్వు చెప్పింది కథల్లో జరుగుతుంది. మనుషులు ఎక్స్ట్రీమిటీస్‌కు వెళ్ళి ప్రవర్తించడం ....." అరుంధతి ఆగి పోయింది.

సారధి నవ్వేశాడు చిన్నగా, ఆ పైన అన్నాడు

"నే చెప్పింది బాగా అర్థం చేసుకో వదినా! అన్నయ్యకి బుద్ధి రావాలంటే ఈ సమయంలో అలానే చెయ్యాలి. ఇంట్లో భార్య వుండగా పై పిల్లతో చట్టవిరుద్ధమైన సంబంధం పెట్టుకున్న నేరానికి శిక్ష పడ్డం ఒక మార్గం.. నాటకం రక్తి కట్టాలంటే నువ్వు అడ్డురానని నమ్మింది సుజాతని పెళ్ళి చేసుకున్న తరువాత నువ్వు కోర్టుకి వెళ్ళడం...దెబ్బతో దారికి వస్తాడు పెద్ద మనిషి"

అరుంధతి నీరసంగా నవ్వేసింది.

"ఆయన మెట్టు మెట్టుగా దిగజారారు. ఆ విషయం నాకు తెలుసు. నాకు కాకుండా పోయిన మనిషి ఎలా పోతే నాకెందుకు ? కష్ట తీసుకోవడం, కోర్టులకు వెళ్ళడంతో ఆయన కళ్ళు తెరుచుకుంటాయంటే అదీ అపనమ్మకమే ?"

"నీ మంచితనాన్ని అర్థం చేసుకునే తత్వంలేని మనిషికి చురక తగలాలి వదినా ! రేపు పొద్దున్న సంఘం మాట వదిలెయ్యి, మనిళ్ళల్లోనయినా ఏ భర్తా ఇలా దొంగదాటు సంసారం చేయకుండా వుండాలి."

అరుంధతి క్షణం ఆగి అంది.

"నీకు తెలియదు సారధీ.. నిన్న రాత్రి మీ అన్నయ్య నాతో కాళ్ళ బేరానికి దిగారు. ఎంత దిగజారి పోయారంటే 'సుజాతని పెళ్ళి చేసుకుంటాను. నీకు ద్రోహం చెయ్యను... నా పరువు కాపాడంటూ..." సారధి వింటున్నాడు.

"సారధీ! ఆ మనిషిని చూస్తే నాకు జాలీ, అసహ్యం రెండు కలిగాయి. ఆ తరువాత నా అదృష్టం మీద అసహ్యం పుట్టింది. నేనంటే ఇష్టంలేని మనిషికి నేను పేరుకు భార్యననే గౌరవంతో బ్రతకడం, ఈ ఇంటి చూరు పట్టుకు వేళ్ళాడ్డం అవివేకం అన్పించింది. ఆలోచించు. భర్తగా ఆయన నాకు ద్రోహం చేశాడు. ప్రియుడుగా సుజాతని ఆదరించగలరేమో! అందుకే నేను విడాకులు యివ్వడానికి నిశ్చయించుకున్నాను."

సారధి ఆశ్చర్యంగా చూశాడు.

"మొదట తను విడాకులు ఇస్తానన్నారు. దగా పడ్డదీ, మోస పోయిందీ నేను కాబట్టి నేనే విడాకులు ఇస్తానన్నాను. నా కన్పించింది మీ అన్నయ్యకి ఈ శిక్ష చాలని!"

సారధికి ఏం మాట్లాడాలో తెలియలేదు. వదినవైపు చూశాడు తల్లి దండ్రులు కుదిర్చిన సంబంధానికి ఇష్టపడి, తాళి కట్టిన వాడితో నడిచి వచ్చిన ఓ ఆడపిల్ల – భర్త తనని ప్రేమించడం లేదనీ, ఆదరించడనీ తెలిసే ఏం చెయ్యాలి కన్నీరు మున్నీరుగా ఏడిస్తే జీవితం వసంతం వైపు మలుపు తీసుకుంటుందా? చీదరించుకునే భర్త పాదాల్ని కడుగుతూ కాలి తన్నులు తింటూ ఓర్పుతో జీవిస్తే ఎన్నాళ్ళకి ఆమె బ్రతుకులో కొత్తరాగాల మాలికకు శృతి కలుస్తుంది? ఏమో! జీవితకాలం సరిపడవచ్చు. జీవితం పరిసమాప్తం కూడా అవచ్చు.

భర్త ప్రవర్తనలో మార్పు కోసం చూసి ఆ మార్పు రానప్పుడు భర్త నుంచి విడిపోవడం ఈనాడు అరుంధతి చేస్తోంది! అదీ భర్తని–విజేత అయిన రాజు పరాజితుడికి క్షమాభిక్ష పెట్టినంత తేలిగ్గా!

అయితే అరుంధతి ముందు బ్రతుకు ఎలా సాగుతుంది! చటుక్కున సారధికి శాంతి గుర్తొచ్చింది. శాంతి బ్రతుకులాగే వదిన బ్రతుకు కూడా ఒక విషపుమలుపు తీసుకుంటోంది! వదిన శాంతిలా ప్రవర్తించగలదా? శాంతికి వచ్చిన అవకాశం లాంటిది వదినకు వస్తుందా?

శాంతికి వచ్చిన అవకాశం!! సారధికి కళ్ళు చెమ్మగిల్లాయి. ఆలోచనలు శాంతి వైపు పోతున్నాయి. మెరుపులా తన జీవితంలోకి ప్రవేశించి–అంతలోనే మాయమయ్యింది. శాంతి ఎక్కడికి వెళ్ళి వుంటుంది! పోనీ ఉత్తరంఅయినా ఎందుకు రాయలేదు!

ఏ పరిస్థితిలో వెళ్ళి వుంటుంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్"?

"ఏంలేదు వదినా"

"సరే...నేను రేపు పొద్దున్నే మద్రాసు వెడతాను. కానీ ఒక విషయం. ఈ విషయాలేం మీ అమ్మగార్కి చెప్పకు! సరేనా..."

"అలాగే"

సారధి కుర్చీలోంచి లేచాడు.

"అయితే శాంతి కబుర్లేం తెలియలేదా?"

"లేదు వదినా"

"పోలీసు కంప్లయింట్ ఇవ్వలేక

పోయావా ?"

"అదీ చేశాను"

"కన్పిస్తే మాత్రం అడిగానని చెప్పు"

"అలానే". సారధి లేచాడు.

అరుంధతి మరిది వెళ్ళడంతో వీధి తలుపు వేసి తన గదంతా ఓసారి చూసు కుంది. ఆమెకి దుఃఖం ఆగిందికాదు–

మంచంమీద పడుకుని ఏడ్వడం మొదలుపెట్టింది.

* * *

శాంతి జ్వరంతో మంచంమీద పడు కుంది. నాలుగు రోజులుగా పీడించి మరీ వదిలిపెట్టింది. ఇంకా వంట్లో నలత, నీరసం పోలేదు. టీపాయ్‌మీద సీసాలో రంగునీళ్ళు, పక్కనే మందుగోలీలు.



పూట్లాడ్డానికి, పలకరించడానికి నా అన్న వాళ్ళు లేనిచోటు. గది దాటి బయటకు వెడితే వీధి. వీధి దాటితే మహానగరం. తను ఏకాకి.

శాంతికి కన్నీళ్ళు ఆగలేదు.

జగన్ బలవంతగా టాక్సీలో పడేసి మద్రాసు తీసుకువచ్చినప్పుడు – తన జీవితంలో ఈ క్రూరమైన మలుపు మళ్ళీ ఎందుకు వస్తోందో ఎంత ఊహించినా అర్థం కాలేదు.

జగన్ తనమీద ప్రేమతో ఈ పని చేశాడంటే ఆమెకు నమ్మబుద్ధి కావడం లేదు. జగన్‌కి ప్రేమ అంటే అర్థం తెలియదు. అలాంటి మనిషి తననెందుకు తీసుకువచ్చినట్టు? ఇన్నేళ్ళ తరువాత తన సహచర్యం అతనికెందుకు అవసరం అయ్యింది. వచ్చిన మర్నాడు అడిగింది.

"నేను ఏమయిపోయానో నీకిన్నేళ్ళూ అవసరం లేకపోయిందికదా? ఈవేళ ప్రేమ పుట్టుకొచ్చిందా?"

"ఆ..."

"ఎందుకట.నీకుఒకఆడదానితోసంసారం చేయడం, కష్టపడి సంపాదించి పెళ్ళాన్ని పోషించడం తెలుసా?"

"నువ్వు రెండు చేతులా సంపాదించు. అది చాలు మనిద్దరికీ..."

"నావల్ల కాదు. నేను నాటకాలు మానేశాను."

"పోనీ సినిమాలో వేషాలు వేయి"

"నాకిష్టంలేదు."

"నా పెళ్ళాం నాటకాల్లో వేషాలేసినా, మరే రకంగా గడించినా ఫర్వాలేదే. పెద్దోళ్ళ పెళ్ళాలు ఎన్ని రకాలుగా గడిస్తుండారని. ఆళ్ళకన్నా గొప్పదానివా నువ్వు."

శాంతికి ఏడుపు వచ్చింది. "నేను హైదరాబాద్ వెళ్ళిపోతాను" అంది.

"ఆడిదగ్గరకా—"

"ఆ..."

"ఆడిదగ్గరకు ఎళ్ళావంటే మక్కెలిరగదన్నాను."

శాంతికి తను బందిఖానాలో ఉన్నానని అర్థమయింది.జగన్ ఇంట్లో లేని సమయం చూసి సారథికి ఉత్తరం రాసింది. నాలుగు ఐదురోజులు – వారం పది రోజులు గడిచాయి. జవాబు రాలేదు. శాంతికి ఏం చెయ్యాలో తోచలేదు. మాలతి మద్రాసులోనే వుంది. కానీ అడ్రసు తనకి తెలియదు.

ఒక్కొక్కసారి హైదరాబాద్ పారిపోవాలనిపిస్తుంది. దొంగతనంగా వెళ్ళొచ్చు కానీ...కా...నీ...

సారథి పూర్వంలా తనని ఆదరిస్తాడా? ఏమని తిరిగి తను సారథితో వుంటుంది. సంఘం దృష్టిలో తను జగన్ భార్య. సారథి తనని భార్య అన్నా దానికి దాఖలా లేదు.

శాంతి మంచం మీద పొర్లుతూ వుంది. సాయంత్రం జగన్ తనకూడా ఎవర్నో తీసుకువచ్చి–

"లే, లెగే! ఎవరొచ్చారో చూడు– పెద్ద నాటకాల డైరక్టర్ నిన్ను చూద్దామని వచ్చాడు" అన్నాడు. శాంతి మంచం మీద లేచి కూర్చుంది.

"దణ్ణం ఎట్టు"

"నమస్కారమండీ"

"చూ డ మ్మా! జగన్ నీ గురించి చెప్పాడు. నిన్ను చూడగానే నేనూ పోల్చుకున్నాను. హైదరాబాద్‌లో నీ నాటకం ఒకటి చూశాను. మా ఆఫీసు వాళ్ళు ఒక నాటకం తయారు చేస్తున్నారు. నువ్వా వేషానికి సరిగ్గా సరిపోతావ్"

"వేస్తుందండీ! నాటకాలేంటి సినిమా ఛాన్సు వచ్చినా సరే మాకేం అభ్యంతరం లేదు"

శాంతి మాట్లాడలేదు.

"జగన్‌కి అడ్వాన్సు ఇచ్చాను. రేపు మాంబళంలో రిహార్సల్స్ ఉంటాయి. నీకు నీరసం తగ్గేవరకూ రీడింగ్ చేద్దాం"

"అట్టానే" అన్నాడు జగన్.

డైరక్టర్‌ను వెళ్ళనిచ్చి శాంతి అంది. "నన్నెందుకిలా చంపుతావు? నీకు అర్థం కాదేం?"

"ఏంటి నాటకాలు వెయ్యవా? ఉట్టినే తిని కూర్చుంటావా? సంపాదిస్తే తప్పేటి"

శాంతి చిరాగ్గా జగన్‌ని చూసింది.

"నీకు తెలవదే!నువ్వు బంగారుబాతువి. నువ్వు నాటకాల్లో వేషాలేసే డబ్బు...నా పెళ్ళాన్ని నేను ఏలుకుంటే కూడా నాకు డబ్బిచ్చే వెర్రి జనం వుంటారు. అలాంటోళ్ళని భగవంతుడు చల్లగా చూడాలి"

"ఎవరు నన్నేలుకుంటే నీకు డబ్బిచ్చేది"

"ఏం లేదులే నవ్వుతాలకి అన్నాను"

* * *

శాంతి రిహార్సల్స్‌కి వెళ్ళింది. నలుగురైదుగురు యువకులు నాటకం పుస్తకాలు ముందర వేసుకుని పోర్షన్స్ చదువుతున్నారు. శాంతిని చూడగానే వాళ్ళు కాసేపు రీడింగ్ ఆపుజేసి మౌనంగా వుండిపోయారు. ఇంతలో డైరక్టర్ వచ్చాడు. వస్తూనే శాంతిని చూసి "వచ్చావా" అంటూ ఏకవచనంలో సంభోదించి అక్కడ వున్న వాళ్ళందర్నీ పరిచయం చేశాడు. ఆ తర్వాత తనలో తనుగా అన్నాడు.

"హీరోగారు ఇంకా రాలేదా"

"రాలేదు"

"సరే మనం మొదలు పెడదాం" అని నాటకం పుస్తకం తీసి శాంతికి టూకీగా కథ చెప్పి శాంతి వేయబోయే పాత్రా, దాని ప్రాధాన్యం వివరించాడు. పది నిమిషాల్లో హీరో వేషధారి వచ్చాడు.

"ప్రసాద్ ఇంత ఆలస్యమా, రా నీ గురించే చూస్తున్నాం. ఈవిడే మన హీరోయిన్ వేషం వేసే నటి...పేరు శాంతి. ఈవిడ హైదరాబాద్‌లో, ఆంధ్రాలో చాలా పరిషత్తుల్లో ఉత్తమ నటిగా వచ్చారు... ఈవిడ భర్త కూడా మంచి నాటకాభిరుచి ఉన్నవాడు" అనేసి శాంతిని చూసి, "జగన్ రాలేదా రిహార్సెల్స్‌కి" అడిగాడు.

శాంతి ప్రసాద్ వైపు చూసి కళ్ళు దించుకుంది. ప్రసాద్ ఆమెకి బాగా గుర్తుకూడా...కాదు పరిచయం. మాలతి తమ ఇంట్లో ఉండగా రోజూ వచ్చేవాడు. తను ఎవరో, తనకి సారధికి వున్న పరిచయం ప్రసాద్‌కి తెలుసు!

శాంతికి మనసంతా దేవినట్టుగా వుంది. చుట్టూతా జనం పోర్షన్స్ చదువుతూంటే మరో దారిలేక తనూ చదవడం మొదలు పెట్టింది. నాటకం రీడింగ్ అయ్యేసరికి రాత్రి 9 గంటలయింది.

"ఈ రోజుకు చాలు" అన్నాడు డైరక్టర్.

అందరూ బయలు దేరారు ఇళ్ళకి.

"నువ్వెట్లా వెడతావు" డైరెక్టర్ శాంతిని అడిగాడు.

"రిక్షామీద ఇంటికి వెడతాను."

"ఒక్కర్తివీ వెళ్ళగలవా?"

"నేను ఎలాగూ వెడతానుగా. ఆవిణ్ణి వాళ్ళ ఇంటి దగ్గర దించి వెడతాను లెండి" అని ప్రసాద్, "మీకేం అభ్యంతరం లేదుగా." అన్నాడు

"లేదులెండి."

ప్రసాద్, శాంతి స్కూల్ బిల్డింగ్ వదిలి బయటకు వచ్చారు. ఇద్దరూ బస్ స్టాప్ వరకూ నడిచారు. శాంతి దూరంగా చూస్తూ నిలబడింది. ప్రసాద్ ఓ క్షణం ఆగి, "నన్ను గుర్తుపట్టారా, మాలతి భర్తని మీరేమిటి..." ఏమనాలో తెలియక ఆగిపోయాడు.

"అంత త్వరగా మిమ్మల్నెలా మర్చిపోతాను."

"అదే నాకూ అర్థం కావడం లేదు. నెల క్రితం సారధి మాకు ఉత్తరం

రాశాడు. మేం, మీరు తీసుకున్న నిర్ణ యానికి భయపడ్డా చాలా సంతోషించాం. ఇంతలో ఏమయ్యింది. మీ మధ్య గొడవలే మన్నా జరిగాయా? మామగారూ వాళ్ళూ ఏమన్నా అన్నారా?" గబగబా అడిగాడు.

"అదేం కాదు. ఇదంతా నా కర్మ."

"కర్మంటే నాకేం అర్థం కావడలేదు."

"ఏం చెప్ప మంటారు."

"జరిగింది చెప్పండి. ఇంతకీ జగన్ ఎవరు ? డైరెక్టర్ చెప్పాడే అతను?"

శాంతికి అప్పటికే గుండెలు చీల్చుకుని ఏడుపు వస్తోంది. అన్ని రోజులుగా దాచి పెట్టుకున్న బాధ ద్వారాలు తెరుచుకుని బయట పడ్డట్టుగా ఒక్కసారి వుప్పొంగింది. సన్నగా ఏడుపు మొదలు పెట్టింది.

ప్రసాద్‌కి ఏమీ అర్థం కాలేదు. శాంతి వైపు ఆశ్చర్యంగా చూశాడు.

శాంతి ఏడుపు ఆపుకొని జరిగింది టూకీగా చెప్పింది.

"ఇప్పుడు చెప్పండి. నేనేం చెయ్యాలి. అతను నన్ను శాసిస్తున్నాడు. అలాగని ఎక్కడికైనా పారి పోదామన్నా - పారి పోయి మాత్రం ఏంచెయ్యగలను చెప్పండి. నాకు చేతనయ్యిందీ పొట్ట పోషించుకో గల్గిందీ ఈ వృత్తిలోనే! నా జీవితం ఇలానే వెళ్ళాలేమో!"

"ఛాఛా, అలా అనుకోవద్దు. మేం అంతా ఉన్నాం మీకేం భయంలేదు."

"భయం కాదండీ. విరక్తి పుట్టింది."

ప్రసాద్ అన్నాడు. "నేను సారథికి రేపే ఉత్తరం రాస్తాను. లేకపోతే హైదరా బాద్ వెళ్ళొస్తాను. అక్కడికి వెడితేగాని నిజానిజాలు తెలియవు."

"వద్దండీ. ఈ పరిస్థితుల్లో ఆయనకు నేను మొహం చూపించలేను."

ప్రసాద్ నవ్వేశాడు. "ఇందులో మీ తప్పేముంది! పైగా మిమ్మల్ని తెలుసుండీ రొంపిలో వదిలేయడం నాకు నాకిష్టం లేదు. ఏదో జరగాలి. ఇంత కీడు మీకు జరగ డానికి వీలు లేదు."

"అభిమానం కొద్దీ మీ కలా అన్పి స్తోంది."

"అదేంకాదు," అనేసి ప్రసాద్ ఆలో చనగా అన్నాడు. "మీరు ఆ జగన్ ఇంటికి ఎందుకు వెళ్ళాలి. సరాసరి మా ఇంటికి వెడదాం రండి. మాలతి కూడా మిమ్మల్ని చూసి సంతోషిస్తుంది."

"మీ ఇంటికా!"

"అవును. జగన్‌తో మీకు తెగతెంపులు ఈ వేళనుంచే మొదలను కోండి."

"వద్దండీ. తొందర పడొద్దు. అన్నీ మనం అనుకున్నట్టు జరక్కపోతే ఏం చెయ్యగలం. మీరు నాకు పరిచయస్తులని జగన్‌కి తెలియడం మంచిది కాదు. ఆలో చించండి."

ఇంతలో సిటీబస్ వచ్చింది. శాంతిని బస్ ఎక్కించి ప్రసాద్ అటుగా వస్తూన్న ఆటోని ఆపి తనూ ఎక్కాడు.




"అత్తయ్యా! నేను ఈవేళ రాత్రి ట్రయిన్‌లో ఢిల్లీ వెడుతున్నాను" అంది అరుంధతి వంటింటోకి వెళ్ళి.

"ఢిల్లీయా, అంటే మీ నాన్నగారి దగ్గరకా"

"అవునండీ"

"ఇప్పుడు అంత అర్జంటుగా దేనికి. పండక్కి వెడితే వాళ్ళు సంతోషిస్తారు"

"కాదండి. వెళ్ళాలి"

అరుంధతి తల వంచుకుని నుంచోడం చూసి——

"అలా పీట వాల్చుకు కూర్చో, నీతో మాట్లాడాలి" అని తలుపు దగ్గరగా వేసి, "చెప్పు, ఆ బజారువాళ్ళు వచ్చి అల్లరి చేశారని వెడతానంటున్నావు కదూ?" అంది లక్ష్మమ్మగారు.

అరుంధతి మాట్లాడలేదు.

"కాంతిగాడిమీద కోపంతో వెడితే నీకు లాభం ఏమిటి చెప్పు? మనం ఆడ పుట్టుక పుట్టాం. మర్చిపోవాలి. ఒకవేళ రెచ్చిపోయి మగవాడితో సమానంగా ఘర్షణపడితే నష్టపడేది..."ఆవిడే తిరిగి అంది.

"మీరంతా చదువుకున్నారు. మాలా ఉండమంటే వుండలేరు. అరుంధతీ! ఇలాంటివి నా బ్రతుకులో ఎన్నోసార్లు చూశాను. మీ మామగారు నెలల తరబడి కన్పించేవారు కాదు. ఒక్కొక్కసారి నూతిలో పడదామనుకునేదాన్ని. పిల్లలు సంసారం చూసి రాయిలా మారాను. చెప్పు చదువుకున్నదానివి. వాడితో సర్దుకు పోలేవా? ఈ గొడవలోంచి వాడ్ని బయటకు లాగడానికి ముఖ్యాధారం నువ్వే? నువ్వే లేకపోతే వాడికి మరెంత స్వేచ్ఛ దొరుకు తుంది"

అరుంధతి తల వంచుకుని అంది.

"అత్తయ్యా! మీ తరంవాళ్ళు అదృష్ట వంతులు. సంఘం ఇప్పటిలా అప్పుడు విస్తృతంగా ఎదగలేదు. భర్తని పూజించడం తప్ప, భర్తకి భయపడ్డం తప్ప వేరే విషయాలు మీకు తోచేవి కావు. కానీ, ఈవేళ భర్తంటే దేవుడే కాదు. దేవుడ్ని తలదన్నగల స్నేహితుడిగా చూడాలనుకుంటుంది. నా తప్పులేనప్పుడు నన్ను శిక్షించడానికి మగవాడికేం అధికారం వుందని నేను ఆలోచిస్తున్నాను. చుట్టూ పరుచుకున్న విజ్ఞానం, స్వాతంత్ర్యం ఇవన్నీ మరీ విడమర్చి ఆడదానికి బాసటగా నిలుస్తున్నాయి. ఇంటి పరువు కోసం భర్తతో దొంగచాటు ప్రేమ, లేని భయం నటించడం అన్యాయం, అక్రమం. నాకు తాళి కట్టారు కాబట్టి—మీ జీవితాన్ని నాతోనే పంచుకోండి అని, ప్రాధేయపడం అమాయకత్వం..."

అరుంధతి కళ్ళు నీళ్లు తిరిగాయి.

"అత్తయ్యా మీరు హద్దు దాటకుండా మీకు తోచిన సలహా ఇచ్చారు. ఇప్పుడు మా అమ్మ కూడా మీలాగే మాట్లాడు తుంది. కాదు నెత్తిన మొట్టొచ్చు 'మొగుడ్ని ఎలా కాదంటావే' అని. శాపాలు పెట్టచ్చు. కానీ నన్ను ఎంత కాలం ఇలా జీవించమంటారు, చెప్పండి. ఆయనకు భార్య అక్ఖరలేదు. భార్య ప్రేమ అక్ఖరలేదు. 'నా నుంచి సుఖం పంచుకో మనిద్దరం భార్యాభర్తలం కాబట్టి అది నీ విధి' అని ఏ భార్య భర్తని ఎలా అడుగుతుంది? అన్నీ తెలిసి కొడుకుని మీరే అడగలేరే! ఆయనకు పెళ్ళి చేయ గల్గారు. కాని శాసించగలరా అత్తయ్యా"

లక్ష్మమ్మగారు మాట్లాడలేదు.

"నువ్వు దగ్గరుంటే వాడు మారతాడే మోనని ఆశ అరుంధతీ. నాకూ తెలుసు నీ బాధ"

"నీటిలో మునిగే వరకూ ఎవరోవచ్చి రక్షిస్తారనే అన్పిస్తుంది. ఆశ అలాంటిది"

"ఏమోనమ్మా ఈ సంసారం చూసే భయం పట్టుకుంది. మీ ఇష్టం మాలతీ, సారథీ వాళ్ళ ఇష్టం వచ్చినట్టు చేసు కున్నారు. ఏదో వెలితిగా అన్పించింది. ఇప్పుడు సర్దుకున్నాను. అప్పుడప్పుడు నొప్పిలా బాధ కల్గుతుంది. ఏం చేస్తాం.. కోడలివని నిన్ను అదమాయించడం నాకు అన్యాయంగా తోస్తోంది. ఛీ ఇవన్నీ చూడ్డానికా నేను బ్రతికింది!" లక్ష్మమ్మ గారు కన్నీరు ఆపుకోలేక బావురుమంది.

"బాధపడొద్దు అత్తయ్యా నేనూ మీకో కొత్త బాధ సృష్టించి వెడుతున్నాను"

"లేదమ్మా నాకు తెలుసు వాడు మారడు"

అరుంధతి లేచి అంది. "మామగారితో చెప్పండి. పెద్దవారు ఆయనకి విషయా లన్నీ తెలిస్తే బాధ పడతారు"

"లేదమ్మా! ఆయన సంగతి నీకు తెలియదు. ఆయన కన్నా రాయినయం. బాధ పెట్టడం తప్ప బాధ అనుభవించడం ఆయనకు అలవాటు లేదు"

అరుంధతి తన గదిలోకి వెళ్ళింది. ఆ ఇంట్లోంచి కొన్ని గంటల్లో తను వెళ్ళి పోతున్నా నన్న ఆలోచన ఆమెకు సంతో షాన్ని గానీ, విచారాన్ని గానీ కలగ జేయడం లేదు. మనసు మొద్దు బారి నట్టుగా వుంది.

నాలుగేళ్ల ఆ యింటిలో కోడలుగా, స్నేహితురాలిగా మరొకసారి భంగపాటు పడిన భార్యగా, క్రోధంతో కాళికలా మరొకసారి ఏమీ చెయ్యలేని అశక్తురాలిగా ఎన్నో అవతారాలు ఎత్తింది. అత్తవారిల్లు తనకు ఖైదు శిక్షగా కూడా భావించిన రోజులు వున్నాయి. కానీ ఖైదులో కూడా మల్లెపూవు లాంటి మనుషుల్ని చూసింది. సారథీ, మాలతీ ఆ కోవలోకే వస్తారు.

వాళ్ళు సంకెళ్ళు తెంచుకుని ప్రపంచంలో పడ్డారు. ఇప్పుడు తన వంతు వచ్చింది! మన సెందుకో దాస్యానికి అలవాటుపడ్డ మూలంగా మూలుగుతుంది. సాంప్రదాయం తరాలుగా వస్తున్న సంస్కృతి మీద కాలేసి తొక్కి, ముందుకు వెళ్ళాలంటే చిన్న వణుకు కలుగుతోంది. తప్పదు. తను ఓడిపోయి వెళ్ళిందని ఎందరో నిందించవచ్చు. కానీ ఈ ఓటమి వెనక వున్నది ఓ అదర్శం. దాని వెలుతురు మిణుకు మిణుకు మంటూ నక్షత్రంలా మారి తనకి దారి చూపిస్తుందని అరుంధ తికి అనిపించింది.

బయట కాంతారావు వచ్చిన అలికిడి అయ్యింది.

"అరుంధతి వాళ్ళ నాన్న గారి దగ్గ రకు వెడుతుంది ఈ వేళ" లక్ష్మమ్మ గారు అంటోంది.

"ఢిల్లీనా ఏమిటి అర్జంటు" అన్నాడు కాంతారావు ఆశ్చర్యంగా.

"ఢిల్లీ నుంచి టెలిగ్రాం వచ్చింది"

"అరుంధతికి అత్త గారి మాటలు విని పిస్తున్నాయి. ఆశ్చర్యం వేసింది..ఎంత చక్కని అబద్ధం. అలిగి కోడలు పుట్టి ఇంటికి వెడుతూంటే అత్త గారు ఎంతో చాకచక్యంగా సంఘటనకి కొత్త రూపు ఇస్తోంది.

"అయితే వెడుతున్నావా" కాంతా రావు లోపలికి వచ్చి అడిగాడు.

"అవును"

"వెళ్ళగానే..."

"ఉత్తరం రాయను. ఏలు వెంబడి లాయర్ నోటీస్ వస్తుంది."

పెట్టను. అమ్మా,నాన్నా నువ్వు విడాకులు కోరుతున్నావని తెలిస్తే ఏమవుతారో ఆలోచించావా"

"పెళ్ళి చేసి ఓ ఇంటివాణ్ణి చేసిన




కొడుకు దారికి రాక పోతే వాళ్ళేం చేయ లేరు కదండీ. ఇంటి మీద వాళ్ళెవరో వచ్చి దాడి చేస్తే తలలు తీసుకువెళ్ళి కడుపులో పెట్టుకోలేదా? పెద్దవాళ్ళయిన తర్వాత ఈ శిక్షలు అనుభవించాలేమో.."

"ఇవన్నీ నాలుగు గోడల మధ్య జరిగాయి. కానీ..."

"సుజాతతో మీ ప్రణయం

"అయితే నా మాట వినవా"

అరుంధతి తలెత్తి కాంతారావుని చూసింది.

"ఆఖరి కోరికా"

"అనుకో"

"ఏమిటి"

ఇక్కడ వుంటే నీకేమిటి నష్టం ...

"మళ్ళీ ఆలోచించుకో నిన్ను బాధ

కూడానా..."

"నువ్వు అల్లరి చేయకపోతే ఇంట్లో కూడా తెలిసేది కాదు."

అరుంధతి నవ్వేసింది.

"నవ్వుతావు దేనికి"

"మీరెంత స్వార్థపరులండీ ... మీరు ఎంత మందినయినా నొప్పించవచ్చు. కానీ మిమ్మల్నెవరూ బాధ పెట్టకూడదు. అవమానించకూడదు"

"సంబంధం తెగిపోతోంది కదా అనా నీ ధైర్యం"

"ఇది ధైర్యం కాదు. మొండి తనం. నా బ్రతుకు పోయినందుకు నేనూ బాధ పడతా నండీ. మిమ్మల్ని కాకుండా మరె వర్నో పెళ్ళి చేసుకున్నా నా జీవితం ఎలా సాగేదో ఆలోచించండి.

"మిమ్మల్ని పెళ్ళి చేసుకుని – మీ కోసం ఎదురు చూసి చూసి నాలుగేళ్ళు జీవితాన్ని నష్టపోయాను. మళ్ళీ జన్మ ఎత్తితేగానీ నాకా నాలుగు సంవత్సరాలూ రావుగా! చెప్పండి"

కాంతారావు ఏమనుకున్నాడో గబగబా వెళ్ళి సూట్ కేస్ తెరిచి డబ్బు తెచ్చి అరుంధతి ముందు పడేసి.

"ఈ డబ్బు వుంచుకో నీ దగ్గర"

"ఎందుకూ"

"ఎందుకయినా పనికొస్తుంది"

అరుంధతి ఆ నోట్లని అటూ ఇటూ తిప్పి "మానాన్నగారిచ్చిన కట్నంలో ఇది పదో వంతు కూడా లేదు. వద్దు మీ మీద పడి తిన్నందుకు నేనే మీకు బాకీ పడ్డానేమో!"

"అవన్నీ ఎందుకులే."

"మరి మీరు డబ్బు ఎందుకు ఇస్తో



న్నట్టు."

"అర్థంకాలేదా!"

"లేదు."

"అయితే చెప్తున్నాను. విను. జాగ్రత్తగా విను. ఇంతకాలం మన మధ్య గొడవలు జరిగాయి. అయితేఅందుకు బాధ్యుణ్ణి నేనే. ఇలా ఎందరో భార్యా భర్తల మధ్య జరిగి వుండచ్చు. కానీ అందరు భార్యలూ నీలా ప్రవర్తించి వుండరు. నువ్వు నామీద కత్తికట్టావ్? ఎలాగైనా నన్ను బజార్లో పెట్టాలని చూస్తున్నావ్."...

అరుంధతి మధ్యలో అడ్డుకుని అంది. "మీరు చాలా పొరబాటు పడ్డారు. నేను భార్యగా రావడం మీ అదృష్టంగా భావించండి. నేనే అల్లరిచేసే దాన్నయితే ఈ పాటికి ఈ ఇంటిలో నరకం సృష్టించే దాన్ని. నాకు మీరివ్వని సుఖం, మీరు మరెవరికో ఇస్తోన్నందుకు మా వాళ్ళం దర్నీ పిలిపించి ఇక్కడో కోర్ట్ సీన్ క్రియట్ చేసేదాన్ని. కానీ మీకు కావల్సింది అది కాదు. నేను కిం మనకుండా ఊరుకోవాలి. భార్య చేత విడాకులు తీసుకున్న భర్తననే ఊహ మిమ్మల్ని వ్యంగ దీస్తోంది. మీరు ఇంత దిగజారారు దీన్ని భరించలేరా."

"నోర్మయ్."

"మీరు నన్ను పెళ్ళి చేసుకున్న మొదటి రోజుల్లో మీ మనసులో మాట చెప్పివుంటే మిమ్మల్ని ఆకాశానికి ఎత్తి పొగిడి వుండేదాన్ని. మీ సుఖం కోసం ఏ పనయినా చేసేదాన్ని కానీ ఇప్పుడు భార్యగా మీకా అవకాశం యివ్వలేను."

కాంతారావుకు కోపం ఆగింది కాదు. ఒక్క వుదుటున వెళ్ళి అరుంధతి పీక పట్టుకున్నాడు. అరుంధతి కాంతారావు అలా చేస్తాడని వూహించలేదు. పెనుగు

లాట మొదలు పెట్టింది.

ఆప్యాయంగా అనురాగంతో, అల్లుకు పోవల్సిన చేతులు ఆయుధాలుగా మారిన క్షణాలు అవి, ప్రేమతో హృదయాలు ఉత్తుంగ తరంగాలు లేచినవేళ భాషకందని భావాల పుష్పాల్ని దృశ్యాలుగా చిత్రించు కునే కళ్ళు మంటలు రేపుకునే సమయం అది. కాలానికీ, దూరానికీ అతీతంగా స్పందనతో దగ్గరయ్యే రెండు శరీరాలు కాల సర్పాలై విషం కక్కుకునే వేళఅది.

ఇంతలో "అమ్మా అరుంధతీ"అంటూ లోపలికి వచ్చి కొడుకు చేతిలో ఉండలు చుట్టుకుపోతూ మెలి తిరుగుతున్న కోడల్ని ఒక్క ఉదుటున పట్టుకుని, "వెధవా, వదులా అమ్మాయిని" అంటూ కాంతారావు చొక్కా పట్టుకుని గుంజి, చేతులతో విడదీసి

"ఇది ఆడది కాదు, రాక్షసి" కాంతారావు అరుస్తున్నాడు.

"నోర్మూయ్యరా."

"ఇక్కడినుంచి కదలడానికి వీల్లేదు." బయటనుంచి వచ్చిన సారధి వాకిట్లో ఎవరూ కనబడక పోవడంతో కాంతారావు మాటలు వినబడి లోపలికి వెళ్ళాడు. అక్కడి వాతావరణంతో అతనికి అర్థ మయ్యింది.

"అయితే వదినకు అన్నయ్యా వీడ్కోలు చెప్పాడన్నమాట."

"నీ కనవసరం. నువ్వు వెళ్లచ్చు"

"అన్నయ్యా నీకు తెలియదేమో. వదిన వాళ్ల వాళ్లకి ఉత్తరం రాయ లేదు. 'మా అన్నయ్య మళ్లీ పెళ్లి చేసు కుంటున్నాడు. మీ అమ్మాయిని వచ్చి తీసుకు వెళ్లమని నేను ముందే రాశాను. వదిన నాన్న గారు వాకిట్లో ఉన్నారు. వదిన విడాకులే కాదు,నువ్వు పోలీస్ కేస్ కూడా ఎదుర్కోవాలి."

లక్ష్మమ్మగారు అరుంధతి మొహం నీళ్లతో తుడిచి సేద తీరుస్తోంది.

"కొంచెం వుంటే చచ్చిపోయేది. నీకేం మాయరోగం పుట్టిందిరా. ఆ పిల్లని పెళ్ళాడు. నీ ఇష్టం వచ్చినట్లు ఊరేగు." సుబ్బరామయ్య వాకిట్లో రఘుపతి గారితో మాట్లాడు తున్నారు. ఆ మాటలు లోప లకు విన్పిస్తూనే వున్నాయి. సారధి బయ టకు వెళ్లబోయాడు.

"సారధీ! ఇలా జరిగిందని వాళ్లతో అనకు" కాంతారావు అరిచాడు.

"భేష్ అన్నయ్యా- వదిన నిన్ను వదిలి వెళ్లలేక బాధతో పడి పోయిందని చెప్తాను. ఇంకా ఎవరితో ఏం చెప్ప మంటావ్? చెప్పు? బెజవాడ వెళ్లి జగన్‌తో ఏం చెప్పమంటావ్? ఉమెన్స్ హాస్టల్‌కి వెళ్లి సుజాతకి ఏం చెప్పను? నువ్వు డెవిల్‌వి అన్నయ్యా. ఎందుకంటే మామూలు మనుషులు తమ సుఖం తాము చూసుకుంటారు. నువ్వలా కాదు. నీకు ఎవరి ఆనందం చూసి సహించే గుణం లేదు. ఎవరిలో సద్గుణాలు కన్పించినా నువ్వు తట్టుకోలేవు. ఆలోచించుకో. ఎంత మంది జీవితాల్ని నువ్వు ధ్వంసం చేశావో. ఎందుకోసం చేస్తావిలా? ఎంత కాలం చేస్తావిలా." అంటూ విసవిసా వాకిట్లోకి వెళ్ళిపోయాడు సారధి.

"నమస్కారం మామయ్యగారూ" అన్నాడు హరధి, రఘుపతిగారిని చూసి

"మంచిది బాబూ"

"ఇంత హఠాత్తుగా రావడం" సుబ్బ రామయ్య నీళ్లు నమిలారు.

"నేను వచ్చేవాణ్ణి కాను. ... మీ

సారథి ఉత్తరం నన్నిక్కడికి రప్పించింది"

సుబ్బరామయ్యగారు సారథి మొహం చూశాడు.

"అవునండి. అంతకుమించి మరో మంచిదారి కన్పడలా. మనం అనుకున్నది ఒకటయితే జరిగేది మరొకటి అవుతుంది. అంతమాత్రాన డీలా పడి ప్రయోజనం ఏంవుంది చెప్పండి. వదిన మీకు తనుగా ఉత్తరం రాయదు. ఆ విషయం నాకు తెలుసు. కానీ సడెన్‌గా వదిన మీ దగ్గరకు వస్తే మీ పరిస్థితి ఎలా వుంటుంది?"

"ఏమని వ్రాశాడండి... వీడు వట్టి కంగారు మనిషి".

రఘుపతిగారు ఏం మాట్లాడలేదు.

"నాన్నా! ఆ గదిలో వదిన అమ్మ వడిలో పడివుంది. ఆ అమ్మాయిని చూసి ఆ తర్వాత మామయ్యగారితో చెప్పవలసింది చెప్పి పంపించండి".

"ఏమయ్యింది" అంటూ సుబ్బరామయ్యగారు లోపలికి వెళ్ళాడు.

రఘుపతిగారు కంగారుగా సారథి మొహంలోకి చూశాడు.



"వదినకేం ఫర్వాలేదు. తేరుకుం టోంది".

"ఏం జరిగింది".

"భార్యాభర్తలమధ్య ఆఖరి యుద్ధం"

"అంటే..."

సారథి ఏం మాట్లాడలేదు. కాసేపు ఆగి అన్నాడు,

"మీ అమ్మాయిని సర్వలాంఛనాలతో పెళ్లిచేసి మా ఇంటికి పంపారు. వదిన జీవితం ఇంతవరకూ ఎలా గడిచిందో మనం ఇప్పుడు రివ్యూ చేసుకోవడం అనవసరం. ఆవిడ ముందు జీవితం గురించి ఆలోచించింది. ఎందుచేతనంటే వదిన మా ఇంటిలో సుఖపడలేదు."

సారథి వీధిలోకి వెళ్ళాడు. రఘుపతి లోపలికి వెడుతూంటే కాంతారావు తల వంచుకుని ఎదురువచ్చాడు.

అరుంధతి అతగారి వడిలో పడుకుని వుంది. పక్కనే సుబ్బరామయ్యగారు నుంచున్నారు. రఘుపతిగారువెళ్ళి "అమ్మా అరుంధతీ". అంటూ నెమ్మదిగా పిలుస్తున్నాడు,




సారథిని మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌లో రిసీవ్ చేసుకున్నాడు ప్రసాద్. టాక్సీలో కూర్చోగానే సారథి "ఏమిటి అర్జంటుగా రమ్మని టెలిగ్రాం ఇచ్చావ్?" అడిగాడు.

"నాకు ఒంట్లో బాగోలేనప్పుడు వచ్చి ఎంత సహాయం చేశావని? ఉండమంటే అర్జంటు పని అని హైదరాబాద్ పరిగెత్తావ్! ఏమిటీ మనవాళ్ళంతా కులాసానా, అది చెప్పు ముందు"

సారథి అరుంధతి గురించి అక్కడ జరిగిన గొడవలూ అన్నీ చెప్పి, "ఏదో రోజు ఇలా జరుగుతుందని ముందే తెలుసు. వదిన బాధ పడింది. ఏమయితే నేం ఇన్నాళ్ళకి ఆవిడకి ఖైదు నుంచి విముక్తి లభించింది" అన్నాడు.

"అరుంధతి విడాకులు తీసుకోవడాన్ని నువ్వు సమర్థించలే"

"సమర్థిస్తాను బావా. కానీ దీని వెనక ఎన్ని బాధలు, ఎన్ని మనస్పర్థలు ఉన్నాయని. ఎంత మంది ... మీదా అవుతారని? ఇవన్నీ ఎందుకొచ్చాయంటావ్"

"కర్మ అంటాను"

"కర్మేం కాదు. చేతులారా మనం చేసుకుని కనపడని దేవుణ్ణీ, విధినీ తిట్టడం అంటే పలాయన వాదం అంటాను. వదిన ఇంతకాలం కన్నీరు దాచిపెట్టుకుని ఎందుకుందంటావ్? అన్నయ్య మీద ఆశలు ఎందుకు పెట్టుకుందంటావ్? దీనికి సమాధానం...మన సాంప్రదాయం, కట్టుబాట్ల మీద వున్న మూఢ నమ్మకం... విశ్వాసం... అంతే! ఏదో అనుకోనిది ఊహించనిది జరుగుతుందన్న వెర్రి ఆశ.. వివాహం అంటే దానంత పవిత్రమైన కార్యం మరొకటి లేదని...ముక్కూ మొహం తెలియని మనుషులు, ఆలోచనల్లో, పంథాలో ఉత్తర దక్షిణ ధృవాల వాళ్ళు కింమనకుండా నోరు మూసుకుని దానికి తల వంచాలనే వెర్రి భ్రమ. అన్నయ్యకి వదిన మీద ప్రేమ లేదు.

పెళ్ళి అయిన నాటినుంచీ భార్యగా ఆమెని అంగీకరించ లేదు. అయినా భార్యగా అరుంధతి తనకి ఎదురు తిరుగుతుందని భయం. ఏదో విధంగా భార్య నోరు నొక్కి పెట్టి ఉంచాలని అహంకారం... అలా అన్నయ్య ఎందుకు చేశాడంటావ్? ఆలోచించు. సజావయిన జవాబు మనకి దొరకదు. అన్నయ్యే నిజాయితీ పరుడయితే అని ఆలోచించు. భార్యకి క్షమాపణ చెప్పి భార్య సుఖపడేటట్టు చేసి తను సుఖపడేవాడు. కానీ అలా చెయ్యలేదు. ఇక వదినలో ఏ మాత్రం తెగింపు వున్నా–గౌరవమాత్రం తీసుకోలేదు. తను ఆడదాన్నని, తన బ్రతుకేమవుతుందోనన్న భయం. కానీ ఆమెకి భర్త సుఖానికి అడ్డురావాలని ఆలోచన ఏనాడూ లేదు...భర్తగా దగ్గరవుతాడేమోనని చూసింది. మొన్న గొడవతో ఆమెకు జీవిత సత్యం తెలిసొచ్చింది. ప్రేమలేని చోట బ్రతకడం అంటే చీకటి కొట్టులో జీవించడం అని తెలుసుకుంది. అందుకే విడాకులు ఇచ్చింది అన్నయ్యకి...ఇప్పుడుచెప్పు... వాళ్ళు మన బంధువులుగాకాదు సంఘంలో మసిలే మనుషులుగా ఆలోచించి చెప్పు. ఆ ఇద్దరు మనుషులు ఇన్నేళ్ళూ ఇలా అయిష్టంగా వుండడానికి మన వివాహ వ్యవస్థ కారణం కాదా!! మూడు ముళ్ళ బంధం ఎంత గొప్పదయినా జీవితాల్ని ఇంతలా శాసించాలా?"

"అంటే పెళ్ళి లేని కాపురం – ఫక్త ప్రేమతో కలిసే జంటలు ఇవి చాలంటావా?"

"పెళ్ళి స్వర్గంలో నిర్ణయం కాదు... మంగళప్రదమయినదీ కాదు ... మనుష్యుల్ని భయపెట్టి మతం రంగు పులిమి పేనిన తాళ్ళతో నాటకు కట్టే తంతు ... అందులో యిరుక్కోవడం తేలిక. బయట పడ్డం కష్టం. పెళ్ళి మీద వెర్రి ఆశ– ఆ తంతుతో జీవితం సఫలీకృతం అవుతుందనీ, అది కాకపోతే బ్రతుక్కి అర్థం లేదనీ అనుకోవడం అతి దారుణం. ఈ వివాహ వ్యవస్థని జీన్‌పాల్ సాత్రే లాంటి మేధావి తిరస్కరించాడు. ఆయన మతపరంగా చర్చిలోనూ, ఆఖరికి రెజిస్ట్రేషన్ ఆఫీసులోగానీ పెళ్ళి చేసుకోలేదు. అయినా భార్యతో కాపురం చేశాడు. ఆ భార్యే రెండేళ్ళు తన నుంచి వెళ్ళి ప్రియుడితో రెండేళ్ళు గడిపి తన దగ్గరకు వచ్చినా, ఆ తరువాత ఆమె సాత్రేతో జీవితాంతం కాపురం చేసింది. ఈ కథ సారాంశం మనకేం చెప్తోంది. సాత్రే ఇండియన్‌లా ఊహించి చూడు... ఆ భార్య బజారు పాలవడమో వేశ్య అవడమో జరుగుతుంది. ఏంగిల్స్, మార్క్స్ కూతురు కూడా ఇలా పెళ్ళి బంధిఖానాలో ఇరుక్కోకుండానే కాపురం చేశారు. వాళ్ళని భ్రష్టులు అంటావా... మూర్ఖులు అందామా? పోనీ మన దేశంలో చూడు. ప్రతీ పెళ్ళి వెనకా బీటలు కన్పిస్తాయి. కొన్ని చిటికి, చిటికి రక్తం కారుతూ గాయాలు రేపుకుంటూ ఉంటాయి..."

"పెద్ద కథ చెప్తున్నావ్"

"కథ కాదు ప్రసాద్, ఇది బాధ. మనం కళ్ళు మూసుకుని స్వర్గాల్ని ఊహిస్తాం. కానీ కళ్ళు తెరిచి వాస్తవాన్ని చూడలేం"

ఇద్దరూ ఇంటి దగ్గర టాక్సీ దిగారు. మాలతి సారదికీ, ప్రసాద్‌కి కాఫీ

యిచ్చింది.

చాలా సేపు మాలతి ఇంటి విషయాలు అడుగుతూ ఉండిపోయింది.

ప్రసాద్ స్నానం చేసి భోజనం చేసి ఆఫీసుకు బయలు దేరుతూ,

"సాయంత్రం ఎటూ పోకు...మేం కొత్త నాటకం మొదలు పెట్టాం. రిహార్సిల్స్‌కి వెడదాం" అంటూ చెప్పి బయటకు వెళ్ళాడు.

"నిన్న కాక మొన్న ఆపరేషన్ జరిగి నానా హడావిడీ చేశాడు. ఇప్పుడీ నాటకాలు ఏమిటట..."

"చెబితే వినరు" అని, మాలతి తిరిగి అడిగింది

"శాంతిని కూడా తీసుకు రావల్సింది అన్నయ్యా" అని. సారథి నెమ్మదిగా అన్నాడు. "శాంతి లేదమ్మా"

"లేదా ఎక్కడికి వెళ్ళింది. పుట్టింటికా?"

"అది తెలియదు. నేను ఇక్కడినుంచి వెళ్ళేసరికే లేదు. ఎక్కడకు వెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో ఆమెకే తెలియాలి. కనీసం ఉత్తరం కూడా రాయలేదు" అంటూ జరిగింది చెప్పాడు.

"ఏ ఇబ్బందుల్లో వుందో"

"నాకు రాయచ్చుగా"

మాలతి మాట్లాడలేదు.

సారథి ఆలోచిస్తూనే కూర్చున్నాడు.

* * *

రిహార్సిల్స్ జరగడానికి ముందే ప్రసాద్ సారథిని తీసుకుని స్కూల్ బిల్డింగ్‌కి వెళ్ళాడు. అప్పటికే డైరక్టర్ మిగతా నటులతో నాటకం గురించి చర్చిస్తున్నాడు.

ప్రసాద్ సారథిని డైరక్టర్‌కి నటుడిగా, దర్శకుడిగా పరిచయం చేస్తూ అన్నాడు

"క్షమించాలి మీతో ఓ మాట చెప్పాలని వచ్చాను" అన్నాడు.

"ఏమిటి?" అన్నాడు డైరక్టర్ విశ్వనాథం.

"నేను ఆఫీసు పనిమీద అర్జంటుగా బొంబాయి వెళ్ళవల్సి వస్తోంది. పది, పదిహేను రోజులు అక్కడే వుంటాను. నా మూలంగా నాటక ప్రదర్శన ఆగిపోవడం మంచిది కాదు. మా సారథిని మీకు అభ్యంతరం లేకపోతే నా వేషానికి తీసుకోండి. అతనో రెండు నెలలు ఇక్కడే వుంటాడు. పైగా ఈ నాటకం ఇదివరలో అతను వేసిందే! మనకు అన్ని విధాల సహాయంగా వుంటాడు."

డైరక్టర్ మిగతా పాత్రధారులతో సంప్రదించి ప్రసాద్ స్థానంలో సారథికి వేషం ఖరారు చేశాడు. ఓ అరగంటలో జగన్ శాంతిని తీసుకుని అక్కడికి వచ్చాడు. శాంతి ఆశ్చర్యంగా సారథిని చూసింది. ఆమెకు మాట రాలేదు.

విశ్వనాథంగారు శాంతితో హీరో వేషధారణలో వచ్చిన మార్పు చెప్పి, సారథిని పరిచయం చేశాడు.

శాంతి "నమస్తే" అంది.

సారథి ప్రతి నమస్కారం చేశాడు. ఆ తరువాత విశ్వనాథంగారు జగన్‌ని శాంతి భర్తగా సారథికి పరిచయం చేశాడు.

జగన్– "మీదేవూరు?"

"అసలు విశాఖపట్టణం. ఈ మధ్యనే హైదరాబాద్ వచ్చాను" అన్నాడు.

రాత్రి పది గంటలవరకూ రిహార్సిల్స్ జరిగాయి. శాంతి సారథితో స్టాండింగ్ రిహార్సిల్ చేయవలసి వచ్చింది.

సారథితో మాట్లాడ్డానికి, మొహంలో మొహంపెట్టి చూడ్డానికి ఆమెకు కొత్తగా అన్పించింది.

నాటకం డైలాగులు చెప్తూనే, "భయం లేదు. నేను వచ్చాను" అన్నాడు.

శాంతి మాట్లాడలేదు.

"జగన్ సంగతి నే చూసుకుంటాను" అన్నాడు నెమ్మదిగా.

రిహార్సల్స్ పూర్తి అయిన తర్వాత జగన్, శాంతి వెడుతూంటే సారథి వెనకే వెళ్ళాడు.

"మీ సతీమణి చక్కగా చేస్తారు. ఆవిడతో నటించడం నా అదృష్టం."

"పరిషత్ లో ఉత్తమ నటిగా చాలా సార్లు బహుమతి కొట్టేసింది. సినిమా ఛాన్స్ కోసం చూస్తూంది."

"అలానా!?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఈ వేషాలవల్ల ఏం వస్తదండీ. వస్తే గిస్తే సినిమాల్లోనే."

"సినిమాల్లో వట్టినే వేషాలివ్వరు. చాలా గొడవలున్నాయి. మీకు అభ్యంతరం లేకపోతే మీ తరఫున నేను ప్రయత్నిస్తాను."

"మీ మేలు మరవను."

"అన్నీ ఇప్పటిమాటలే..."

"ఒట్టు....మిమ్మల్నెప్పుడు కలవమంటారు. మీ అడ్రసు ఇవ్వండి. శాంతిని తీసుకు వస్తా."

సారథి వేసిన మందుతో జగన్ మూర్ఛపోయాడు.

ఆతనికి శాంతిని ఎలాగైనా సినిమాల్లో దింపి తద్వారా లబ్ధిపొందాలని వుంది. అందుకే రిహార్సల్స్ కి వచ్చి సారథిని వదిలేవాడు కాదు. సారథి ఏదో సాకు చెప్పేవాడు.

ఆఖరికి నాల్గోరోజు అన్నాడు.

"రేపు మా ఇంటికి విందుకు రావాలి మీరు. శాంతి పుట్టినరోజు రేపు" అని.

"అలానే-ఎన్ని గంటలకు?"

"రాత్రి"

"మరి రిహార్సల్స్."

"ఒకరోజు పోతే ఏమవుద్దండీ నా బొంద. కావాలంటే మా ఇంట్లో చేసుకుందురుగాని రిహార్సల్స్."

జగన్ మరునాడు సారథికి బ్రహ్మాండంగా విందు చేశాడు. సారథిని క్రింద నుంచో నివ్వలేదు. కూర్చోనివ్వలేదు. సారథికి సపర్యలన్నీ శాంతిచేతే చేయించాడు.

అంతా అయిన తర్వాత,

"నేను ఇప్పుడే వస్తాను. మీరు మాట్లాడుకుంటూండండి." అని బయటకు పోయాడు.

సారథిజగన్ వెళ్ళినతర్వాత"శాంతీ!" అన్నాడు నెమ్మదిగా.

శాంతి పమిటకొంగు నోట కుక్కుకొని ఏడ్వడం మొదలు పెట్టింది.

"ఛా! ఏడుస్తారా ఎవరైనా."

"ఇక్కడ, ఈ నరకంలో నన్ను చూసిన తర్వాత నామీద మీకు యింకా..."

"నరకం మనుష్యులు సృష్టిస్తారు. దాన్ని స్వర్గంగా మలుచు కోవల్సింది మంచి మనసువున్న వాళ్ళు" శాంతి ఏడుస్తూనే వుంది.

"ఇక్కడకు ఎలా వచ్చావ్? నాకో ఉత్తరం రాయక పోయావా? నేను రెక్కలు కట్టుకుని వాలేవాణ్ణి! ఈ మోహానికే నిన్ను మర్చి పోతాననీ, వదిలేస్తాననీ ఎలా అనుకున్నావ్."

"మీకు ఒకటికాదు, రెండు ఉత్తరాలు రాశాను."




"రాశావా"

"ఆఁ"

"అర్ధమయింది శాంతీ, ఇది అన్నయ్య పనే అయ్యుంటుంది" శాంతి విస్తుపోతూ చూసి "అంటే?" అంది.

"అన్నయ్య చాలా ఘనకార్యాలు చేశాడు" అంటూ సారధి జరిగిందంతా చెప్పాడు.

"సరేలే. మన చేతిలో చిక్కాడుగా ఎక్కడికి పోతాడు. చూడు నువ్వు త్వరగా డ్రెస్ మార్చుకుని పెట్టె బేడా సర్దుకుని బయలుదేరు. మాలతి వాళ్ళతో నిన్నీరోజు తీసుకు వస్తానని చెప్పాను."

"వద్దండీ..."

"అదేమిటి"

"ఏ మొహం పెట్టుకుని అక్కడికి రాను. నా బ్రతుకు బజారు పాలయ్యింది."

"అంతా నీవెర్రి. ఏం కాలేదు శాంతి. ఇవన్నీ కల్పించుకున్న కష్టాలు. వీటికి

భయపడ కూడదు. సంతోషం, సుఖం చాలా శ్రమ పడ్డ తర్వాత, ఎన్నో బాధల తర్వాత మనిషికి స్వంతం అవుతాయి...ఎందుకనో తెలుసా? మనిషికి ఇవన్నీ అగ్ని పరీక్షలు. పరీక్షలో నెగ్గిన వాళ్ళు శ్రమ మర్చిపోయి నవ్వాలి,"

"మిమ్మల్ని ఎలా ఒప్పించాలో తెలియడం లేదు. జగన్ దుర్మార్గుడు. రేపు మీ మీదికి వస్తే..."

"అన్నీ సవ్యంగా జరుగుతాయి. జగన్ నుంచి నీకు విముక్తి కలగ జెయ్యాలిగా ముందు. దానికి ప్లాను వేశానులే. పదపద" అంటూ సారధి లోపలికి వెళ్ళి శాంతి సూట్‌కేస్ తీసుకుని మరోచేతో శాంతి చెయ్యి పుచ్చుకుని వీధిలోకి నడిపించుకు వెళ్ళాడు.

అప్పటికే బాగా వెన్నెల వచ్చింది. నక్షత్రాలు నవ్వుతో వెలుగు తున్నాయి. వెన్నెల్లో వెనుతిరిగి చూడకుండా ఇద్దరూ నడవడం మొదలు పెట్టారు.




బయట నుంచి "సారధి గారూ" అన్న పిలుపు విని తలుపు తెరిచాడు సారధి. వెనకే ప్రసాద్ మాలతీ వచ్చారు.

"లోపలికిరా జగన్..."

జగన్ బెరుగ్గా లోపలికి వచ్చాడు.

"అలా కూర్చో..."

"శాంతి వుందాండీ"

"ఎవరూ?" అన్నాడు అర్థం కానట్టు సారధి.

"మా శాంతి"

"మీ శాంతా?"

"మా ఆవిడ..."

"మీ ఆవిడ శాంతి మాట ఏమోగానీ లోపల నా భార్య శాంతి వుంది. పిలుస్తానుండు" అంటూ లోపలికి చూసి "శాంతీ" అని కేక వేశాడు సారధి. శాంతి మామూలుగా వచ్చి అక్కడ వున్న ముగ్గురి మొహాలూ చూసి సారధి పక్కన కూర్చుంది.

"ఇప్పుడు చెప్పు? ఏమిటి విశేషం?"

జగన్ శాంతిని చూసి, "ఇంటికి నడు. ఇక్కడేం చేస్తా?" అన్నాడు.

"చూడు జగన్, నీ గురించి శాంతి నా కంతా చెప్పింది. శాంతిని నువ్విక మర్చి పోవచ్చు" సారధి జగన్‌తో సౌమ్యంగా అన్నాడు.

జగన్ ఆశ్చర్యంగా సారధి వైపు చూశాడు. అతనిలో కోపం—ఏం చెయ్యలేని అసహాయత.

"నేనెవరో నీకు తెలియదేమో...నేను శాంతి రెండు నెలలయ్యింది హైదరాబాద్‌లో పెళ్ళి చేసుకుని" సారధి నెమ్మదిగానే చెప్పాడు.

"అదెలా ? దానికి పుస్తి కట్టింది నేను...అది నా పెళ్ళాం..."

"నీ పెళ్ళాన్ని నువ్వెప్పుడో చంపేశావ్...అయినా నాకు తెలియక అడుగుతాను నీ కిప్పుడు శాంతి ఎందుకు కావల్సి వచ్చిందిట? నీకు గడించి పెట్టడానికా? లేకపోతే నువ్వు పదిమంది దగ్గరకు వెళ్ళమంటే తలొంచుకుని వెళ్ళడానికా ?" సారధి అడిగాడు.

"నా పెళ్ళాం నా ఇష్టం..."

"నీ పెళ్ళాం కాకపోతే..."

జగన్ మాట్లాడలేదు.

"జగన్ శాంతి నిన్ననే కోర్టులో నీతో విడాకులు కావాలని పిటీషన్ పెట్టింది. అదొకటే కాదు. నువ్వు బీట్ చేసి హైదరాబాద్ నువ్వు ఆమెని ఎత్తుకొచ్చావని కోర్టులో నేను కేసు పెడుతున్నాను. ఇప్పుడు చెప్పు? ఏమంటావ్ తయారుగా ఉన్నావా ?"

జగన్ మాట్లాడ లేదు.

"చెప్పు... శాంతిని బలవంతంగా ఎందుకు తీసుకు వచ్చావ్? నీకు పెళ్ళాం అక్కర లేదు. శాంతితో వ్యాపారం చేద్దామనా ?"

"కాదు..."

"మరేమిటి ?"

"ఆయనెవరో కాంతారావు మీ అన్నగారంట. శాంతిని ఏలుకుంటే డబ్బు ఇస్తామన్నాడు..." అంటూ మొదలు పెట్టి జరిగిందంతా చెప్పేశాడు.

సారధీ, ప్రసాద్, మాలతీ ఆశ్చర్యంగా విన్నారు. ఆఖరిగా జగన్ ఓ పావు గంట గొడవ చేసి కోర్టులంటేనూ, పోలీసులంటేనూ భయపడి శాంతి ద్వారా విడాకులు తీసుకుందుకు ఒప్పుకున్నాడు.

''సారధీ అయితే నువ్వులే, జగన్‌ని లాయర్ దగ్గరకు తీసుకు వెడదాం..." అన్నాడు ప్రసాద్. ''మేం వెళ్ళి వస్తాం'' అన్నాడు సారధీ శాంతితో.

శాంతి మౌనంగా తల ఊపింది.

ఐదు నిముషాల్లో ప్రసాద్ టాక్సీ తీసుకు వచ్చాడు. ముగ్గురూ టాక్సీ ఎక్కారు.

ఇంట్లో మాలతీ శాంతీ మిగిలారు.

శాంతికి బాధతో కన్నీరు ఆగలేదు. బావురుమంది సోఫాలో వెనక్కి జారగిలబడి మాలతి శాంతిని ''ఊరుకో శాంతీ'' అంటూ ఓదారుస్తూ,

''ఛా, ఏడవకు..." అంది.

''నా కంతా కలగా వుంది మాలతీ''

''మంచి జరుగుతూంటే కలగా చెడు జరిగితే పీడకలగా వుండడం సహజం శాంతీ...సారధిఅన్నయ్య వుండగా నీకేం భయంలేదు...నీకే కాదు అలాంటి వాళ్ళు అండగా వుంటే ఏ ఆడదానికి భయం వుండదు...''

"ఏమో మాలతీ... పెళ్ళి చేసుకోని దంపతులం మేం. ఆయన తాళి కట్టని భర. నేను ఓ భర్తని వదిలేసిన స్త్రీని. రేపు మా సంతానం...వాళ్ళ భవిష్యత్ ఏమవుతుందో."

మాలతి నవ్వేసింది. "ఏం కాదు శాంతీ కొన్ని రోజులే మన బతుకులు కొంత మందికి వింతగా వుంటాయి. కాలం గడుస్తుంది. మనలాంటి వాళ్ళు ఒకళ్ళకి పదిమంది, పదిమంది వందలుగా పెరుగుతారు. అప్పుడు ఎవరికీ ఎవరూ కొత్త కాదు. ఎవరికీ ఎవరి బతుకుల్లోనూ అపశృతులు వెదకాలనిపించదు."

శాంతి మాట్లాడలేదు.

ఓ గంట తర్వాత సారధీ, ప్రసాద్ వచ్చారు.

"ఏమయ్యింది?" మాలతి అడిగింది.

"సుఖాంతం అయ్యింది. జగన్ లాయర్ చెప్పిన దానికల్లా ఒప్పుకున్నాడు. మా చెల్లాయికి విముక్తి దొరికింది."

"మాలతీ! ఇదంతా కాంతారావు అన్నయ్య చేశాడు. తను చట్టాన్ని అతిక్రమించి బతుకుతూ నన్ను చట్టం



ద్వారా ఉచ్చులో బిగించాలని చూశాడు. అందుకే నాకనిపిస్తుంది. మనసుకు మించిన మంచి న్యాయస్థానం మరొకటి వుండదని."

"కానీ ఈరోజు నువ్వూ ఆ చట్టం ముందు తలవంచవల్సింది కదా ?"

"రోజులు మారి, మనుషులు మారి నప్పుడు చట్టానిదేముంది కొత్త పాటలు విన్పిస్తుంది. అంతా మనలో వుంది."

ఆ రాత్రి మాలతీ ప్రసాద్ కలిసి అలంకరించిన గదిలోకి నూతన దంపతుల్లా, జీవితం పెట్టిన అగ్ని పరీక్షలకు ధైర్యంగా నిలబడ్డ మనుషుల్లా శాంతీ సారధీ వెళ్ళారు.

"ఇప్పుడు భయం పోయిందా?" సారధి శాంతిని దగ్గరగా తీసుకుని అడిగాడు.

"లేదు.ఇదంతా నాకు కొత్తగావుంది."

"భయం ఎందుకో తెలుసా శాంతీ. అందరినీ కాదని కొత్త దారిన వెళ్లే

వాళ్ళందరికీ యీ బెదురూ భయం మొదట్లో వుంటాయి. ఈ భయం ఈ నాటిది కాదు. వారసత్వంగా మనకి వచ్చినది. దీన్ని హేతువాదంతో గుండె ధైర్యంతో ఎదుర్కోవాలి. సమాజంలో సజావుగా మనుగడ సాగించడం అంటే కళ్ళు మూసుకుని ఎవరికి వాళ్ళు తలుపులు మూసుకుని జీవించడంకాదు. మనకో ధ్యేయం వుండాలి. ఆదర్శాలూ వుండాలి. ఇవి ఎంత బలంగా వుంటే అంత బలంగానూ మనకీ, సమాజానికీ అంతర్యుద్ధం జరుగుతూనే వుంటుంది. మన వాళ్ళు సంసారం సాగరం అన్నారు. కాదు. ఈ వేళ సమాజం సముద్రంలా కనిపిస్తోంది నాకు. ఆ సముద్రంలో నిత్యం మంటలూ రేగుతున్నాయి. సజీవ శక్తులన్నీ అతలాకుతలం అవుతున్నాయి. ఇది మనం గుర్తించకుండా రాళ్ళు ఏరుకుని అవే రత్నాలనుకుంటున్నాం. పొరబాటున చేతికి దొరికినా రత్నాల్ని చిల్లపెంకుల్లా పారేస్తున్నాం. ఇలా ఎందుకు జరుగుతోందో తెలుసా? మనం చాలా తక్కువ సద్గుణాలతో ఎక్కువ బలహీనతలతో బ్రతుకుతున్నాం. చాలా బలహీనతలు మనకి చెడు చేస్తూన్నా గుర్తించే స్థితిలో లేము. బలహీనతలు కప్పిపుచ్చుకుని తరాలూ మారేటప్పటికి అవే ఆచారాలుగా, ఆదర్శాలుగా చలామణీ అవుతాయి. ఇది ప్రమాదకరమైన పరిణామం ఈ సాగరంలో మనం కొట్టుకుపోకూడదు. దాన్ని మథించేందుకు నడుం కట్టాలి. లోతుకు వెళ్ళిన కొద్దీ కష్టాలు ఎక్కువగా కన్పిసాయి. మునిగిపోతాం. మంటలో మాడిపోతాం కూడా. ఒక్క సదుద్దేశం మనో నిబ్బరం వుంటే చాలు సుఖాల తీరాన్ని చేరచ్చు. ఆ మంటల్ని ఆర్పుకుని మనసులో వెన్నెల కాచుకోనూవచ్చు"

"సాగర మథనం అంటే అందులోంచి పుట్టిన విషం, ఆ జ్వాలా గుర్తుకొస్తోంది. మీరయితే ఆ విషాన్ని మింగి లోకరక్షణ చేయగలరు. నా సంగతి ఏమిటి? పార్వతిలా నేనే దేవతల దగ్గరకు పరుగెత్తను?" అంది నవ్వుతూ శాంతి.

"ఈ పాటికి నీకు అంతా అర్థమయి వుండాలి శాంతి. ఆ విషం నువ్వు ఏనాడో మింగేశావు. అది నీ కంఠంలో కాదు హృదయంలో వుంది. ఆ రోజు శివుడు మింగింది విషంకాదు. సమాజంలో వుండే చెడుని, రాక్షసత్వాన్ని, ఆ చేదునే అంతం చేశాడు తెలుసా"

"బావుంది"

"ఆలోచించు. ఆయన చేసిందీ సమాజ రక్షణే"

ప్రసాద్ బయట వాకిట్లోంచి ఒక్క కేక పెట్టాడు.

"సారథీ, ఉపన్యాసం ఎప్పుడు పూర్తి అవుతుందో చెప్పు. మేం పడుకోలా... నువ్వు జనగణమన పాడితే మేం లైట్లార్పి నిద్రపోతాం" అని.

శాంతి "చూశావా" అంది.

"మేం సముద్ర మధ్యంలో వున్నాం ప్రసాద్. గట్టుకు చేరగానే నీకు జనగణమన విన్పిస్తుంది. కాని ఈ యాత్ర అంత త్వరగా పూర్తవదేమో మరి"

"అయితే మేం పడుకోం" మాలతి అంది. శాంతి లైటార్పి "చాలు ఈ రోజుకు" అంది నెమ్మదిగా.

సారథికి చీకట్లో కూడా శాంతి కన్పిస్తోంది. ఆశావాది చూపులా సారథి చూపు తీక్షణంగా వుంది అప్పుడు.





# రేపటి వెలుగులు



'పిల్లలున్న ఇల్లు - మల్లెపూల జల్లు' అన్నారు పెద్దలు. ఇంట్లో పిల్లలు తిరుగాడుతుంటే హృదయంలో ఆనందం ఉప్పొంగుతుంటుందట. పిల్లల బోసినవ్వులు ఎలాంటి కష్టాలనైన్నాక న్నీళ్ళనైనా ఇట్టే మరిపించి మురిపించగలవు. ఆనంద మందారాలను కురిపించగలవు. అదైనా ఒకటి... రెండు...మూడయితేనే ముద్దు. అంతకు మించి వద్దే వద్దనుకోవటమే ఉత్తమమని భావిస్తున్నారెందరో!

అందుకు కారణం లేకపోలేదు-

ఆసియాలో ప్రతి పది మంది శిశువుల్లో ఏడుగురు ఎలాంటి వైద్యసహాయం లేకుండానే పుడుతున్నారు. పోషకాహార లోపం వల్ల తల్లులూ, పిల్లలూ జబ్బుల పాలిటా, మృత్యువాతా పడుతున్నారు. 1978లో మన దేశంలో ప్రతి పది మందిలోనూ ఏడుగురు నిరక్షరాస్యులు.

కుటుంబంలో ఆర్థిక ఇబ్బందుల దృష్ట్యా పిల్లలను పనికి పంపటం జరుగుతోంది. ఈ విధంగా అనేక మంది పిల్లలు వ్యవసాయ కూలీలుగా, చేనేత, తోళ్ళ శుద్ధి పరిశ్రమల్లోనూ, షాపులూ, హోటళ్ళు, వాణిజ్య సంస్థల్లోనూ పని చేస్తున్నారు.

ఇంకా ఇళ్ళలో పని మనుషులుగా, పేపర్లమ్మే వారిగా, బూట్ పాలిష్‌చేస్తూ, వీధుల్లో రక రకాల వస్తువులు అమ్మే వారిగా, కసవు చిమ్మే వారిగా, బీడీ పరిశ్రమల్లోనూ, పారిశుద్ధ విభాగాల్లోనూ బాలలే పని చేస్తున్నారు. చేతి వృత్తుల



పిల్లలున్న చోటుకంటే వేరే స్వర్గం లేదు.
వారిని క్రమశిక్షణతో పెంచకపోతే అది నరకమే! — స్విన్‌బర్న్

పరిశ్రమల్లో పని చేసే వారిలో 80 శాతం పైగా బాలలే వున్నారు.

నవ్వుతూ, తుళ్ళుతూ ఆడుకుంటూనో, చదువు కుంటూనో వుండాల్సిన వయసులో లక్షలాది బాల బాలికలు వచ్చీ రాని నడక రాగానే పనిలోకి పంపబడే స్థితికి వస్తున్నారు మన దేశంలో.

ప్రతిదేశం యొక్క ఆర్థిక, సామాజిక అభివృద్ధి కార్యక్రమాల్లో బాలల సంక్షేమం అంతర్భాగంగా ఉండాలన్న విషయాన్ని అన్ని ప్రభుత్వాలకు తెలియ జెప్పడానికి ఈ సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ఐక్యరాజ్య సమితి ప్రకటించింది.

1979 మార్చి 6వ తేదీన బాలల దినంగా పరిగణించారు. ఈ ఏడాదిలో చేయబోయే అంతర్జాతీయ బాలల కార్యక్రమాల గురించి సమగ్రమైన చర్చలు జరిపి పిల్లలకు సంబంధించిన డాక్యుమెంటరీలు, సినిమాలు, ప్రయోజనాత్మక పద్ధతుల్లో నిర్మించాలని తీర్మానించారు.

పసివారికి కష్టం కలుగకుండా తల్లి ఆలనా, పాలనా వుండేందుకు బిడ్డ పుట్టిన దగ్గరినుంచి తల్లికి ఆరు నెలలు శలవు దినాలుగా ప్రకటించాలని పశ్చిమ జర్మనీ ప్రకటించింది. ఈ శలవు దినాలు 1979 జూలై నుంచి అమలులోకి వస్తాయి.

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా ఆరోగ్యం, పౌష్టికాహారం, విద్య, సాంఘిక సంక్షేమం, శాసనం విషయాల్లో బాలల పరిస్థితి మెరుగుదలకు ఒక జాతీయ ప్రణాళికను భారత ప్రభుత్వం రూపొందించింది. దేశంలో బాల కార్మికుల సమస్యను పరిశీలించడానికి కేంద్ర కార్మికశాఖ ఒక జాతీయ కమిటీని ఏర్పాటు చేసింది.





1979·International
Year of the Child

పిల్లలే లేకుంటే ఈ లోకమెంత దుర్భరమో!

– కోల్ రిడ్జి



# పసిపాప భవిష్యత్తు తల్లి పెంపకం పైనే ఆధార పడి ఉంటుంది — బోనపార్టీ

బాలల సంక్షేమం విద్యాసౌకర్యాలతో ముడిపడి వున్నందున ఈ ప్రణాళిక కాలంలో 6-14 ఏళ్ళ మధ్య వయసు బాలలు కోటి 20 లక్షల మందికి విద్యా సౌకర్యాల కల్పనకు ప్రభుత్వం లక్ష్యంగా నిర్ణయించింది.

నేటిబాలలే రేపటి పౌరులు. మంచుతో తడిసిన మల్లెపువ్వుల్లా, అమాయకంగా, నిర్మలంగా వుండే బాలల్ని భావిపౌరులుగా తీర్చిదిద్దటం ఎంతో బాధ్యతతో కూడిన పని. క్రమ శిక్షణతో, వారికేం కావాలో తెలుసుకుని, అమరుస్తూ అనునయంతో పెంచాలి. పిల్లల సందేహాలకు సమాధానాలు చెప్పడం అంత తేలికైన పని కాదు.

ప్రేమగా చూసే తల్లిదండ్రుల పెంపకంలోనే పిల్లలు ఇతరులను ప్రేమించడం నేర్చుకుంటారు. ఎలాంటి సంఘటన అయినా వారి లేత మనసుల్లో తేలిగ్గా ముద్ర వేసుకుంటాయి. అంచేత వారిని చక్కని వాతావరణంలో పెంచాలి.

పసిపిల్లలు అల్లరి చేస్తున్నారని వారిని వేరేగదుల్లో పడుకో బెట్టినట్లయితే తలి దండ్రులపై వ్యతిరేక భావం ఆ పసి హృదయాల్లో నాటుకుంటుంది. వారు పక్కని తడిపివేయటం, వేళ్ళనీ గోళ్ళని కొరుక్కోవటం, ఉన్నట్లుండి పెద్దగా అరవటం చేస్తుంటారు! ఎనిమిది నెలల పిల్లల్ని ప్రత్యేకంగా పడుకోబెట్టినా తల్లి దగ్గరుండి ప్రేమతో నిద్ర పుచ్చాలి. లేకపోతే మానసికంగా దెబ్బ తింటారు. లాలిత్యం, మృదుత్వం తమ పట్ల శ్రద్ధ పెద్దలకి వుండాలని పిల్లలు కోరుకుంటారు.



...ల్లలకి గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవడం గిట్టదు
...ికి మేధస్సును పెంచే పనేదైనా వప్పగించాలి – లాక్స్

తల్లి చేతుల్లో ఆడుకుంటూ పెరిగిన పిల్లలు ఇతర పిల్లలతో కలిసిపోయినంతగా ఒంటరిగా పెరిగిన పిల్లలు ఉండలేరు. మానసికంగా ఎదగలేరని పరిశోధకులంటున్నారు.

తల్లిదండ్రులు పిల్లల పట్ల తమ ప్రవర్తన ఎలా వుండాలనేది ముందుగా తెలుసుకోవాలి. అకారణంగా పిల్లల్ని ముద్దు చేయటమూ ప్రమాదమే! నిరక్షరాస్యులైన పెద్దలు తమ పిల్లల్ని సక్రమంగా అర్థం చేసుకోలేరు. సనాతన కుటుంబాల్లో అమ్మమ్మలు, బామ్మలు చెప్పినట్లు నడుచుకోవాలని ఆంక్షలు విధిస్తారు. ఇలాంటి అయోమయ పరిస్థితిలో పిల్లలకి మానసికంగా పెద్ద విఘాతం ఏర్పడుతుంది.

తల్లిదండ్రులకు సరైన అవగాహన, ఆలోచనా శక్తి, లేక ఎందరో పిల్లలు కోరింతదగ్గు, డిఫ్తీరియా, మశూచికము లాంటి వ్యాధులు సోకి చనిపోతున్నారు. పెద్దలు సున్నిత హృదయులైన పిల్లల్ని విపరీతంగా భయపెట్టి, కొట్టటం వల్ల జడుసుకుని సంధిజ్వరం వచ్చి మరణించే వారి సంఖ్య కూడా అధికంగానే ఉంది.

జర్మనీలో శిశు సంక్షేమ సంస్థ ఒకటి ముందుకు వచ్చి నిరక్షరాస్యులైన తల్లిదండ్రులకు పిల్లల్ని క్రమ శిక్షణతో పెంచే విధానాన్ని తెలియజేసే కార్యక్రమాలు చేపట్టేందుకు కృషి చేస్తామని ప్రకటించిందట. అక్కడి రాష్ట్ర ప్రభుత్వాలు మొదటిసారి తల్లులైన వారికి ఉత్తరాల ద్వారా సలహాలు, సూచనలు ఇస్తూ, వారి సమస్యలను రాబట్టేందుకు సర్వే చేస్తున్నారు.



పిల్లల్తో కలిసిపోయి ఆడిపాడగలిగినప్పుడు వారిని
నీ ఇష్టం వచ్చినట్లు మలచవచ్చు — బిస్మార్క్




చిన్న పిల్లలను ప్రమాదాల నుంచి రక్షించడం కంటే అసలు ప్రమాదమే వాటిల్లకుండా చూడటం ముఖ్యం. తెలివి, సమయస్ఫూర్తి, నేర్పు ఉండే పిల్లలు ప్రమాదాల నుండి యిట్టే తప్పించుకో గలరు. వారికి ప్రమాదాల గురించి తీసు కోవలసిన జాగ్రత్తలు చిన్నప్పటినుంచే నేర్పుతూ వుండాలి. కేవలం తల్లిదండ్రులే కాక కిండర్ గార్డెన్‌లోను, పాఠశాల ల్లోనూ ఈ విషయాలు బోధించి, పిల్ల లకు అర్థమయ్యేలా నేర్పాలి.

1977 లో జర్మనీలో ఫెడరల్ రిప బ్లిక్ ప్రాంతంలో 70 వేల మంది 14 ఏళ్ళ వయసు లోపు పిల్లలు రోడ్డు ప్రమాదాల వల్ల గాయపడ్డారనీ, 1,353 మంది తీవ్ర గాయాలతో మరణించా రనీ సర్వేలో తేలింది.

ఇంట్లో వంట చేసేటప్పుడు, ఇస్త్రీ పెట్టె, స్టౌ మొదలైన విద్యుత్ పరిక రాలు పిల్లలకి అందుబాటులో లేకుండా వుంచాలి.

చిన్న కుటుంబం చింతలు లేని కుటుంబం అనే సూత్రాన్ని దృష్టిలో వుంచుకుని ఆర్థిక స్తోమత లేనపుడు కుటుంబాన్ని పరిమితం చేసుకోవటం మంచిది.

నేటి పెద్దలే నిన్నటి పిల్లలుగా దృష్టిలో వుంచుకుని తమ పిల్లలకు కావలసినంత స్వేచ్ఛ ఇవ్వాలి. వాడు ఆడుకునేందుకు చక్కని ఆట స్థలాల ఏర్పాట్లు వుండాలి. వారి కేరింతలను చూసి ఆనందించాలేగాని 'వెధవ గోల' అని వారిని కించపరచకూడదు. పిల్లల వయసు వ్యత్యాసాలకు తగినట్లు ఆట



వంద ఏళ్ళనాటి పిల్లల గుర్రబ్బండి

స్థలాలు, పార్కులూ కట్టినప్పుడే వాటికి సార్థకత వుంటుంది. గతంలో మనం పొందలేని వాటిని మన పిల్లలకి అందుబాటులో వుండేలా చూడాలి. నిరాశ నిస్పృహలకు సాధ్యమైనంత దూరంగా పిల్లల్ని పెంచాలి.

చాలామంది తల్లిదండ్రులు పిల్లల మాటల్ని వినిపించుకోరు. వారి మనసును అర్థం చేసుకునేందుకు ప్రయత్నించరు. ప్రోగ్రెస్ రిపోర్టులో మార్కులు తక్కువ వచ్చాయని తల వాచేటట్లు చివాట్లు పెడతారు. వారికి తమ బాధల్ని, సమస్యల్ని అర్థం చేసుకుని సానుభూతి చూపేవారు కావాలి.

జర్మనీలో 'పిల్లల సంరక్షక సంస్థ' వారు ముప్పయి ఆరేళ్ళ గృహిణిచేత ఫోన్‌లో ఈ సమస్యకు పరిష్కారం చూపిస్తున్నారు. ఈ పద్ధతిని 'ప్రీ టెలిఫోన్' అంటారు. ప్రతి సోమవారం మధ్యాహ్నం పిల్లలు ఆమెకి ఫోన్‌చేసి వారి బాధలు చెప్పుకోవచ్చు. ఆమె సమాధానాలిస్తుందిట. ఆ రోజు ఆమెకి ఊపిరాడనంతగా ఫోన్ కాల్స్ వస్తుంటాయి. దీన్నిబట్టి ప్రశాంతంగా వున్న పిల్లలెంతమంది వున్నారో అర్థమవుతోంది.

ఈ సంస్థవారే 1976లో జర్మనీలో 15 గదులుండే ఓ పెద్ద గృహం నిర్మించారు. ఒక గదినుండి మరో గదిలోకి దారి వుంటుంది. పిల్లలు ఎవరికి ఇష్టమైన గదిలో వారు ఆడుకోవచ్చు. చదువు నేర్పేందుకు, వారి మంచి చెడ్డలు చూసుకునేందుకు, ఆరోగ్య వైద్య సౌకర్యాలు కల్పించేందుకు కొందరు అసిస్టెంట్లు వుంటారు.

'మీకిష్టమైన పని చేసుకోండి. కానీ ఆడుకుంటూ ఏకాగ్రతలో వున్న పిల్లలను






ఆటంకపరచకండి' అనే బోర్డులు అక్కడ కనిపిస్తాయి. తల్లిదండ్రులు మధ్యలో వచ్చి తమ పిల్లల్ని చూసుకుని వెళ్ళవచ్చు.

అలాగే ఓ పెద్ద హాలులో రకరకాల ఆట బొమ్మలుంటాయి. పిల్లలు తమ ఇంట్లోలేని కొత్త రకం ఆట బొమ్మలతో తమ కిష్టమైనంత సేపు ఇక్కడ ఆడుకోవచ్చు. అందుకుగాను కొంత మూల్యం అద్దెగా చెల్లించాల్సి వుంటుంది. కొంచం ఊహా శక్తి పని చేయాలనే తపన వుండాలే గాని పిల్లల కోసం ఎంతో చేయవచ్చు.

టెలివిజన్ కార్యక్రమాలు పిల్లల్ని అమితంగా ఆకట్టుకుంటాయి. వాటి ద్వారా చక్కని విజ్ఞాన, వినోదాత్మక విషయాల్ని పిల్లలకి బోధించవచ్చు. బొమ్మల ద్వారా బోధనపై పిల్లలు ఎక్కువ ఆసక్తి చూపుతారు.

అంతర్జాతీయ బాలల సంవత్సరం, బాలల హక్కుల 20వ వార్షికోత్సవం కలసి రావడం ఎంతో ముదావహం. చిన్న పిల్లల పత్రికలు ఎలా వుండాలి, పిల్లల సినిమాలు, థియేటర్లు, సంగీతం, సభలు ఏ విధంగా నిర్వహించాలి అనే అంశాలు చర్చింపబడుతున్నాయి.

కేవలం ఈ ఒక్క ఏడాదిలోనేకాక ప్రతి సంవత్సరం ప్రపంచంలోని బాలల మధ్య సుహృద్భావాన్ని, సామరస్యాన్ని పెంపొందించడం, పిల్లల కోసం వినోద, విజ్ఞాన కార్యక్రమాలు చేపట్టడం విషయంలో అటు ఆయా దేశాలు, ఇటు తల్లిదండ్రులు పూర్తి మద్దతు శ్రద్ధ చూపాలి. చిన్నారిలోకస్సమస్తా స్సుఖినోభవన్తు.

— శమిల

# వైద్యం

ముకుందంకి పెళ్ళయి మూణ్నెల్లయింది.

ములక్కాడలా సన్నగా, బలహీనంగా వుండే ముకుందం దాంపత్య జీవితాన్ని తృప్తికరంగా అనుభవించలేక మనోవ్యధతో క్రుంగి పోతున్నాడు.

అతని పరిస్థితి గమనించిన ప్రక్కింటాయన నాంపల్లి స్టేషను దగ్గరున్న డాక్టర్ ఆసనమూర్తిని కలుసుకోమని ఉచితసలహా ఇచ్చాడు.

ఆ సలహాని పుచ్చుకుని ముకుందం డాక్టర్ దగ్గరికి పరుగెత్తాడు.

ముకుందం చెప్పిన అనారోగ్య వృత్తాంతమంతా ఆలకించి డాక్టర్ ఆసనమూర్తి క్షణాలమీద ఏవేవో వైద్యానికి సంబంధించిన గ్రంథాలూ, కేటలాగులూ తిరగేసి చేతివేళ్ళు మడిచి, విడిచి ఏవేవో లెక్కలు వేశాడు.

"చూడు ముకుందం నీ ఆరోగ్యం బాగుపడే మార్గం నీ చేతిలోనే వుంది. వ్యాయామం వల్ల మనిషి పుష్టిగా, ఆరోగ్యంగా ఉంటాడు. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుని నీవు ప్రతిరోజూ ఉదయాన్నే అయిదు మైళ్ళు చొప్పున పరుగెత్తాలి. అలా చేస్తే నీకెలాంటి అనారోగ్యం వుండదు. నే చెప్పినట్లు పరుగెత్తి పది రోజుల తర్వాత నీ పరిస్థితి ఎలావుందో నాకు ఫోన్‌చేసి చెప్పు. నీలోని చురుకుదనానికి నీ భార్య కూడా నిన్ను ఎంతగానో ప్రేమిస్తుంది తెలుసా" అన్నాడు.

ముకుందం అలాగేనని తలూపి వెళ్ళిపోయాడు. పదిరోజుల తర్వాత డాక్టర్ ఆసనమూర్తికి ఫోన్ వచ్చింది.

డాక్టరుగారు మొదట ముకుందం గొంతు గుర్తుపట్టలేదు. తర్వాత ఫలానా అని వివరం చెప్పగానే, "ఓహోహో! నీవటోయ్! ఆఁ...నే చెప్పినట్లే వ్యాయామం చేస్తున్నావన్నమాట! ఇప్పుడు ఇంట్లో పరిస్థితి ఎలావుంది?" అనడిగారు డాక్టరుగారు. వెంటనే అవతలి నుంచి సమాధానం వచ్చింది. "ఇంట్లో సంగతి నాకెలా తెలుసుందండీ. మీరు చెప్పిన ప్రకారం రోజూ ఉదయాన్నే అయిదు మైళ్ళు పరుగెడుతున్నాను కదా!" అన్నాడు ముకుందం.



"అయితే...ఇంట్లో ఎలాంటి మార్పు వచ్చిందో ఎందుకు చెప్పలేవు?" అన్నారు. డాక్టరుగారు.

"నేనిప్పుడు ఇంటికి యాభై మైళ్ళ దూరంలో వున్నాను. ఇంటినుంచి బయలుదేరి పది రోజులైంది గదండీ" అవతలి నుంచి అన్నాడు ముకుందం.

—సి. వి. లత

# ఉంగరం

పిచ్చేశ్వరరావు హడావుడిగా పోలీసు స్టేషన్‌కి పరుగెత్తికెళ్ళాడు. ఆయన కంగారుకి కారణం ఏమిటని అడిగాడు పోలీసు ఇన్‌స్పెక్టర్ పురుషోత్తం.

"ఈవేళ తెల్లారి మేము నిద్రలేచే సరికి మా దొడ్డి తలుపులు తెరిచి వున్నాయి. అనుమానం వచ్చి చూస్తే నేను రోజూ నా సొరుగులో పెట్టే



బంగారు ఉంగరం మాయం అయింది. అది మా మామగారు పెళ్ళిలో పెట్టింది. తప్పకుండా మీరు పోయిన ఉంగరాన్ని ఎలా అయినా పట్టుకోవాలి సార్" ప్రాధేయపడ్డాడు పిచ్చేశ్వరరావు.

"సరే...తప్పకుండా మేం గట్టిగా పరిశోధించి దొంగని పట్టుకుంటాం. మీరు ధైర్యంగా ఇంటికి వెళ్ళవచ్చు" అని తనకు కావలిసిన వివరాలు అడిగి, తన డైరీలో రాసుకుని పిచ్చేశ్వరరావుని పంపేశాడు ఇన్‌స్పెక్టర్ పురుషోత్తం.

పిచ్చేశ్వరరావు దిగులుగా ఇంటికొచ్చి, ఆ ఉంగరం గురించే ఆలోచిస్తూ, నీరసం వచ్చి నిద్రపోయాడు.

రెండోరోజు ఉదయమే పిచ్చేశ్వరరావు భార్య బుచ్చేశ్వరి భర్తని తట్టి లేపి "ఏమండీ! పోయిందనుకున్న మీ ఉంగరం దొరికిందండీ. మన చంటిది దాన్ని నీళ్ళ బిందెలో పడేసినట్టుంది ... ఇదిగో చూడండి!" అంటూ ఉంగరం అందించింది.

పిచ్చేశ్వరరావు ముఖం ఆనందంతో విప్పారింది. వెంటనే పోలీసు స్టేషన్‌కి ఫోన్ చేసి ఉంగరం దొరికిన విషయాన్ని ఇన్‌స్పెక్టర్‌కి తెలియజేశారు.

ఇన్‌స్పెక్టర్ పురుషోత్తం అది విని కంగారు పడ్డాడు. "అదేమిటి పిచ్చేశ్వరరావు గారూ! మేము మీ ఉంగరం దొంగతనం విషయంలో దర్యాప్తు జరిపి ఇప్పటికే 15 మంది నేరస్తుల్ని అరెస్టు చేశాము. వారిలో ఆరుగురు తాము మీ ఉంగరాన్ని దొంగిలించినట్టు నేరాన్ని ఒప్పేసుకున్నారు కూడా!" అన్నాడు ఫోన్ అవతలి వైపు నించి.

పిచ్చేశ్వరరావుకి పిచ్చెక్కినంత పని అయింది.

—'చా'

# అనుభూతి

సూరిబాబు గంజాయి గొప్పదనం గురించి తన మిత్ర బృందానికి వివరిస్తూండేవాడు. గంజాయిని సిగరెట్లలోకి ఎలా నింపేదీ, వాటిని కాల్చినప్పుడెలాంటి అనుభూతి కలిగేదీ అభినయంతో సహా చెప్పేవాడు.

"ఒరే సూరీ! మాకూ ఓసారి గంజాయి

దమ్ము లాగి, ఆనందించాలని కోరికగా వుందిస్మీ" అన్నారు అతని మిత్రులు.

ఓ రోజు ఆ శుభ ఘడియ రానే వచ్చింది. సూరిబాబు ఆప్త బంధువొకడు ఊర్నించి వస్తూ సూరిబాబుకో గంజాయి పొట్లం తెచ్చిచ్చాడు.

సూరిబాబు ఈ విషయం చెప్పేసరికి మిత్రులంతా ఎగిరి గంతేశారు.

సూరిబాబు ఇంట్లోనే కూర్చుని ఓ పెట్టె సిగరెట్లు కొని వాటిల్లో పొడిని తీసి, గంజాయి కలిపి మళ్ళీ అన్నిటిలోనూ నింపేరు.

సాయంత్రం అందరూ ఓ చోట




చేరేరు. మిత్ర బృందంలో ముఖ్యుడు, గంజాయిని సిగరెట్లలోకి నింపడంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన రామ్మూర్తి మాత్రం రాలేదింకా. అతనికోసం చాలా సేపు ఎదురుచూసి, ఓపిక నశించి మిత్రులంతా ఓ నిర్ణయానికొచ్చి గంజాయి నింపిన సిగరెట్లు తలో రెండు తీసుకుని కాల్చసాగారు. అంతకుముందే గంజాయి దమ్ము అనుభవం వున్న సూరిబాబు వాటిని ఎలా పీల్చాలో, పొగని ఎలా మింగాలో, అప్పుడు ఎలాంటి అనుభూతి కలుగుతుందో వివరిస్తూన్నాడు.

సూరిబాబు చెపుతున్నట్లే స్నేహ బృందానికి గంజాయి నిషా పూర్తిగా ఎక్కిపోయింది. గాల్లోకి తేలిపోతున్నట్లు, ప్రాణాలు తేలిగ్గా అయిపోతున్నట్లు అనుభూతిని పొందుతున్నారు. జోకులు వేసుకుంటూ పగలబడి నవ్వుతున్నారు. సూరిబాబుకి ముందే అలవాటున్నందున అంతగా నిషా ఎక్కలేదు.

వాళ్ళంతా ఆ నిషాలో ఏమిటేమిటో పేలుతూ, త్రుళ్ళుతూ, గట్టిగా అరుచుకుంటూ హడావుడి చేస్తున్నారు.

అంతలో దూరంగా పరుగెత్తుకొస్తున్న రామ్మూర్తి కనిపించాడు వారికి. పరుగు పరుగున వాళ్ళదగ్గరకొచ్చిన రామ్మూర్తి "సారీ ఫ్రెండ్స్! అర్జెంటు పని తగిలి ఆలస్యమయింది. నా కోసమే ఎదురు చూస్తున్నారనుకొంటాను. గంజాయి నింపిన సిగరెట్ల పాకెట్టు నా దగ్గరే వుండిపోయింది. ఇక మొదలెడదామా" అంటూ జేబులోంచి పాకెట్ తీశాడు.

—వినూత్న

# బోడి వందలు

సాయంత్రం ఆఫీసునుంచి అలసిపోయి ఇంటికి వచ్చిన ప్రకాశానికి ఆ ఉత్తరం చూశాక చిరాకు మరింత ఎక్కువైంది. కారణం—తన నాయనమ్మ వస్తోంది. పెళ్ళయ్యాక మనవణ్ణీ, మనవరాల్నీ చూశ్చేదట. అందుకని.

'నెలాఖరు రోజులు. పైగా కొత్త సంసారం. వచ్చిందా పదిరోజుల్దాక కదల్దు. ఈ విషమ పరిస్థితిని ఎదుర్కోవటం ఎలా ?'- చటుక్కున ఐడియా వచ్చి సొరుగులోంచి కార్డు తీసి వెంటనే ఉత్తరం రాశాడు.

పూజనీయమైన నాయనమ్మకు,

నీ మనవడు ప్రకాశం రాయునది. ఇక్కడ క్షేమం. నీ వుత్తరం అందినది. సంగతులు గ్రహించాను. మా ఆఫీసులోవాళ్ళు, మేము మైసూరు, మద్రాసు యాత్ర వెళ్తున్నాము.




టిక్కెట్లు రిజర్వేషన్ కూడ అయిపోయింది. అందుకని ఏమీ అనుకోవద్దు. ఇంతే సంగతులు.

ఇట్లు
ప్రకాశం.

ఉత్తరం డబ్బాలో పడేసి గండం గడిచిందని గట్టిగా ఊపిరిపీల్చుకున్నాడు. ఇంటికొచ్చి తన బుర్ర పాదరసంలా ఎలా పనిచేసిందో శ్రీమతికి చెప్పాడు. అంతా విని "ఏమిటండీ! ఇలా చేశారు? పాపం చూద్దామని ఎంతో ఆత్రుతతో రాస్తే మీరిలా చేయటం బావుండలేదు" అంది భార్య జాలిగా.

"ఛట్. నీకు తెలీదు. నెలాఖరు రోజులివి. మనమే కిందామీదా పడతాంటే మా నాయనమ్మ వచ్చిందా త్వరగా కదల్దు" అన్నాడు కోపంగా.

"మనకెంత లేకపోతేమటుకు కలో గంజో మనతోటే తినేదిగదా" అంది.

"చాల్లేవోయ్ నీ జాలి. తర్వాతొస్తుందిలే" అని అన్నాడు ప్రకాశం.

నెల గడిచింది.

ఓ రోజు ప్రకాశం ఆఫీసునుంచి రాగానే భార్య కార్డొకటి ఇచ్చింది. అది తన నాయనమ్మ రాసింది.

చి॥ మనవడు ప్రకాశంకు,

ఇక్కడ క్షేమం. అమ్మాయి, నువ్వూ క్షేమమని తలుస్తున్నాను. ఈ పాటికి మీరు యాత్ర వెళ్ళి వచ్చేసి వుంటారనుకుంటున్నాను. కొత్త సంసారం కదా! బట్టలూ, సామాన్లూ కొని పెడదామని ఓ అయిదొందలు దాచి ఉంచాను. ఈలోగా నువ్వు యాత్రకు వెళ్తున్నానని రాశావు. అయినా అంత పెద్ద యాత్రకెళ్ళే సంపాదనాపరుడివి నీకు నా బోడి అయిదొందలు ఓ లెక్కా అని వూరుకున్నాను. అవి నిన్ననే మన సుబ్బిగాడికిచ్చేశాను.

ఇట్లు
మీ నాయనమ్మ

ఉత్తరం చదివి తెల్ల మొహం వేశాడు ప్రకాశం.

—బాలం వెంకట్రావు

# అసలు సంగతి

రామ్మూర్తి ప్రవర్తనలో రెండురోజులుగా విచిత్రమైన మార్పు వచ్చింది. తన భర్తలో వచ్చిన వింత మార్పుకి కారణం ఏమిటో ఎంత బుర్ర బద్దలు చేసుకున్నా అనూరాధకి అంతు బట్టలేదు.

మొన్నటికి మొన్న పక్క వాటాలో వుండే పానకాలరావుగారు వచ్చి 'నమస్కారమండీ రామ్మూర్తిగారూ!' అనగానే ఒంటికాలి మీద కోట్లాటకి లేచి ఇష్టమొచ్చినట్లు చివాట్లేశాడు రామ్మూర్తి.

నిన్న ఉదయం రెండో పక్కవాటాలో వుండే ఉదయసాగర్‌గారి చిన్నబ్బాయి తమ ఇంట్లోకి వచ్చి తన ఫైళ్ళు, అవీ పెన్నుతో పిచ్చి గీతలుగీసి ఖరాబు చేశాడని ఫిర్యాదు చేస్తూ వాళ్ళమీద విరుచుకు పడ్డాడు. ఆ కుర్రాడు అసలు తమ యింటికొచ్చి భర్త ఫైల్సు ముట్టుకోలేదనే విషయం అనూరాధకి బాగా తెలుసు.

ఎదురింటి వెంకటరత్నంగారి అమ్మాయి వారపత్రిక కోసం వస్తే ససేమిరా ఇవ్వనన్నారు. మొన్న పట్టుకెళ్ళిన 'చతుర' పట్టుకురా-తీసికెళ్ళిన పుస్తకాలు తిరిగి వ్వకపోతే ఎలా అని యుద్ధానికి దిగారు.

"ఏమండీ... మనం చతుర వాళ్ళకి ఇవ్వనే లేదండీ. మీరే మీ ఆఫీసరుగారికివ్వడానికి తీసికెళ్ళారు గదా!" అంది అనూరాధ మెల్లగా.

"నువ్వు నోర్మూసుకుని ఊరుకో..." అంటూ కళ్ళెర్రజేసి గర్జించాడు.

ఆయన ప్రవర్తన చూసి అనూరాధకి ఎక్కడలేని భయం పట్టుకుంది. రామ్మూర్తికి పిచ్చిగానీ పట్టలేదుకదా అనే అనుమానమూ వచ్చిందామెకి. ఆ రాత్రి మంచం మీద రామ్మూర్తి లాలనగా అనూరాధను తనవైపు తిప్పుకోబోయాడు. అనూరాధ విదిలించి కొట్టింది. "రెండ్రోజుల్నుంచి మీరు ఏమిటోగా వుంటున్నారు. ఇంటి చుట్టు పక్కల వారితో కావాలని తగాదా పెట్టుకుంటున్నారు. మీకేమయింది? నాకెందుకో మీ ప్రవర్తన చూస్తుంటే భయంగావుంది" అందిబుంగమూతి పెట్టి.



"ఓసి పిచ్చిదానా! అందుకా నీ అలక. వచ్చే వారంలో మనం టెలివిజన్ కొనబోతున్నాం కదా! అప్పుడు చుట్టుపక్కల వాళ్ళంతా వచ్చి మన ఇంట్లో టి.వి. చుట్టూ కూచుని మనల్ని ప్రశాంతంగా చూడనివ్వరు. వాళ్ళందరితో గొడవ పెట్టుకున్నామనుకో ... ఎవరూ మన ఇంటికి రారు. అప్పుడు మనకి ఎలాంటి గొడవా వుండదు"అంటూ తన ఆలోచనని చెప్పాడు రామ్మూర్తి.

—బుమణి

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004.  Regd No. H/HD/402



# మేషరాశి

మార్చి 21 - ఏప్రిల్ 20

## శక్తి సంపన్నతా చిహ్నం

కార్యసాధన వీరి ఊపిరి. సాహసం వీరి ప్రాణం. చెక్కు చెదరని ఆత్మస్థయిర్యం వీరి సొత్తు. అందునా-జేబులోనే ఉండవలసినదివుంటే ఇక చెప్పేదేముంది? కరెన్సీ కాగితాలు, చెక్ పుస్తకం, మార్గదర్శి పాస్ పుస్తకాలతో అవి నిండుగా వుంటే మరింకేం కావాలి?

మేషరాశి జాతకుల విశిష్ట వ్యక్తిత్వంలో గమనించదగ్గ అంశం మరొకటికూడావుంది. మార్గదర్శి పై వారికి గల విశ్వాసం వారి అణువణువునా ప్రతిబింబిస్తూ ఉంటుంది అది సహజం. మేషరాశి జాతకుల ఆశలనూ, ఆశయాలనూ మార్గదర్శి ఫలవంతం చేయగలదు. అందుకు రకరకాల చిట్‌లు తోడ్పడుతాయి.

సాటిలేని సేవా సౌకర్యాలు... ఆదుకొనే చెల్లింపులు... మార్గదర్శి ప్రత్యేకతలు.

పదకొండు శాఖలతో, ఏభై వేలకు పైగా సభ్యులతో అత్యున్నతమయిన సంస్థగా పదహారేళ్లయి నిలదొక్కుకుని ఉండడానికి అదే కారణం.



**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్
మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

డబ్బుకోసమేనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత!

KIRON/MCF